# ఆంధ్రప్రదేశ్

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | ... | 1,06,286 చదరపు మైళ్లు. |
| జిల్లాలు | ... | 20 |
| తాలూకాలు | ... | 189 |
| పట్టణాలు, నగరాలు | ... | 212 |
| గ్రామాలు | ... | 28,997 |
| పూర్తి జనాబా (1961) | ... | 359.83 లక్షలు |
| జనసాంద్రత | ... | ఒక చదరపుమైలుకు 339 |
| అక్షరాస్యులు (1961) | ... | 76.27 లక్షలు |
| నికర సాగుభూమి (1960-61) | ... | 10,783,000 హెక్టర్లు |
| పశువులు (1961) | ... | 326.43 లక్షలు |
| నమోదైన ఫ్యాక్టరీలు (1961) | ... | 3,140 |
| విద్యుదుత్పాదన (1962) | ... | 1.120.3 మిలియన్ కె డబ్ల్యు హెచ్. |
| విద్యుత్ సౌకర్యాలుగల పట్టణాలు, గ్రామాలు (1962-63) | ... | 4,315 |
| విశ్వవిద్యాలయాలు | ... | 4 |
| కళాశాలలు (1961-62) | ... | 125 |
| ఉన్నత పాఠశాలలు (1961-62) | ... | 1,435 |
| వృత్తివిద్యా పాఠశాలలు | ... | 440 |
| పంచాయతీలు (1959-60) | ... | 14,552 |
| అభివృద్ధి మండలాలు (31-3-1963 నాటికి) | ... | 446 |
| 1961-62 లో అప్పటి ధరలనుబట్టి రాష్ట్రాదాయం అంచనా | ... | రూ 1,066.40 కోట్లు |
| పార్లమెంటు సభ్యులు | ... | 61 |
| శాసన సభ సభ్యులు | ... | 301 |
| శాసన మండలి సభ్యులు | ... | 99 |

# ఆంధ్రప్రదేశ్

ప్రధాన సంపాదకుడు — టి. రామచంద్రరావు
సంపాదకుడు — కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

భాద్రపదం - ఆశ్వయుజం 1886 శకం
సెప్టెంబరు, 1964

సంచిక : 11 **సంపుటి : 9**

## విషయ సూచిక

2 ముఖ్యమంత్రి లేఖ

4 శ్రీ కనకధారా స్తవము
— డా. బూర్గుల రామకృష్ణరావు

7 తప్పు స్వర్గము
— డా. బెజవాడ గోపాలరెడ్డి

9 గ్రామసభ – దాని ఆవశ్యకత (వెలుగు బాటలు)
— పి. వి. మనోహరరావు

12 జయము
— మోచర్ల రామకృష్ణకవి

13 నృసింహకవి కవితా విలాసం
— యామిజాల పద్మనాభస్వామి

17 ఉదాత్త సారస్వతము
— శిష్టా రామకృష్ణశాస్త్రి

25 సంగ్రామభేరి
— డా. సి. నారాయణరెడ్డి

26 పారిశ్రామిక విశేషాలు

27 పిలుపు
— దీపాల పిచ్చయ్య శాస్త్రి

28 తెలుగు నవలా వికాసం (మన చరిత్ర – సంస్కృతి)
— వేటూరి ఆనందమూర్తి

32 తెలుపు – నలుపు

35 అధ్యాపకుని అధికారం (కథానిక)
— జమదగ్ని

41 జంగం కథలు
— మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

46 కమ్యూనిటీ రేడియో సెట్లు



"పల్లెపడుచు" చిత్రకారుడు : పి. వి. శ్రీనివాసరావు

47 ఏరిన ముత్యాలు

49 తెలంగాణాలో సాహితీ సేవ
— గడియారం రామకృష్ణశర్మ

53 ప్రగతి పథంలో

54 వేశ్య (అనువాద భారతి)
— మూలం : శ్రీమతి స్నేహలతా దస్నూర్‌కర్
— అనువాదం : చంద్రమౌళి

59 సంగ్రహ ప్రకటనలు

63 ప్రభుత్వ నిర్ణయాలు

64 మహిళలు, మాతృదేశము (లలనావనం)
— ఊటుకూరు శకుంతలాదేవి

66 వీరగీతము
— శ్రీరంగవరపు కేశవాచార్య

67 ఘనకార్యం (బాలానందం)
— కల్యాణసింగ్

68 అధ్యాపకుడు : అతని కర్తవ్యప్రతిపత్తులు
— అనుపూరు నాగభూషణరావు

72 ప్రశ్నలు – సమాధానాలు

74 గ్రంథసమీక్ష

79 ముఖ్యవార్తలు

ముఖచిత్రం : చిరునవ్వుల పూలు

సంవత్సర చందా రు. 3_00
విడి ప్రతి రు. 0_25 పైసలు

# ముఖ్యమంత్రి లేఖ

ప్రియమైన సంరక్షకా!

పాఠశాలలు, కళాశాలలలో ఇప్పుడు విద్యా కార్యకలాపాలు ముమ్మరంగా సాగిపోతున్నాయి. అయితే పరీక్షా ఫలితాలను ఆలస్యంగా ప్రకటించిన కారణంగా కొన్నిచోట్ల ప్రవేశాలు పూర్తి చేయడంలో అసాధారణమైన ఆలస్యం జరిగినట్లు కనిపిస్తుంది. సాధారణంగా విద్యార్థి విద్యార్థినుల తల్లిదండ్రులకు ఈ కాలం బాగా ఆతృతను కల్గించే కాలం. పిల్లలను పాఠశాలల్లో ప్రవేశ పెట్టడం, వాళ్ళ జీతాలు కట్టడం, పుస్తకాలూ, పాఠశాల యూనిఫారాలూ కొనడం —యివే తీరికలేని పనులు వారికి. జాతీయ వికాసానికి యిప్పట్టిన మనం చేపట్టవలసిన మొదటిది విద్యారంగం. నూటికి నూరుపాళ్లూ అక్షరాస్యతను వెల్లివిరిసేటట్టు చేయడమే కాదు, సాంకేతికంగా వికసించిన మానవ శక్తినికూడా అధికంగా మనం శీఘ్రతరంగా సాధించవలసివుంది. భారత ప్రగతికి, అవసరమైతే యీ విషయమై ఏ త్యాగాన్నయినా తమ వంతుగా చేయడానికి, తల్లిదండ్రులంతా సంసిద్ధులుగా వుండాలి. అంతేకాదు తమ పిల్లల చదువులకై ఖర్చుచేసే ప్రతిపైసా సక్రమంగా వినియోగింపబడేట్టూ, మొగ్గతొడిగిన ఆ చిన్నిహృదయాలు సువాసనలు విరజిమ్మే రంగురంగుల పూలుగా పరిపూర్ణ వికాసమందేటట్లు చూడాలి.

మన విద్యార్థులు మొత్తంమీద క్రమశిక్షణ కలవారే. జాతీయతా భావాన్ని, సమైక్యత, సహనగుణాల్ని లేతహృదయాలలో, చదువుకున్న తల్లిదండ్రులు నాటుతారనడంలో ఎలాటి సందేహమూ లేదు: కాని తమ పిల్లలు చేపట్టవలసిన ప్రత్యేకమైన విద్య విషయంలో వీరు సరియైనశ్రద్ధ తీసుకుంటున్నారా? ఈ విషయంలో తల్లిదండ్రులకు అశ్రద్ధ పనికిరాదు; అయితే మరీ పంతమూ ఉండకూడదు. విద్యార్థుల తల్లిదండ్రులు తరచుగా వృత్తివిద్యలకూ, సైన్సుకూ అధిక ప్రాధాన్యత యివ్వడం నాకు బాధగానే వుంది. మనం కలలు గంటోన్న సోషలిస్టు తరహా సమాజం రూపురేఖలు దిద్దుకోవడానికి సాంకేతిక పనివారలు అవసరమే అనుకోండి. కాని సాంకేతిక విద్యతో సరిసమానమైన సారస్వత, కళా విజ్ఞానాన్ని బలి చేసి సాంకేతిక అభ్యుదయ సాధనకు కృషిచేయడం తగనిపని. అందుచేత మనం కళలకు, సారస్వతానికి పూర్వౌన్నత్యాన్ని తిరిగి సంతరింప జేయాలని నా అభిప్రాయం. మానవ మనోవికాసానికి కళలు, సారస్వతం చక్కటి ఉపకరణాలు. ప్రాచీన గ్రీకు సంస్కృతిలోనుండి ప్లేటోవంటి తత్వవేత్తలే కాదు ఆర్కిమెడిస్‌వంటి శాస్త్రజ్ఞులు కూడా ఉద్భవించారు.

చదివే అలవాటు మెల్లమెల్లగా సన్నగిల్లి పోతున్నదని కూడా నాకు అనిపిస్తున్నది. ఆధునిక జీవితంలో కాలాన్ని వేగంతో జయించేగుణం యిందుకు కొంత కారణం అనొచ్చు. మానవ అభిరుచుల్లో వచ్చిన మార్పులుకూడా మరోకారణం. ఈనాడు కుర్రాడికి ఏ కొద్దిపాటి తీరుబాటు దొరికినా యింట్లో ఏ మూలో పుస్తకం పట్టుకుని కూర్చొనో, దగ్గర్లోని గ్రంథాలయానికి వెళ్ళటమో చేయడం కన్న ఏ సినిమాకో వెళ్ళడానికే ఎక్కువ అభిలషిస్తాడన్న విషయం ప్రతితల్లిదండ్రులకూ తెలుసు. అన్నిటికన్నా పఠనంవల్ల ఎక్కువ ఉల్లాసం కలుగుతుంది. మానవుడు సాధించిన అంతులేని విజ్ఞాన సంపత్తితో విద్యార్థులకు పరిచయం కలిగించడమే మన విద్యకు ధ్యేయం కావాలి,

ఆటల్లో, క్రీడల్లో, యితర వ్యాయామ రంగాల్లో మన యువకులు యితర దేశీయులతో పోల్చిచూస్తే బాగా వెనుకబడే వున్నారు. విద్యార్థుల్లోని యీ లోపాలు వారి భవిష్యత్ జీవితంమీద కూడా ప్రతిఫలిస్తాయి. ముందుముందు ఆయా జీవితాల్లో స్థిరపడినప్పటికి ఆ లోపాలు అక్కడికికూడా విస్తరిస్తాయి. అందువల్ల మానవ సంపద మనకు విస్తారంగా వుండివున్నప్పటికీ ఆ సంపదనుండి తగిన ప్రతిఫలాన్ని పొందలేకపోతున్నాం మనం.

స్వేచ్ఛా భారతావని ఔన్నత్యాన్ని గుర్తించి ప్రజాస్వామ్య స్వేచ్ఛా, వాయువులతో మన జీవితాలను సుసంపన్నం చేసుకోవాలంటే మనం దేశనిర్మాణ కార్యకలాపాలపట్ల ఎక్కువ శ్రద్ధ చూపించవలసివుంది. దేశానికి ఉపయోగకరమైన పౌరులుగా మన విద్యార్థులు రూపొందడానికి వీలుగా చక్కటి అవకాశాలను వారికి కల్పించాలంటే కళలు, సాహిత్యం, విజ్ఞానశాస్త్రం, క్రీడలు, ఆటలు, వ్యాయామాలు, వినోదకార్యక్రమాలు, నైతికబోధలు — వీటన్నిటినీ సమీకరించాలి.

మన విద్యార్థుల్లోని మరొకలోపం బహిరంగ సభల్లో మాట్లాడలేకపోవడం. వెనుకటిరోజుల్లో సురేంద్రనాధ్, బిపిన్‌చంద్రపాల్, సరోజిని, శ్రీనివాసశాస్త్రి వంటి వక్తలు తమ గంగాఝరీ వాక్ప్రవంతితో ప్రజలను మంత్రముగ్ధులను చేశారు వర్తమానతరంలో మంచివక్తలసంఖ్య క్రమంగా మృగ్యమైపోతున్నది పాఠ్య ప్రణాళికల్లో సభాప్రసంగాన్ని సైతం నిర్బంధంగా చేసి యీ లోపాన్ని అరికట్టడం సాధ్యమవుతుందేమో.

విద్యార్థులు ఆయా కోర్సులను ఎన్నుకోవడం అనేది కేవలం దైవికంగా అయిపోయింది యీ నాడు. మొన్ననే ఒక విద్యార్థి కలిశాడు. భూగర్భశాస్త్రం కోర్సులో అతనికి ప్రవేశం లభించక ఆర్థికశాస్త్రం కోర్సులో చేరాడట. మరొకతను భౌతిక శాస్త్రంలో

ప్రవేశం లభించక తెలుగుభాష తీసుకున్నాడట దీనినిబట్టి విద్యార్థులకు తాము తీసుకోదలచిన కోర్సులనుగూర్చి సరియైన అభిప్రాయాలు లేవని తేలుతున్నది. ఈ రకంగా దైవికంగా ఆయా కోర్సుల్లో ప్రవేశించడంవల్ల ముందుముందు అనేకసమస్యలు తల ఎత్తుతాయి. విద్యార్థికి ఆ పాఠాలమీద ఆసక్తి వుండదు. ఆసక్తి లేకుండా తరగతులకు హాజరవుతాడు. పరీక్షల్లో తక్కువమార్కులు వస్తాయి. ఆ తర్వాత నిరాశతో జీవితం ప్రారంభమవుతుంది. తమ పిల్లల అభిరుచులను మనసులో పెట్టుకుని తల్లిదండ్రులే తగినకోర్సులను తెలివిగా నిర్ణయించాలి.

కాయకష్టానికిగల స్థానాన్ని, గౌరవాన్నిపూర్తిగా గుర్తించాలని కూడా నేను కోరుతున్నాను. పల్లెటూరు నుంచి బస్తీకి వచ్చి మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణుడైన పిల్లవాడు తిరిగి తన స్వగృహము చేరుకునేవరకు తనను గురించి తాను ఎన్నో అతిశయోక్తితో గూడిన అభిప్రాయాలు ఏర్పరచుకుంటాడు ఒక వేళ అతని తండ్రి మంచి కుమ్మరివాడైతే ఆ పిల్లవాడు ఆదే వృత్తిని స్వీకరించడానికి నిరాకరిస్తాడు ఇటు తన వృత్తిని అసహ్యించుకుంటూ, అటు ఉద్యోగం దొరకక అతని జీవితం దుర్భరమవుతుంది. అందుకే కాలేజి లేక ఉన్నత పాఠశాలలో చదువు పూర్తి అయ్యి జీవితంలో ప్రవేశించే యువకునికి కనీసం ఒక సంవత్సరంపాటు గ్రామీణ ప్రాంతాలలో వృత్తి పరిశ్రమలలో తగిన ప్రతిఫలంతో నిర్బంధంగా పనిచేయించాలనే ఆలోచనకు సుముఖంగా ఉన్నాను. క్రొత్తతరంవారిలో తగిన మానసిక పరిస్థితి తప్పకుండా అభివృద్ధి అయ్యేందుకు ఇది దోహదం చేస్తుంది.

మన విద్యార్థిలోకంలో దుబారాతనం ప్రబలిపోవడం మరో విచారకరమైన విషయం. ఇది వారిలోని బాధ్యతారహితమైన భావనను ప్రతిబింబిస్తుంది విలువైన దుస్తులు, సిగరెట్లు, సినిమాలను వయోజనపౌరులకన్నా ఎక్కువగా బహుశా విద్యార్థులే పోషిస్తున్నారు. తల్లిదండ్రులు విద్యార్థులలోని యీబలహీనతను నిరుత్సాహపరచి వారిలో పొదుపరితనాన్ని కలిగింపజేయాలి.

దేశంలోని మన యువకులు తెలివితేటలలో, ప్రపంచంలోని అభివృద్ధి చెందిన దేశాలలోని యువకులకేమీ తీసిపోరు తగిన అవకాశాలు లభిస్తే మన యువకులు ఏమనైనా చేయగలుగుతారనే దానికి ఇటీవల ఐన్‌స్టీన్ సిద్ధాంతాలకు క్రొత్త నిర్వచనం కనుగొన్న డాక్టర్ నార్లేకర్ దృష్టాంతరం. సరి అయిన మార్గదర్శకత్వం, ఆశయం లభింపజేసి తద్వారా క్రొత్త శకానికి వారిని సాధనాలుగా తయారు చేయడమే ఇప్పటి కర్తవ్యం.

యువకుల పురోభివృద్ధికి తల్లిదండ్రులు మహత్తరమైన పాత్రను నిర్వహించాలి. యీ బాధ్యతను కేవలం ఉపాధ్యాయులకు వదిలివేసి మరచిపోయేది కాదు. బాల్యదశలో వారి మనస్సులపై ప్రభావితమయ్యే ఆలోచనలే ఆ తర్వాత వారి భవిష్యత్ జీవితంలో ప్రధాన పాత్ర వహిస్తాయి. పిల్లలకు ప్రథమ దృష్టాంతరం తల్లిదండ్రులు. వారు తమ సన్నిహితులు ప్రవర్తించే తీరుపైనే తమ వ్యక్తిత్వాని అభివృద్ధి చేసుకుంటారు అందువల్ల తల్లిదండ్రులు తమపిల్లలకు ఆదర్శ ప్రాయంగా ఉండి వారి పెంపకం విషయంలో వ్యక్తిగత ఆసక్తి చూపాలి. తమ పిల్లలకు పాఠశాలలో డబుల్ ప్రమోషన్ లభింపజేసి ఆ విధంగా వారు ఇతరులకు గర్వకారణం కావాలనే చాలామంది తల్లి దండ్రులు ప్రయత్నిస్తూ ఉంటారు. అయితే దూరం ఆలోచిస్తే వారు పిల్లలకు మంచికన్నా చెడునే చేస్తున్నారని నేను భావిస్తున్నారు. పిల్లలకు బ్రహ్మాండమైన తెలివితేటలుగాక పిల్లలు జీవితంలో పరిపూర్ణత చెందే టట్టు చూడాలి. వారిని నలుగురిలోచూపే ప్రదర్శనా వస్తువుగా కాక విజ్ఞానవంతునిగా చేసేందుకు ప్రయత్నించాలి. దీనికై తక్షణం పైమెట్టకు దూకే తత్వాన్ని అరికట్టాలని నేను భావిస్తున్నాను. సమగ్రత వ్యక్తిత్వాన్ని పెంపొందించడమే విద్యయొక్కలక్ష్యం. యీ విషయంలో తల్లి దండ్రులు ఎంతైనా చేయవచ్చు. అన్ని విధాల ఆరోగ్యకరమైన సభ్యులను సమాజానికి అందించడం తల్లి దండ్రుల విధి.

మనం నవ శకారంభ ప్రాంగణంలో ఉన్నాము. ఇప్పుడు ఉన్నన్ని ఉన్నత విద్యాభ్యాస అవకాశాలు మన దేశ చరిత్రలో యెన్నడూ లేవు. అనేక విధాలైన కోర్సులు లభ్యమవుతున్నాయి.

ఎన్నో స్కాలర్ షిప్పులు ఇతర ఆర్థిక వసతులు కల్పింపబడుతున్నాయి. 1947 వ సంవత్సరంతో పోల్చిచూస్తే యీనాడు వివిధ విద్యా సంస్థలలో బాలికల సంఖ్య మూడింతలు పెరిగింది. ప్రపంచంలోని ఇతర ప్రాంతాలలో మార్పులను చూడడానికి విదేశాలకు వెళ్ళడానికీ పోటీ పరీక్షలలో పాల్గొనడానికీ ఎన్నో అవకాశాలేర్పడి మన విద్యార్థులకు క్రొత్త మార్గాలెన్నో యీనాడు ఉన్నాయి. ఈ అవకాశాలన్నిటినీ మన యువకులు పూర్తిగా వినియోగించుకొని వారు తమకు తాము దేశానికి సహాయపడ్తారని ఆశిద్దాం. తల్లిదండ్రులు వారి పిల్లల జీవితాన్ని బాగా తీర్చిదిద్ది, మంచి మార్గంలో పెట్టి తగిన సలహాలను ఇచ్చి మన ప్రాచీన సంస్కృతి విలువలను గౌరవింపచేసి క్రొత్త సవాలును ఎదుర్కొనేట్టు చేస్తారని కూడా ఆశిద్దాం.

జైహింద్

# *శ్రీ కనకధారాస్తవము

—డా॥ బూర్గుల రామకృష్ణరావు

అఙ్గం హరేః పులకభూషణ మాశ్రయన్తీ
భృఙ్గాఙ్గనేవ ముకుళాభరణం తమాలమ్
అఙ్గీకృతాఖిల విభూతి రపాఙ్గలీలా
మాఙ్గల్యదాస్తు మమ మంగళదేవతాయాః

చ॥ పులకలు భూషణమ్ములయి పొల్చు ముకుందుని మేననిల్చి, య
గ్గలముగ మొగ్గలన్ దొడగు కానుగు( జేరెడి తేటిపోల్కి( ; కో
మలనయనాంచలమ్ముల సమస్తవిభూతుల దాచికొన్న శ్రీ
లలన యపాఙ్గమంగళవిలాసము, నాకు శుభమ్ము లిచ్చుతన్.

ముగ్ధా ముహుర్విదధతీ వదనే మురారేః
ప్రేమత్రపా ప్రణిహితాని గతాగతాని
మాలాదృశో మధుకరీవ మహోత్పలేయా
సా మే శ్రియం దిశతు సాగర సంభవాయాః

చ॥ భ్రమరి మహోత్పలమ్ముపయి వ్రాలెడుభంగి మురారి మోముపై
క్రమముగ ప్రేమయున్ ద్రపయు గ్రమ్మగ, నిల్చుచు నిల్వనోపకే
త్రెమలి, గతాగతంబులయి ద్రిమ్మరు సాగరకన్య ముగ్ధదృ
క్సుమములమాల నాకు నొసగున్ కడునిత్యవిశేషసంపదల్.

విశ్వామరేంద్ర పదవిభ్రమదానదక్ష
మానందహేతు రధికం మురవిద్విషోఽపి
ఈషన్నిషీదతు మయి క్షణ మీక్షణార్ధ
మిందీవరోదర సహోదర మిందిరాయాః

మ॥ అమరేంద్రాది మహాపదప్రచురభవ్యస్తవ్యదానక్రియా
క్షమమై, శ్రీమురవైరి యత్యధిక హర్షప్రాప్తికిన్ హేతువై,
యమలేందీవరసుందరోదరసదృక్షాలోకనశ్రీకమా
కమలార్ధోల్లసితేక్షణంబు క్షణ మీ కామ్యార్థిపై నిల్చుతన్.

ఆమీలితాక్ష మధిగమ్య ముదా ముకున్ద
మానందముద్ర మనిమేష మనఙ్గతన్త్రమ్
ఆకేకరస్థితకనీనిక పక్ష్మనేత్రమ్
భూత్యై భవేన్మమ భుజఙ్గశయాఙ్గనాయాః

చ॥ ముదమున కన్గవన్ సగము మూసి పరుండు ముకుందునిన్ రతిన్
బొదవు చనంగ తంత్రమున పూనికచే, ననిమేషమౌచు, స
మ్మదమొదవన్ స్థిరంబులగు పక్ష్మకనీనికలోరచూపులన్
మెదలు భుజంగశాయి సతి మేలగుక న్నిడు నాకు సంపదల్.

కాలాంబుదాళి లలితోరసి కైటభారేః
ధారాధరే స్ఫురతి యా తటిదంగనేవ
మాతుస్సమస్త జగతాం మహనీయమూర్తి
భద్రాణి మే దిశతు భార్గవనందనాయాః

ఉ॥ నీలవలాహకంబుపయి నిల్చి వెలింగెడు క్రొమ్మెఱుంగునాన్
గాలపయోదసుందరము కైటభమర్ధను స్నిగ్ధవక్షమం
దోలిమెలంగు భార్గవి మహామహనీయసుదృష్టి లోకమా
త్రాలసితాదరమ్మున సమంచితభద్రము లిచ్చు నాకిలన్.

బాహ్వంతరే మధుజితశ్శ్రితకౌస్తుభేయా
హారావళీవ హరినీలమయీ విభాతి
కామప్రదా భగవతోఽపి కటాక్షమాలా
కల్యాణ మావహతు మే కమలాలయాయాః।

చ॥ ఆ మధువైరి కౌస్తుభసమంచితవక్షమునందు నెద్ది తా(
గోమలశక్రనీలమణిగుంఫితహారమునా వెలుంగు, స
త్కామితదాయియౌ నల జగత్పతికేని( గటాక్షమాలికా
శ్రీమహనీయ మా కమలదృష్టి శుభంబుల నా కొసంగుతన్.

ప్రాప్తమ్పదమ్ప్రథమతః ఖలు యత్ప్రభావాత్
మాఙ్గల్యభాజి మధుమాథిని మాన్మథేన
మయ్యాపతే త్తదిహ మంథర మీక్షణార్ధమ్
మందాలసం చ మకరాలయ కన్యకాయాః।

ఉ॥ దేని ప్రభావ మూతగ రతిప్రియు మాన్మథవిద్య దొల్త(గా
నూనె( బదంబు మంగళగుణోన్నతు(డౌ మధువైరిపై(, దదం
భోనిధికన్యకాప్రణయముగ్ధకటాక్షసమాంశ మిప్ప డీ
దీనునిమీద మంథరగతిన్ బడు(గాత మదాలసంబుగన్.

* శ్రీ శంకర భగవత్పాదుల సంస్కృత మూలమునకు పద్యానువాదము.

దద్యాద్దయా నుపవనో ద్రవిణాంబుధారా
మస్మిన్నకించ నవిహంగ శిశౌ విషణ్ణే
దుష్కర్మఘర్మ మపనీయ చిరాయదూరమ్
నారాయణప్రణయినీ నయనాంబువాహః।

శా॥ శ్రీనారాయణ సుందరీ ప్రణయపారీణాక్షి ధారాధరం
బీ నిర్భాగ్యవిహంగశాబముపయిన్ హేమాంబుధారన్ దయా
మానస్పర్శనచోదితంబగుచు డాయుంగాక వర్షింపగా
నేనఃపుంజనిదాఘముం దొలఁచి తా నెంతేని దూరంబుగన్.

ఇష్టావిశిష్ట మతయోఽపి యయాదయార్ద్ర
దృష్ట్యా త్రివిష్టపపదం సులభం లభంతే
దృష్టిః ప్రహృష్ట కమలోదరదీప్తిరిష్టామ్
పుష్టిం కృషీష్ట మమ పుష్కరవిష్టరాయాః।

ఆ॥ ఏ దయార్ద్రదృష్టి నిష్టత్రివిష్టప
మగు విశిష్టమతుల కతిసులభము,
ఆప్రహృష్టపుష్కరాంతరకాంతి యా
కమలదృష్టి పుష్టిఁ గలుగఁజేయు.

గీర్దేవతేతి గరుడధ్వజ సుందరీతి
శాకంభరీతి శశిశేఖరవల్లభేతి
సృష్టిస్థితి ప్రళయ కేళిషు సంస్థితాయా
తస్యై నమ స్త్రిభువనైక గురో స్తరుణ్యై।

శా॥ చిల్లీలన్ జగదుద్భవస్థితిలయశ్రీకార్యవృత్తిస్థనే
తల్లిన్ బ్రాహ్మిగ, విష్ణుసుందరిఁగ, నాస్థాణుప్రియన్‌గా జగం
బుల్లేఖించు, సతంబు; వందనశతం బొప్పారఁ బ్రార్థింతు నా
ముల్లోకంబుల యొజ్జరాణిని ననున్ బ్రోవంగ శాకంభరిన్.

శ్రుత్యై నమోఽస్తు శుభకర్మఫలప్రసూత్యై
రత్యైనమోఽస్తు రమణీయగుణార్ణవాయై
శక్త్యైనమోఽస్తు శతపత్రనికేతనాయై
పుష్ట్యైనమోఽస్తు పురుషోత్తమ వల్లభాయై।

చ॥ శ్రుతికి నమస్కరింతుఁ గృతశోభనకర్మఫలప్రసూతికిన్,
రతికి నమస్కరింతు గుణరత్నమహార్ణవభవ్యమూర్తికిన్,
సతము నమస్కరింతు జలజాతనికేతనయైన శక్తికిన్,
ప్రతికి సమృద్ధిఁగూర్చు హరివల్లభ కేను నమస్కరించెదన్.

నమోఽస్తు నాళీక నిభాననాయై
నమోఽస్తు దుగ్ధో దధిజన్మభూమ్యై
నమోఽస్తు సోమామృత సోదరాయై
నమోఽస్తు నారాయణ వల్లభాయై

గీ॥ వందనమ్ములు ఫుల్లాబ్జ వదన నీకు,
వందనమ్ములు దుగ్ధాబ్ధినందన కివె,
ఇందు పీయూషసహజకు వందనములు,
వందనమ్ములు శ్రీహరి వల్లభకును.

నమోఽస్తు హేమాంబుజపీఠికాయై
నమోఽస్తు భూమండలనాయికాయై
నమోఽస్తు దేవాదిదేవాపరాయై
నమోఽస్తు శార్ఙ్గాయుధ వల్లభాయై।

క॥ హేమాబ్జపీఠనిలయకు,
భూమండల నాయికకును భూరినమస్సుల్,
కామదకు దేవదేవ
గ్రామణిని శార్ఙ్గపాణికాంతకు మ్రొక్కుల్.

నమోఽస్తు దేవ్యై భృగునందనాయై
నమోఽస్తు విష్ణో రురసిస్థితాయై
నమోఽస్తు లక్ష్మ్యై కమలాలయాయై
నమోఽస్తు దామోదర వల్లభాయై।

క॥ దేవికి భృగునందనకున్,
శ్రీవిష్ణుభుజాంతరమునఁ జెలగెడు సిరికిన్,
నా వినతులు కమలాలయ
కా వైకుంఠుని వధూటి కంజలిశతముల్.

నమోఽస్తు కాన్త్యై కమలేక్షణాయై
నమోఽస్తు భూత్యై భువనప్రసూత్యై
నమోఽస్తు దేవాదిభి రర్చితాయై।
నమోఽస్తు నందాత్మజ వల్లభాయై।

క॥ వందనములు గమలేక్షణ
కిందిరకు విభూతిరూప కీ భువనంబుల్
పొందుగఁ గాంచిన తల్లికి,
నందాత్మజ సతికి నతులు నతనిర్జరకున్.

సంపత్కరాణిసకలేంద్రియ నందనాని
సామ్రాజ్యదాని విభవాని సరోరుహాక్షి
త్వద్వందనాని చరణాభరణోద్యతాని
మామేవ మాతర నిశం కలయంతు మాన్యే।

మ॥ సకలైశ్వర్యకరంబులున్, సుఖదముల్, సర్వేంద్రియానందకా
రకముల్, ప్రాభవమై భవోన్నతమహారాజ్యప్రదంబుల్ త్వదం
ఘ్రికలాపోద్యతవందనంబులు, ధరిత్రిన్, దల్లిరో! తన్నమః
ప్రకరంబింక వరించుఁగావుత నను న్పద్మాక్షి! యశ్రాంతమున్.

శ్రీకటాక్ష సముపాసనావిధిః
సేవకస్య సకలార్థ సంపదః
సంతనోతి వచనాఙ్గమానసైః
త్వాం మురారి హృదయేశ్వరీం నుమః।

చ॥ అకలుషభక్తి మానసము నంగము వాక్కును గూర్చి చేయు నీ
ప్రకటకటాక్షజాలసముపాసన మెప్పుడు భక్తకోటికిన్
సకలసుఖార్థసంపదల సంఖ్య మొసంగుచునుండు, దల్లి తా
వక పదపంకజంబులకు వందనముల్ మురవైరిసుందరీ.

సరసిజనయనే సరోజహస్తే
ధవళతమాంశుక గంధమాల్యశోభే
భగవతి హరివల్లభే మనోజ్ఞే
త్రిభువనభూతి కరిప్రసీదమహ్యమ్.

ఆ॥ ఓ సరోజహస్త! ఓ సరోజాక్షి!
ధవళగంధమాల్య సువాసనాఢ్య
ఓ యుపేంద్ర గృహిణి! ఓ యమ్మ భగవతీ!
సకలధనసవిత్రి! ప్రసన్న వగుమ.

దిగ్ఘస్తిభిః కనకకుంభముఖావసృష్ట
స్వర్వాహినీ విమలచారుజలప్లుతాఙ్గీమ్
ప్రాతర్నమామి జగతాం జననీ మశేష
లోకాధినాథ గృహిణీ మమృతాబ్ధిపుత్రమ్.

చ॥ ఎనిమిది దిగ్గజంబులు పయింబయి బంగరుకుండలందు నిం
చిన సురవాహినీజల మశేషముగాఁ గురిపించు ధారలన్
దనిసెడు చారుగాత్రకు, మదంబకు, సాగరకన్యకున్, జగ
జ్జననికి, సర్వలోకపతిజాయకు మ్రొక్కెదఁ బ్రొద్దుప్రొద్దునన్.

కమలే కమలాక్షవల్లభే త్వం
కరుణా పూరతరఙ్గితై రపాఙ్గైః
అవలోకయ మా మకించనానాం
ప్రథమ మ్పాత్రమ కృత్రిమం దయాయాః।

మ॥ కమలాక్షప్రియవల్లభా! కమల! సత్కారుణ్యపూరోర్మిజా
లమనోజ్ఞంబులు నీ యపాంగములు, లీలన్ సోక వీక్షింపు, ప్రా
థమికాకించను నన్నుఁ బెక్కుసిలుగుల్ దప్పించి, తల్లీ!యకృ
త్రిమపాత్రంబుగఁజేసి నీ దయకు నెంతే భక్తచింతామణీ!

స్తువన్తియే స్తుతిభి రమీభి రన్వహమ్
త్రయీమయీం త్రిభువనమాతరం రమామ్
గుణాధికో బహుధనధాన్యసమ్పదో
భవన్తి తే భువి బుధభావితాశయాః॥

శా॥ ఏ భక్తాగ్రణు లీ స్తవంబులఁ ద్రిరావృత్తంబుగా నిత్యమున్
శోభామూర్తిఁ,త్రయీమయిన్,త్రిభువనస్తుత్యన్, రమామాత నెం
తే భావించి స్తుతింతు, రట్టి సుజనుల్ హేమాంబరాద్యంచిత
శ్రీభవ్యుల్ బుధభావితాశయులు నై జీవింతు రీ ధారుణిన్.

సువర్ణధారాస్తోత్రం య చ్ఛంకరాచార్య నిర్మితమ్
త్రిసంధ్యం యః పఠేదేత త్సకుబేర సమోభవేత్

గీ॥ కనకధారా స్తవం బిది కనకదంబు
శంకరాచార్యకృతము నిశ్చలత నెవఁడు
మూడు సంధ్యలఁ బఠియించుఁ బూర్ణభక్తి
మహిఁ గుబేరునిఁ బోలు సంపదల నొందు.

బిల్వాటవీమధ్య లసత్సరోజే
సహస్రపత్రే సుఖసన్నివిష్టామ్
అష్టాపదాంభోరుహపాణిపద్మామ్
సువర్ణవర్ణాం ప్రణమామి లక్ష్మీమ్.

మ॥ అల బిల్వాటవిమధ్యసీమల సహస్రాచ్ఛచ్ఛదాబ్జంబుపై
నెలవై యుండి, సుఖోపవిష్ట యగుచున్ నిత్యంబు హస్తాబ్జమం
గళసౌవర్ణసరోజమూర్తి యయి తాఁ గన్పట్టు నా తల్లి కు
జ్వలహేమాంచిత వర్ణగాత్రికి నమస్కారంబు శ్రీలక్ష్మికిన్.

కమలాసన పాణినా లలాటే
లిఖితా మక్షరపంక్తి మస్యజంతోః
పరిమార్జయ మాతరంఘ్రిణా తే
ధనికద్వార నివాస దుఃఖదోగ్ధ్రీమ్.

మ॥ ధనికద్వారనివాసదుఃఖచయపాత్రత్వంబుఁ జేకూరఁగ
ల్గిన గాఢాక్షరపంక్తి నా నొసట నోలిన్ వ్రాసియుంచెన్ విరిం.
చనుఁ డాత్మీయకరంబునన్ జనని! వాత్సల్యంబుమై దానిఁ బా
వనమౌ నీదు పదంబునన్ దుడువఁగాఁ బ్రార్థించెదన్ భార్గవీ

అంభోరుహం జన్మగృహం భవత్యా
వక్షస్థలం భర్తృగృహం మురారేః
కారుణ్యతః కల్పయ పద్మవాసే
లీలాగృహం మే హృదయారవిన్దమ్

గీ॥ అంబ! నీజన్మగృహ మది యంబుజంబు
భవ్య మురవైరి వక్షంబు భర్తృగృహము
పద్మవాసిని! నాదు హృత్పద్మ మిపుడు
కరుణ, లీలాగృహంబుఁగాఁ గనుము తల్లి.

(లిపిక)

# తప్పు స్వర్గము

డా॥ బెజవాడ గోపాలరెడ్డి

(విశ్వకవి రవీంద్రనాథ ఠాగుర్ 'ఖూల్ స్వర్గ్' అనే బెంగాలీ వచన గేయానికి స్వేచ్ఛానువాదం.)

వాడు బొత్తుగ పనికిమాలినవాడుగా యుండినాడు. వాడికి ఏ పనీ లేక పోయినా, పలు విధములైన విషయాల్లో రుచి,ఆసక్తి ఉండేది.

చిన్న చిన్న కర్రలతో చౌకిగా కట్టి దానిని మట్టితో నింపి, దానిమీద చిన్న చిన్న గుల్లలను అమర్చేవాడు. దూరమునుంచి చూస్తే, ఏదో చిందర వందరగా నున్న బొమ్మ, దానిమధ్య పిట్టల బారులు మాదిరిగా ఉండేది. లేక ఎత్తు పల్లాల బీడు, దానిలో ఆవులు మేస్తున్నవి అనుకోవచ్చు. ఇంకా గుట్ట లోయలున్న కొండ, దాని ఒంటిని అనుసరించి క్రిందికి వచ్చు వాగు లేక కాలిబాట అన్నా అనుకోవచ్చు.

ఇంట్లోనున్న పెద్దలు అతనిని ఎన్ని చీవాట్లు పెట్టినారో లెక్కలేదు. మధ్యమధ్య ఈ పిచ్చిపనులను యిక వదిలివేస్తానని ఒట్టు పెట్టుకొనేవాడు, కాని పిచ్చిమాత్రము అతనిని వదలేది కాదు.

## 2

కొందరు కొందరు పిల్లలు సంవత్సరమంతా చదువుకు ఎగనామం పెట్టుచుంటారు, కాని పరీక్షలలో ఎల్లానో తెలియకుండానే నెగ్గుతుంటారు. వీడికి అట్టిదశే పట్టింది.

జీవితమంతా పనిచేయకుండానే గడచినది కాని చచ్చిపోయిన తర్వాత అతను స్వర్గానికి పోవటానికి అనుమతించారని వార్త తెలిసింది. కాని నియమితమైన ఆ స్వర్గ మార్గమున కూడ మనుష్యుల అలవాట్లు పోలేదు. దూతలు తప్పు గుర్తుపెట్టుకొని, అతనిని పనులు చేసినవారి స్వర్గములో ఉంచివచ్చినారు.

ఈ స్వర్గములో అన్నీ ఉన్నవి, తీరిక మాత్రములేదు. ఇచ్చట 'నిట్టూర్పులు విడవడానికికూడ సమయము లేదే' అంటారు మగవారు. 'పోవాలి, అక్కా, పని బాకి ఉంది' అని అంటుంటారు ఆడవారు. 'సమయానికి విలువ ఉన్నది' అని అందరు అంటారు. 'సమయానికి. మూల్యము లే'దని ఎవరూ అనరు. 'ఇంతకన్నా వీలు లేదు' అని అందరూ ఆక్షేపణచేస్తూ ఆనందాన్ని పొందుతుంటారు. 'పనిచేసి చేసి అలసిపోయాను' అనేదే అచ్చట సంగీతము.

పాపము వీడికి ఎచ్చట ఖాళీ కనపడలేదు. సందు దొరకలేదు. పలకరించేవాళ్ళు ఎవరులేరు. దారిలో ఏదో ఆలోచించుకొంటూ పొయ్యేవాడు. పనిమీద గబగబ పొయ్యేవాళ్ళకు దారిలో అడ్డుతగిలేవాడు. పైపంచపరచి విశ్రాంతికిగా కూర్చొనబోతే 'ఇవి పంటపొలాలు, విత్తనాలు చల్లినాము' అనేదే వినేవాడు. మాటిమాటికి లేచిపోవలసి వచ్చేది, జరిగిపోవలసి వచ్చేది.

## 3

చాలా పనుల తొందరలలో ఉండే ఒక ఆమె రోజూ స్వర్గపు నీటి చలమవద్దకు నీళ్ళు తీసుకొనిపోవుటకు వచ్చేది.

దారికి పైఅంచులో ఆమె వెళ్ళేది. వీణమీద గమకము వాయించేటప్పుడు వ్రేళ్ళు గబగబ క్రిందికి పైకి పొయ్యేరీతి.

జారిపొయ్యే కొప్పును త్వరత్వరగా బిగించి ముడి వేసుకొనేది. అయినా తుంటరి ముంగురులు మూడు నాలుగు చెక్కిళ్ళమీద గంతులేస్తు. ఆమె కన్నుల నల్లని పాపలు చూచునేమోయని తొంగిచూస్తుండేవి.

స్వర్గములో పనిలేని మన వ్యక్తి ఓరగా నిలుచుని ఉండేవాడు, జరజర పారే సెలయేటిప్రక్క కానుగచెట్టువలె కదలకుండా.

కిటికీనుంచి చూచి బిచ్చగానిపై రాజకన్యకు జాలిగలిగే మోస్తరు, ఈయనను చూస్తుండంగానే ఆమెకు దయపుట్టింది.

'అబ్బా, నీ చేతులలో ఏమీపనిలేదు కాబోలు' నిట్టూర్చుచు 'పనిచేస్తా' కాని తీరికలేదు' అన్నాడు. అతని మాటలు ఆమెకేమీ అర్థముకాలేదు. 'నా చేతినుండి కొంచెము పనితీసుకోవాలని కోరుచున్నావా?' అని అన్నది.

'నీచేతినుంచి ఏదైనా పనితీసుకుందామనే నిలుచుని ఉన్నాను' అన్నాడు.

'ఏం పని ఇచ్చేది?'

'నీవు సంకలో పెట్టుకొని నీళ్ళు తెచ్చుటకు తీసుకుపొయ్యే కుండ నొకటి నాకు యిస్తావా?'

'కుండతో ఏం చేస్తావు? నీళ్ళుతెస్తావా?'

'లేదు, నేను దాని ఒంటిమీద బొమ్మలు రాస్తా.'

'నాకు తీరికలేదు బాబూ, వెళ్ళుతున్నా' నని విసుగుతో ఆమె వెళ్ళింది.

కాని పని లేనివాళ్ళతో పని చేసేవాళ్ళు ఏగగలరా? రోజూ ఆ నీటిబుగ్గవద్ద చేరేవాడు, రోజూ అదేమాట 'నీ సంకలో కుండనొకటి యీ, దానిమీద బొమ్మలు రాస్తా.'

ఓటమి ఒప్పుకోవలసివచ్చింది. కుండను యిచ్చింది. దానిని మర్లించి మర్గించి రాయడానికి మొదలుపెట్టాడు, ఓ, ఎన్ని రంగుల రెక్కలు, ఎన్నిగీతల తిరుగుళ్ళు.

రాయడం పూర్తి కాగానే, ఆమె కుండను ఎత్తి పట్టుకొని తిప్పితిప్పి చూచింది. కనుబొమలు ముడివేసి అడిగింది 'దీని అర్థము?'

'దీని కేమీ అర్థములేదు' అన్నాడు.

కుండతీసికొని, ఆమెయింటికిపోయింది.

అందరికళ్ళను ఏమార్చి ఆమె దాన్ని చూడసాగింది. ఇంట్లో, వెలుపల, చీకట్లో, వెలుతురులో చూచింది. బోర్లించి, పైకి ఎత్తి, ఏటవాలుగ, ఊగిస్తూ, చుట్టుతిప్పుతూ చూచింది. ఉండి ఉండి రాత్రి పడకనుండి లేచి, దీపము వెలిగించి మౌనంగా కూర్చొని రెప్పవాల్చక చూచేది. అర్థ మేమీ లేంది చూచింది ఆమె జీవితములో యిదే మొదటి సారి.

ఆ మరునాడు ఆమె నీటి బుగ్గవద్దకు రాగా ఆమె రెండుకాళ్ళ నడకలో కొంత తొట్రుపాటు కాన్పించెను. కాళ్లు రెండు పోతూపోతూ అన్యచిత్తముతో ఏదో ఆలోచిస్తున్నట్లుండేవి. అర్థ మేమీలేని ఏదో ఆలోచన.

ఆ దినము కూడా మన పనిలేని మనిషి ఒక ప్రక్కగా నిలబడడం చూచి.

"ఏం కావాలి" అన్నది ఆమె.

"నీ చేతిలోనుంచి ఇంకా పని కావాలె" అన్నాడు.

"ఏం పని ఇచ్చేది"

"నీకు సమ్మతమైతే, రంగు రంగు నూలుతో అల్లి, నీజడకట్టుటకు దారము తయారు చేసిస్తా.

"ఎందుకు"

"ఎందుకూ లే"

రంగు రంగు నూలుతో చిత్ర చిత్రంగా అల్లిన దారము తయారైంది. అప్పటినుంచి అద్దము చేతికి తీసికొని జడ అల్లడానికి ఆమెకు చాలా కాలము అయ్యేది. ప్రొద్దు మిగిలిపొయ్యేది. పనులూ మిగిలిపొయ్యేవి.

## 4

ఈ వైపు చూడగా చూడగా పనుల స్వర్గంలో పనుల పరస తెగిపోతూ వచ్చింది. మధ్య మధ్య చీలికలు కన్పించినాయి. ఏడ్పులతో పాటలతో ఆ చీలికలను పూర్తి కప్పుతూ వచ్చారు.

స్వర్గంలోని పెద్దలందరు చాల దిగులు పడ్డారు సభను పిలిచారు. 'ఇచ్చటి చరిత్రలో ఎప్పుడు ఇట్టిది జరగలేదు' అన్నారు.

స్వర్గ దూతలు వచ్చి తప్పును ఒప్పుకొన్నారు. 'తప్పు మనిషిని తప్పు స్వర్గానికి తెచ్చాము' తప్పు మనిషిని సభకు తెప్పించారు. అతని రంగు తలపాగా, నడుముకు బిగించిన పట్టీ వ్యవహారము చూడగానే పెద్ద తప్పు జరిగిపోయింది అని అందరికి అర్థమైంది.

'నీవు భూమికి తిరిగి పోవాలె' అన్నారు సభాధ్యక్షుడు.

'సరే పోతున్నాను' అన్నాడు రంగుల సంచిని చేతిలోకి తీసికొని, కుంచెను నడుము పట్టీలో దోపి, నిట్టూర్పువిడుస్తూ.

"నేను కూడా పోతాను" అన్నది ఆ ఆడామె, ముందరికివచ్చి. ఆ పెద్దవరుస సభాధ్యక్షుడు ఏమీతోచక నివ్వెరపోయినాడు.

ఏ అర్థమూలేని ఇంత పెద్ద వ్యవహారాన్ని అతడు చూచింది ఇప్పుడే తొలిసారి.

---

# గ్రామసభ - దాని ఆవశ్యకత

—పి. వి. మనోహరరావు

## వెలుగు బాటలు

గ్రామసభ; ఉద్దేశ్యము:- పంచాయతి (పంచ కమిటి) గురించి వివరముగా ప్రజలకు తెలియపరచుట.

పంచాయతి; పంచకమిటి యనుటకు కారణము:- గ్రామములు చిన్నవగుటచే 5గురు సభ్యులచే యేర్పరుప బడిన కమిటియే పంచకమిటి. కాని గ్రామములలో జనాభా పెరిగిన కారణంగా వాడలను, వార్డులను విభజించి, ఆయా వార్డుల జనాభా ననుసరించి- 5, 7, 9, 11, 13, చొ॥న పంచులు అనగా సభ్యులు నియమింప బడుతున్నారు.

పంచాయితి కమిటి యెందుకు? మన దేశము స్వతంత్రదేశము; మన ప్రభుత్వము ప్రజా ప్రభుత్వము; అనగా ప్రజలే ప్రభుత్వమును నడుపువారు. ప్రభుత్వమునకు పంచాయతీలే పునాది రాళ్ళు. అధికార వికేంద్రీకరణ కొరకు పంచాయితీలకు, కొన్ని అధికారములను ప్రభుత్వము ఒప్పగించినది. ఇట్టి అధికారములను పంచాయితీలు బాధ్యతాయుతంగానిర్వర్తించవలెను ఏ పేని పనిజరుగుటకు కొంతఅధికారము న్యాయసమ్మతంగా అవసరము. అది లేనిది పనులు నెరవేరుట చాలా కష్టము. అందుకే ప్రభుత్వము ప్రజలకు అనగా పంచాయతీలకు కొన్ని అధికారములు, బాధ్యతలు ఒప్పగించినది. ఈ అధికార బాధ్యతలు, నిర్వర్తించుటకే పంచాయతీలు-

పంచాయితీల కధికారము లెందుకు? పైన ఉదహరించినట్లు, అధికారము చట్టబద్ధంగా కొంత లేనిదే పనులు నెరవేరుట కష్టము. పనులు చేయుటకు, ముఖ్యంగా కావల్సింది డబ్బు. అట్టి డబ్బును, వేరు వేరు మార్గాలద్వారా రాబట్టుకొనుటకే అధికారము. అధికారము లేకుంటే డబ్బురాదా? యని మీరు అడుగవచ్చును. కాని "రాదు" యనవచ్చును. ఎట్లన ఏదో చందా, దాన, ధర్మమనో, మీ కర్తవ్య మనో యేదో ఒక విధంగా చెప్పనిదే. ఆడబ్బు వసూలు కాదు. ఒకవేళ పై విధంగా ఏదోఒకటి చెప్పి ఒకసారో రెండుసార్లో మాత్రం డబ్బు రాబట్ట వచ్చును. కాని మరి గ్రామ మన్నపుడు, పంచాయితీ యన్నపుడు, ఆ ఒకటి రెండుసార్లు మాత్రమే వసూలు చేసిన డబ్బుతో యేమిచేయగలరు. గ్రామమునకు గల ఆవసరము లెన్ని. ఆందుచే ప్రతియేటా పంచాయితీకి కొంత నిర్దిష్టమైన, మొత్తము అవసరము. దానికొరకే పంచాయితీలకు అధికారము.

పంచాయితీలకు అధికారము లేమి? బాధ్యత లేమి?- పంచాయతీలకు. ప్రభుత్వము ఇంతవరకు కొన్ని అధికారములు మాత్రమే యిచ్చినది. ఇందు ముఖ్యమైనవి-

1. ప్రతియింటికి పంచులచే కొంత విలువ కట్టించి, ఆ విలువ ననుసరించి యింటి పై పన్ను విధించుట.
2. పన్నులు ప్రతీయేటా సరిగా వసూలు చేయు అధికారము, వసూలు చేసిన పన్నులలెక్కలు సరిగా యుంచుట, వీనిని ప్రజాక్షేమమునకే వినియోగించుట.
3. గ్రామమునకు చెందిన రోడ్లు, భవనములు, డాములు మున్నగు వానిని. అవసరమును బట్టి నిర్మించుట, వానిని మరమ్మతుచేయుట మున్నగు అధికారములు కలవు. వీని అవసరములను గుర్తించి సరిగా నిర్వహించు బాధ్యత-
4. ప్రజలు యెపుడును నడుచు పెద్ద వీధులందు దీపముల నేర్పాటు చేయుట, నిర్వహించుట -
5. మంచినీటిసరఫరా, విధిగా - శుభ్రమైన నీటినే ప్రజలకందించుట -
6. గ్రామపారిశుద్ధ్య నిర్వహణ.
7. ఇతరుల పైరుల చెడగొట్టు పశువులను బందెలకు పంపు అధికారము, జుల్మానా వసూలు చేయు బాధ్యత.
8. ఎక్కువ జనులకు ఉపయోగపడు పాయఖానాల నిర్మించుట, వాని శుభ్రతకు తగిన యేర్పాటు చేయుట.
9. చిన్న పిల్లల ప్రైమరీ, ప్రాథమిక విద్యకొరకు, పాఠశాలలను అభివృద్ధి పర్చుట, గ్రంథాలయాల స్థాపన నిర్వహణ -
10. గ్రామములో రోడ్లప్రక్కన పూపొదలు నాటుట, కాపాడుట.

11. ప్రయాణీకులకు ధర్మశాలలు, సత్రములు, యేర్పరచి నిర్వహించుట.

12. వైద్యశాలల స్థాపన, నిర్వహణ –

13. ప్రజల మనోరంజకమునకై రేడియోలు, క్రీడాస్థలములు, క్లబ్బులు స్థాపించుట, నిర్వహించుట; రాత్రిపాఠశాలలు నెలకొల్పుట –

14. బీదపిల్లలకు పాఠశాలలో మధ్యాహ్న భోజన వసతి కల్పించి యేర్పాట్లు చేయుట –

15. వ్యాపారస్థులకు లైసెన్సు ఇచ్చుట. వారు అన్యాయము చేయకుండా చూచుట.

16. ధాన్యాగారములను నెలకొల్పుట, నిర్వహించుట.

17. వ్యవసాయాభివృద్ధి:–

(a) మంచి విత్తనముల సప్లై

(b) యెరువుల పంపిణీ –

(c) జపానుసాగు మున్నగు, నవీన పద్ధతులపై వ్యవసాయము జరుపునట్లు చూచుట.

(d) నవీన వ్యవసాయ పరికరముల వాడుట.

(e) ప్రదర్శనశాల లేర్పరచుట.

(f) మంచిపంట తీసిన వారికి బహుమతులిచ్చి ప్రోత్సహించుట – మున్నగునవి –

18. శిశు సంక్షేముల కేంద్రముల స్థాపన, నిర్వహణ.

19. మహిళాభ్యుదయమునకై, మహిళా మండలుల స్థాపింప చేయుట –

20. వ్యవసాయ కూలీలకు తగు గిట్టుబాటు చూచుట.

21. పశు వైద్యశాలల నిర్మించుట, నిర్వహించుట –

22. పశువృద్ధికి పాటుపడుట, సంకరజాతి నిర్మూలన –

23. యువజన సంఘములు, స్వచ్ఛంద సేవా దళములు మున్నగు సంఘములకు తోడ్పుట –

24. (గిర్నీబ్యాంకులు) ధాన్య సేకరణ జరిపి, బీదలకు అవసర సమయములలో కొద్ది హెచ్చుతో అందించుట.

25. కరువు, కాటకాలయందు, గృహ దహనాల సమయమందు ప్రజల నాదుకొనుట.

26. ప్రజలకు అవసరమగు అంగళ్ళు యేర్పరచి నిర్వహించుట.

27. సార్వజనిక వధ్యశాలల నేర్పరచుట –

28. అస్పృశ్యతా నివారణ, హరిజనోద్ధరణ – మత్తుపదార్థ సేవన విసర్జింప చేయుట –

29. గ్రామస్థుల నైతిక, సాంఘిక విలువల పెంపొందించుట.

30. మత విద్వేషాలను మాపి, ఐకమత్యత నెలకొల్పి, శాంతి కాపాడుట –

ఈవిధంగా పంచాయతీలకు ఒక అధికారమే కాక ప్రతిదానివెంట ఒకబాధ్యతకూడా యున్నది –

అధికార బాధ్యతల నిర్వహించుటకు కావల్సిన దేమి? – పైనుదహరించిన అధికార బాధ్యతల నిర్వహణకు, ప్రథమంగా ఒక సద్భావ సంపన్నుడు, సజ్జనుడు, విద్యాసంస్కారము కలవాడు, స్వార్థత్యాగము, ప్రజాసేవయందు ఆకాంక్ష గల "సర్పంచు" కావలెను. ఇతనికి తగినటువంటి సభ్యులుకూడా అవసరమే. ఇదికాక కొంత సిబ్బందియు అవసరమే –

ఈ సిబ్బంది పోషణకు మరియు పైన పేర్కొనబడిన బాధ్యతల నిర్వహణకు ముఖ్యంగా కావల్సింది "డబ్బు". అదిలేనిదే పని కూడా జరుగదు. డబ్బులకొరకే పన్నులు.

పన్నులవల్ల యెంతపని జరుగును? చాలా కొద్ది – కావున ప్రభుత్వ సహాయము. ఇది కూడా సరిపోదు. అందుకై ప్రజల సహకారముకూడా కావల్సిందే. అది యెట్లన, ముందుగా పై నుదహరించినవానిలో, కొన్నింటినైనా స్థాపించుటకు, పన్నుద్వారానే కాకుండా, చందాల రూపేణ కొంత మొత్తము సేకరించవలెను – సేకరించినదానిని (contribution) ప్రభుత్వ సహాయముచే కొన్ని పనులు ముఖ్యమైనవి. (వీధిదీపాలు మంచినీటి సరఫరా, మురుగుదొడ్లు మున్నగునవి) ముందుగా చేసికొనవలెను –

ఎన్ని చెప్పినా, ఎంత మంచి సర్పంచు అయినా, ఎంత ప్రభుత్వ సహాయం లభించినా, ప్రజల ఐకమత్యము, సహకారము, వారికిని మంచి పనులపై ఉత్సాహము, శ్రద్ధ, ఆసక్తి, యెంతవరకైతే వుండవో అట్టిచోట, పై నుదహరించిన బాధ్యతలలో యేవియును నెరవేర వని తెల్పుట అతిశయోక్తి కాదు –

వెనుక యెవరో "వద్దన్నవాడు" పెద్దకొడుకు అన్నాడట అట్లే వద్దని చెప్పేవానికి తేలికే. వినే వానికి మరీతేలికే. ప్రజలకు నచ్చచెప్పి డబ్బు వసూలుచేయుట అంత సులువైన పనికాదు. అయినా అందరు ఒకలాగుండరు. గ్రామాలలో చాలామంది సజ్జనులే యుందురు. కాని చెరిపేవాడు ఒకడే చాలుగదా! అందువల్లనే జరిగే యిబ్బంది. అలాటివార్ని ముందుకు లాగి యెందుకయ్యా ప్రతిదానికి "చీడపురుగు" లాగా తయారయ్యావని అడిగితే, నే నేమంటున్నాను. "అందరు యిస్తే నేను యిస్తా" నంటాడు. చాటుకుపోయి "యెందుకీయాలి" అంటాడు. అయితే మరి యిలాంటివార్ని యేమి చేయాలో పంచాయతీలకు యేమి అధికారము లేనట్లు తోస్తున్నది – పోలీసుని మొదటి

సారి అతనిని వదిలేస్తే, రెండవసారి చందాలకు ఇద్దరు, మూడవసారి ముగ్గురు, నాల్గవసారి అందరును మే మివ్వమని తయారౌతారు. ఇన్నిసార్లు మే మిచ్చాం వారివ్వలేదు. వార్ని మీ రేంచేశారు ? అని అడిగే వారు కూడా లేకపోలేదు — ఇలాటివారి విషయంలో ప్రభుత్వం యేమైనా శాసనాన్ని ఉపయోగించాల్సిందేతప్ప వేరే మార్గం తోచుటలేదు.

ఇంతకు చెప్పాల్సిందేమంటే ముఖ్యంగా కావల్సింది ప్రజల సహకారం.

ప్రజ లెంతవరకు సహకరిస్తారో, యెంతడబ్బు గ్రామమునకై త్యాగంచేస్తారో అంత అభివృద్ధి ఆ గ్రామానికి జర్గుతుంది. ఆ గ్రామం నిజంగా భూతల స్వర్గంగా మారు ననుటలో సందేహంలేదు —

గ్రామ ఆదాయం పెంపొందించుటకు సూచనలు:— పూర్వం, గ్రామాలలో నేడు కన్పించుచున్నన్ని కలహములు, ఆరాజకములు లేవని నిస్సందేహంగా చెప్పవచ్చును. దీనికి కారణం, ప్రజాబాహుళ్యం, స్వార్థ పరాయణత్వం, భూసంబంధ జగడములు, భూమి విలువ పెరగడం, యింటింట, వాడ వాడల, పెత్తనం చెలాయిస్తా మనే ఆకాంక్ష ఆదీగాక, కలహముల మూలంగా ఆర్జించే "ధనం" మున్నగునది— పూర్వం ఏవేని కలహము లున్నచో దొరలవద్దకి, అనగా గ్రామాధికార్ల వద్దకిపోయి, కొంతజమానతు యిరుపక్షాలవా రుంచి యెవరెవరి పెద్దలను వారు యెన్నుకొని, వారు న్యాయం ప్రకారం తీర్పుచెప్పి, అన్యాయం అనిపించినవారి ధరావతు జప్తుచేసెడివారు. అయినా ఆ కాలంలో గ్రామాధికార్లకు కొంత బాధ్యత యున్నదికాబట్టి సరిపోయింది. (కొంత మంది అన్యాయంచేసినవారు కూడా లేక పోలేదు) ఇక నేటిపరిస్థితిలో ఆ పద్దతి దాదాపుగా మారిపోయింది. ప్రతివారు పెద్ద మనిషే. వాడవాడకు యెందరో పెద్దమనుషులు, యే పంచాయతియైనా ఆయా పెద్దల వద్దకే పోవడం, వచ్చిన జమానతు ఆయా పెద్దలే కాజేయడం చాలాచోట్ల జర్గుచున్నది. పలుకుబడిగల వ్యక్తులే కాకుండా పంచాయతీ మెంబర్లు, మరి సర్పంచులు, యెవరికి తోచి నదివారు, ఈ విధంగా చాలామంది మేయుచున్నారు.

ఇంతకు విచారించాల్సిందేమంటే గ్రామాలలో ముఖ్యమైన ఆదాయ మగు, సివిలు వ్యవహారములు, యిలా యెక్కడి కక్కడ సఫా జర్గుచున్నది. ఈ ఆదాయం ప్రతిగ్రామంలోను, నెలకు కొన్నివందల రూపాయల విలువలో యుండునని నిస్సందేహంగా చెప్పవచ్చును. అయితే ఇవి పంచాయతీలకో, లేక గ్రామాధికార్లకో, లేక యే యితర బాధ్యత గల గ్రామస్థులకో ఒప్పజెప్పి, సరిగా లెక్కలు వుండునట్లు చూచుటవల్ల, గ్రామాలకు మిక్కిలి ఆదాయము చేకూరు నని నావుద్దేశము. అయితే ఆ పెద్దమనుషులు, పంచాయతీకి వచ్చి తీర్పు యిస్తారో లేదో యన్న సంకోచమునకు కోర్టువారు యిచ్చినట్లు 2.00 రు॥లు భత్తా యీయవచ్చుగదా. ఒక్కొక్క పంచాయతీకి, దాని స్వభావమునుబట్టి, 10/-, 50/-, 100/-, 500/-, రు ల వరకు ధరావతులు బెట్టుకొని, పంచాయతీలు, జగడముల తీర్పులు చెప్పుకొంటున్నారు. 2, 3 రూ. ల చొప్పున యిరుపక్షాలవారికి నల్గురికో, ఆర్గురికో, మరియు ఆ బాధ్యుడికిని, యిచ్చుట అసమంజస మేమియుకాదు. ఈ పంచాయతీలైనాబాధ్యతగలవ్యక్తికి(సర్పంచు, గ్రామాధికారి, లేక బాధ్యత కల వ్యక్తి) డబ్బును ఉంచుకొనుటకు, పంచాయతీనిధికి సమర్పించుటకు, లెక్కలు సరిగా వుంచుటకు, అధికారము కల్గియుండవలెను. కాని అతను పంచాయతీకి సంబంధించిన యే తెగకుకాని యేమాత్రం జోక్యం కల్పించుకో కూడదు. యిరుపక్షాలవారు యెవరెవరి పెద్ద మనుషులను వారే బాధ్యతగలవ్యక్తి యిచ్చిన సైముకు తీసుకొని రావలెను. ప్రస్తుతము ఈ సివిలు వ్యవహారములను పంచాయతీలకో, గ్రామాధికార్లకో, లేక నిజాయితీ గల ఒకరిద్దరు వ్యక్తులకో ఒప్పగించి. ఇతరులు జోక్యం కల్పించుకొన్నచో చట్టబద్ధమైన చర్య తీసుకొన్నచో ఇట్టి ఆదాయం వృధాకాదని నా వుద్దేశ్యం. మరియు పది మందితో జర్గే పంచాయతీ కాబట్టి, డబ్బు కాజేతురన్న భయంకూడా వుండబోదనే నా వుద్దేశ్యం —

మరియు నేటి పరిస్థితులలో గ్రామాలలో బంజర్లు పోరంబోకుభూములు, అసలు లేవనే చెప్పవచ్చును. కాని ఈ సాగుచేసికొనే వారుకూడా బీదలు చాలాతక్కువ. కండబలం, భుజబలం కలవారు దౌర్జన్యమునకు వెనుకంజ వేయనివారేచాలావరకు బంచరాయ దున్నుచున్నారు. కాని నిస్సహాయులైన బీదవారు చాలామంది భయపడి యేమియు చేయజాలక పోవుచున్నారు. ఇక పోతే చెర్లు కుంటలలో, చేపలు మున్నగువానిని ఇదివరకే ప్రభుత్వం పంచాయతీల కొప్పగించినది. కాని వానిపెంపకం విషయాలలో శ్రద్ధ లేక యెక్కువరాబడి లేదు —

ఇక ముఖ్యమైన భూమిశిస్తుకూడా పంచాయతీలకే వదలబోతోంది ప్రభుత్వ మని వింటున్నాం — కాని దాని విషయంలో చాలా ఆలోచించాల్సియుంది. ఇది చాలా గడ్డుసమస్యే.

పంచాయితీ కార్యకలాపాలు ప్రజలకు తెల్పుట:- ప్రజలు గ్రామాలలో చాలా

(మిగతా 12 వ పేజీలో)

# జయము

మోచర్ల రామకృష్ణకవి

ప్రకటిత స్నేహా, గుప్త వైరప్రబంధ
సంగరోన్మత్త నాయకోచ్చలిత సైన్య
బహుళ మేఘోల్బణము పటాపంచ లగుత
మిత్ర ధర్మోపకార సమీర వశత !

కుహనా పండిత చీన నాయకులు సంక్షోభింపఁగా విద్విష
ద్గహనోద్వేల దవాగ్నులైన భరతక్ష్మా మండలీ సైన్యముల్
తుహినాద్రి విహరించుగాత సరిహద్దుల్ గాచి భాస్వద్యశో
మహనీయస్థితికాస్పదంబులయి సమ్మానార్హతన్గాంచుతన్ !

పూజ్య భారతమాత మేల్ముసుగు జిలుగు
వలువ లాగిన దుశ్శాసనుల యురమ్ము
లను విదారించి, తద్రక్తమున వసంత
మాడవలె భీమసేనులై యామె సుతులు !

అమ్మ కహితులు దరికొల్పినట్టి పరిభ
వాగ్నిఁ జల్లార్ప రండు, ప్రాణార్పణంబు
సేయుటకుఁ గూడ గొడుకులు సిద్ధపడుడు
వివిధ కులమత భేదముల్ విస్మరించి.

సేనాటోపముతో, ప్రపంచవిజయశ్రీ కాంక్షతో దండయా
త్రా నైపుణ్యముతో నగణ్య రణ విద్యాప్రౌఢ పాండిత్య గ
ర్వానందోల్లసితాత్ములైన పరరాజ్య క్షేమ పాటచ్చరుల్
హానిన్జెందరె । హిట్లరుప్రముఖులెల్లన్ నాశముం బొందరే?

పరవిత్తము లాశింపని
భరతక్ష్మాసతికె జయము; భయపడ నేలా ?
నిరపాయ సత్య ధర్మ
స్థిరులగు పాండవుల కేగదే జయ మబ్బెన్ !

---

(11 వ పేజీ తరువాయి)

మంది యీ పంచాయితీ లేమి చేయుచున్నవి? పంచాయితీ లొచ్చి, పన్ను లనీ, చందా లనీ వేధించుకు తింటున్నారు. వారు చేసే దేమియు లేదని అంతా దిగ్భ్రమింగుతున్నారని, పలు విధముల మొరపెట్టుకొనే బీదలు లేకపోలేదు. అందుకే "గ్రామసభ" ఆవసరము. మంచివారికి చెడ్డవారికి ఆ అప్రతిష్ట తప్పుటలేదు. దానినుండి కాపాడుకొనుటకు ప్రతీ పంచాయితీయును ప్రతియేట కనీసం, ఒక్కసారైనా గ్రామసభ జరిపి సరిగా లెక్కలు వ్రాసి, ఆదాయ మెంత? ఖర్చెంత? మిగిలిన దెంత? యింకా కావల్సిందేమి? జర్గిన దేమి? అని మొత్తం వివరించవలెను. ప్రజలకు పదేపదే నచ్చచెప్పవలెను. అప్పుడే పంచాయితీలపై ప్రజలకు అభిమానము పెరిగి వాని లాభముల గుర్తెరిగి అవసరముల తీర్చుకొనుటకు ప్రజలు ముందుకు వత్తురు. యెట్టి పన్నులనైనా, చందాలనైనా భరింతురు —

దేశ పంచవర్ష ప్రణాళికలవలె ప్రతి గ్రామంలోను యేకవర్ష ప్రణాళికలు తయారు కావలెను. ఆయా ప్రణాళికల ప్రకారం పని జర్గుచుండవలెను. అప్పుడే నిజమైన ప్రజాప్రభుత్వం అనిపించుకోగలదు. అప్పుడే నిజమైనఅధికార వికేంద్రీకరణ జర్గినట్టు. ఇలా చేస్తేనే ముందు తరాలవారికి నేటి సర్పంచులు, గ్రామ పంచాయితీలు మార్గదర్శం కాగలవు. ప్రజారాజ్యం, పంచాయితీరాజ్యం రామరాజ్యంగా తయారు కాగలదు. ★

# నృసింహకవి కవితా విలాసం

యామిజాల పద్మనాభస్వామి

లాలిత్యమూ, ఔద్ధత్యమూ తయిపారవేస్తే సరిసమానంగా కనిపిస్తాయి సంకుసాల కబ్బంలో. ఇంత స్థితప్రజ్ఞత్వం కలవాడు కనకనే అంతగట్టిగా చెప్పుకున్నాడు.

'యతి విటుడు కాకపోవుటెట్లస్మదీయ
కావ్య శృంగార వర్ణనా కర్ణనమున.
విటుడు యతిగాక పోరాదు వెసమదీయ
కావ్యవైరాగ్య వర్ణనా కర్ణనమున'–

అని. ప్రతిజ్ఞలు అందరూ చెయ్యవచ్చు. 'వచనే కా దరిద్రతా'–ప్రతిజ్ఞా నిర్వహణం దగ్గరకు వస్తే పసబయట పడుతోంది. 'తత్రతనట్టు'గానే వుంటాయి ప్రతిజ్ఞలు. ఉత్తరుడు చెయ్యలేదా ప్రతిజ్ఞలు. చేసేవారు ఎప్పుడూ చెప్పరు. చెప్పేవారు ఎప్పుడూ చెయ్యలేరు.

ప్రాబంధికకవులలో యింత అసిధారావ్రతంగా ప్రతిజ్ఞపలికి నెరవేర్చుకున్న కవి యీ నరసింహకవి ఒక్కడే అంటే సరసులు కానంటారుగాని ప్రత్యాఖ్యానం చెయ్యరనే నా నమ్మకం. యీలాటి ధోరణి భర్తృహరికావ్యంలో కనిపిస్తుంది.

'మాతుః కేవలమేవ యౌవనవన
చ్ఛేదే కుఠారా వయమ్'–

అనే ఒక్కమాటలో సంసారికి మొగం మొత్తినట్టు. ఆ రాజకవిచంద్రుడు అంత సునిశితంగా చెప్పగలిగాడు. అలాటి పట్లు చదివినప్పుడు

'శక్తిః కవిత్వ బీజంహి
ప్రాక్తనీ సంస్కృతా మతా'–

అనే సూక్తిచట్టున ఆకళింతకు వస్తుంది. ఆ కోవలో చేరినవాడు కనకనే సంకుసాల నృసింహకవి ఒక్క కావ్యం వ్రాసి వాఙ్మయ రంగంలో అజరామరమైన యశస్సు పొందిన ధ్రువతార అయి వెలుగొందుతున్నాడు.

కేవలం ప్రబంధవాఙ్మయానికి చెందినవే అయినా కవికర్ణరసాయానం సార్థకములైన వర్ణనలతో కృతార్థమయిన మహాప్రబంధముగా ప్రసిద్ధినందింది. పిచ్చి పిచ్చిగా ఏ వర్ణనా చెయ్యడు. విప్రలంభ శృంగారాన్ని వర్ణించిన పట్టులోకూడా తల దిమ్ముగా తిట్టు పద్యాలు క్రుమ్మరించడం నృసింహకవికి చేతగాదు. తిట్టిన పద్యమే అయినా అందులో సరసతా వాలుందాతనం గోచరిస్తుంది.

పాలిక నాయిక యైన విమలాంగికి నెచ్చెలి. అరమరిక లేని మచ్చికగలది. కాస్త ప్రౌఢతనం గలది. ఆమె విమలాంగి విరహావస్థలో కుందుతూన్నపుడు అంటూందికదా!

'అలరుం దూపుల మూల పాల్పరచి
సొంపౌ నిక్షుచాపంబువం
గల పెంపెల్ల తృణీకరించి మకరాం
కం బవ్వలం ద్రోచియ
చ్చల మేపారగ చిన్నిబాలకులచే
చప్పట్లు వెట్టండు న
వ్వలరేనిం జెలి! ఒక్క పోటుదొరగా
వాలూంది చింతింపకే'–

అని......ఎంత నిసర్గరమణీయంగా ఉందో చూడండి యీ పద్దెం....

పువ్వులు, చెరకు, మొసలి ఉపయోగించుకునే వీరుడు మన్మథుడు. పువ్వులను మూలపెట్టించి, చెరకును గడ్డిపోచగా చేసి మొసలి జెండా విసిరి వేసేటప్పుడు వలరేని బిరుదు ఇంకేమవుతుంది? వాడు కూడా ఒక పోటుదొరా! అని పసిపాపల చేత నడువీధిలో చప్పట్లు చరిపించి అల్లరిపాలు చేస్తాను. వాడేదో చేస్తాడని యింత చింతిస్తావేమిటి ముద్దరాలా? అంటుంది.

పదిమంది బాలురుకూడితే ఇంద్రుడంతవాణ్ణికూడా గేలి చేసి రామకీర్తన పాడేస్తారు. వాళ్ళని ఉసికొలిపేవాళ్లు ఉంటే యిక వాళ్ళని పట్టపగ్గా లుండవు. కాస్త చిరాకుతో వాళ్ళని ఏమేనా అంటే దారిని పోయేవాడు ఏమయ్యా! చిన్నకుర్రాళ్ళతో నీ కెందు కీతగవు? నీ దారిన నువ్వు పో! అంటాడేగాని వాళ్ళని మందలించలేదు. ఇది లోకస్వభావం ...

తిన్నగా ఉండకపోతే మన్మథుడి పని అక్కడికే వస్తుంది అని పాలిక ఆ బాలికతో అంటుంది.

యీ క్రింది పద్యం అవధరించండి, ఎంత హృదయంగమమో:–

'ముద్దియయెడగల్గు మోమోటమరచి షే
కారించెదేల రాకాశశాంక!
మగువ నీ కిచ్చిన మాట పట్టెరుగనే
యించుకకృపనేయ వేల చిలుక;
కోమలాంగికి నట్టుకుత్తిక వైయుండి
కలకంఠమా; కనికరము వలదె?
చెలిమోముదమ్మితావులగ్రోలుచుండియు
కుడిచి నింటికి కీడు కోర కుమలి!
కాల మెల్ల పగలు గావచ్చినది మీకు
కొమ్మ నేచదగదు కోకయుగమ।
అకట! నతికి నంతరంగమైయుండియు
మలయకయ్యా! నీవు మలయపవన!

రాకాశశాంకుడు ముద్దియ యెడ మోమోట గలిగిననాడు అయినా యిప్పుడు బాధిస్తున్నాడు. వానికి యింత బలిమి ఎలా వచ్చిందో; ఒకసారి ఓడిపోయినవాడు మళ్లీ దండెత్తి రావడం అనూహ్యం విమలాంగి మోముతో రాకాశశాంకుణ్ణి గెల్చింది. ఆ ఓటమిగలవాడు ఆమెని బాధిస్తున్నాడు. ఎంత సిగ్గులేదో! తగుదునమ్మా అని అ ముద్దరాలి నెదుర్కొని బాధిస్తున్నాడు.

చిలుకకు విమలాంగి చెప్పినదే పలుకు. ఇప్పు డది ఆ మాటలతో అమెని బాధిస్తూంది. ఆమె దగ్గర మాటాడడం నేర్చుకొని ఆమెనే ఎదిరించడం ఎంత అన్యాయం. విమలాంగి కంఠస్వరం కోకిలకంఠస్వరమూ ఒకటే. ఆలాటి సాజాత్యాన్ని ఎదిరిస్తూంది కోకిల, ఎంత దారుణం; ఆమె ముఖ పద్మ సౌరభాన్ని గ్రోలుతూన్న తుమ్మెద ఝుంకారాలతో ఆమెని చీకాకుపరుస్తూంది. యీ పని తిన్న యింటికి వాసాలు లెక్క పెట్టడం కాదా?

చక్రవాకాలను అధిక్షేపించిన పాదాలు చాలా యింపుగా వున్నాయి.

'కాలమెల్ల పగలు గావచ్చినది మీకు'-
చక్రవాకాలకు పగలు చాలా హాయిగా వుంటుంది. కనక వాటికి బలం ఎక్కువ. ఆ బలిమి కలిమి చూసుకొని అని కువకువలాడుతూ ఆమె ఏకాంతంగా వుంది కనక తమ విభ్రమాలతో వంత కలిగిస్తున్నాయి.

'పగలు' దినార్థాన్ని యిస్తూ వైరం అనే అర్థాన్ని కూడా సాధిస్తూంది. అంత నింపుగా వేశాడు 'పగలు'-

ఇంక మలయ వాయువుని అధిక్షేపించడం మరీ సరసంగా వుంది.

'నతికి అంతరంగమై యుండియు'-
హృదయం వాయుస్థానమై ఆమె ఉజ్జీవనానికి ఆధారం అవుతూంది. అవేఉచ్ఛ్వాసనిశ్వసాలు. ఆ విధంగా ఆమెలో అంటిపెట్టుకుని ఉన్న వాయువు ఆమెకు బాధ కలిగించడం యెంత ధర్మ్యం!— ఇలా వ్యాఖ్యానాలూ,వివరాలూయిస్తూ వెళ్లితే యీలాటి రెండు మూడు పద్యాలతో ఒకొక్క వ్యాసం వ్రాయవచ్చు.

ఇదే సందర్భంలో యింకొక్క పద్యం ఉదాహరించి వేరొక విషయానికి వెళ్తున్నాను.

మదన దేవతా ప్రార్థన చేసి—
పత్రము పుష్పమున్ ఫలము
భక్తి నొసంగెడు వారమంతెయీ
మాత్రమునన్ ప్రసన్నులయి
మానిని గన్గొనుడయ్య! మీ కృపా
పాత్రము గాగనంచు తగు
భంగి పికంబుల తేంట్ల చుల్కలన్
పత్రము పుష్పమున్ ఫలము
పాయస మిచ్చి భజించి అచ్చెలుల్—
'పత్రం పుష్పం ఫలంతోయం
యోమే భక్త్యా ప్రయచ్ఛతి'—
అనే గీతా వాక్యం మనసునందుంచుకొని యీ పద్యం వ్రాసినా, సరసతా చమత్కృతులు చక్కగా సమకూర్చుకున్నాడు.

భక్తితో యిచ్చినది పత్రమో, పుష్పమో, ఫలమో ఏదైనా సరే నేను ప్రీతిగా తీసుకుంటా నన్నాడు భగవానుడు. భక్తుడు భక్తితో యిచ్చేదీ అదే. ఏదో పువ్వు, కాయ, పండు - ఇంతే.

"కొండంత దేవుడుకి
కొండంత పత్తిరి' —
ఎవరూ యివ్వలేరు. అయినా మనకిఅన్నీ యిచ్చేశాడు ఆయన. ఆ పక్షంలో ఆయనకి మనం ఏమియ్యగలం? కనక తానే ఒప్పుకున్నాడు. పత్తిరో పండో భక్తితో యిస్తే చాలు. అని అలాగే నడిచిపోతూంది కాలం.

ఇక్కడ విమలాంగి తరఫున చెలికత్తెలు మన్మథ పరివారాన్ని భజిస్తున్నారు కనక ఆపరివారాన్ని దేవతాత్మకంగా భావించి పత్ర పుష్ప ఫలాలు సమర్పించుకుంటున్నారు. వాటిని దయతో స్వీకరించి మా చెలికత్తెను అనుగ్రహించండని వేడుకున్నారు.

కొందరు దేవుళ్లకు కొన్ని యిష్టములైన ఉపాయనాలు ఉన్నాయి. గణపతికి కుడుములు, ఉండ్రాళ్లు, శివుడికి కొబ్బరికాయ, విష్ణువుకి దధ్యోదనం, చక్రపొంగలి, గాయత్రికి పాయసం... ....యివి ఆయా అరాధాన సమయాలలో నివేదిస్తూ ఉండడం అందరకూ తెలిసినదే ఆలాగే యిక్కడ పత్ర పుష్ప ఫలాలు మన్మథ పరివారానికి చెలికత్తెలు నివేదించుకున్నారు. ఇక్కడ ఉన్న క్రమం చూసుకుని ఆ నివేదన ఏది ఎవరికో మనం చెప్పుకోవాలి. అదే ఉచితజ్ఞత.

పత్రములు - పికములకు,

పుష్పము - తేంట్లకు

ఫలములు - చిలుకలకు -

ఇది క్రమానుసారమైన నివేదన-

క్రొమ్మామ్మిని చిగురుటాకులు మేసి కోకిలలు, పుష్ప రసాన్ని గ్రోలి తుమ్మెదలు, ఫలములు కొరికి చిలుకలూ జీవిస్తాయి అనేది సర్వులకూ విదితచరమైన విషయం.

'కోకిలాంగనలచే గ్రుక్కిళ్లు మ్రింగించు
క్రొమ్మామ్మిడి చిగురాకు గొడుగుతోడ'-

అన్నాడు కవిసార్వభౌముడు - హరవిలాసంలో-

'లలిత రసాల పల్లవఖాదియై చొక్కు
కోయిల పేరునే కుటజములకు'-

అని లలిత మర్యాదుడైన ప్రహ్లాదుడి నోట వాళ్ల నాయనకి పాఠం చెప్పించారు మా ప్రాచీన గురువులు సహజపాండిత్యులు-

ప్రకృతావస్థలో విమలాంగి చెలికత్తెలు కోకిలలకు మావిరెమ్మలే పెట్టారు. అని అనుకోడం యుక్తం. ఏమంటారా? చూతకుసుమం మన్మధుని అయిదు బాణలలో ఒకటిగా ప్రసిద్ధం.

'అరవింద మశోకంచ
చూతంచ నవమల్లికా
నీలోత్పలం చ పంచైతే
పంచబాణ స్ససాయకాం'-

(నామలింగా నుశాసనం)

కనక మన్మధ పరివారంలో ఒకటైన కోకిల మావిచిగుళ్ళు మేస్తుం దనడం సముచితం. ఆ విధంగా ఆ పుష్పం తన దొరకియిష్టం కాగా చిగురాకు తనకి యిష్టం అవడం లోకసహజం. పైగా కోకిల మావిచిగుళ్లే కొరికి తింటుందనే అనుకోవాలిగాని అడ్డమైన చెట్ల ఆకులూ మేస్తుందనీ అనుకోలేము. ఏకవి చెప్పినా కోకిల చూత పల్లవ భక్షక మైన పక్షిగానే వర్ణించడం సర్వత్రావిదితం అవుతూంది. కనక యిక్కడ చెలికత్తెలు యిచ్చిన పత్రములు చూత ఫలాల నన్నీ అవి పికములకు ఉపాయనములనిన్నీ సమర్ధనీయం.

పుష్పాలు తేంట్లకు. అవి మధుపములు కనుక తేనె లుండే పువ్వులతో తేంట్లకు ఉపాయనం సమర్పించుకున్నారు.

ఫలాలు చిలుకలకు, ఇదీ యీ పద్యములో సరసమూ, సక్రమమూ అయిన చమత్కృతి - బలే బాగున్న పద్యమను కుంటాము చదవగానే. అంతేకాక యేదో పావనస్థితిని అనుభవిస్తాముకూడా చప్పున.

పత్రం, పుష్పం, ఫలం, తోయం-అనే శ్లోకచరణం స్ఫురణకు వస్తుంది. యిలా వుంటుంది నృసింహకవి ప్రతిజ్ఞా నిర్వహణంలో ఒక రవంతపాలు.

ఇంకొక్క ఘట్టంలో చిన్న విషయం స్పృశించి యీ వ్యాసం ముగిస్తాను.

యువనాశ్వుడు మాంధాతకు పట్టాభిషేకం చేసిన తరువాత రాజనీతి ఉపదేశించే ఘట్టం అది. ఉపాయ స్వరూప నిరూపణంలోది.

'కాకేమి తన్ను దిట్టెనె?
కోకిల తనకేమి ధనము కోకొమ్మనెనే?
లోకము పగయగు పరుసని
వాకున; చుట్ట మగు మధుర వాక్యము వలనన్'-

అక్షర లక్ష లిచ్చే వాడని ఆనాడు ప్రశంసపొందిన భోజరాజు యీనాడుండి తెలుగు బాగా తెలిసిన వాడైతే యీ పద్యానికి అక్షరలక్ష లిస్తాడని వేరే అనన క్కరలేదు.

కాకిని చూడగానే తిడతాము. సప్తాప స్వరాలూ గూడుకట్టుకొన్న స్వరం కాక స్వరం. అది అరవగానే చెవుల్లో మరిగించిన సీసం పోసినట్టుగా వుంటుంది.

'తినేస్తూంది వెధవ కాకి' అని చీపురు కట్టతీస్తారు. అంత కఠోరం దాని కూత. కనక దానిని విసిరి కొడతారు. 'పాపం! అదేమి చేస్తుంది. దానిగొంతు తత్వం అలాటిది!' అనే సానుభూతి దాని మీద కలగదు. కలగకపోవడానికి కారణం మీకేమీ లేదు. దానికారుకూత అంత చిరాకు కలిగిస్తుంది.

కోకిల ఎవరికైనా కట్నాలు గుమ్మరిస్తుందా. అది 'కో' అనగానే నిశ్శబ్దంగా విని ఆదరంగా చూస్తారు. కారణం? దాని నోరు అంత కమ్మగా వుండడమే. సృష్టించినపుడు బ్రహ్మ కాకి నోట్లో ఆముదం పోశాడా? కోకిల నోట్లో అమృతం దిమ్మరించాడా? ఏమీలేదు. పైగా యీ కోకిల ఆ కాకి గూటిలో పెరిగినదే. దీనికి రూపం దాని దయాధర్మభిక్షవల్ల వచ్చినదే. రూపం కూడా సమానమే. కాని దాని కారుకూత దీనికి రాలేదు.

'వసంతకాలే సంప్రాప్తే
కాకః కాకః ; పికః పికః'—

అని దీనికి ఒక నిర్వచనం కూడా పుట్టింది. ఏమాత్రం కవి కూడా, చివరికి బజారు కవిత్వంవ్రాసే కవిననిపించుకొన్నవాడు కూడా కోకిలని పొగిడేదాకా వెళ్లింది దాని కాక లీస్వరం. దాని స్వరానికి పేరు కూడా రావడమే కాకుండా సప్త స్వరాలలో ఆధార స్వరమైన పంచమం పికకూజితం అని శాస్త్ర మర్యాద కూడా పొందింది. యింత ఘనత ఏలా వచ్చింది; కోకిల కూత అంత యింపైచలామణీ అవుతూవుంది కనక. పైగా దీనిని నృసింహకవి దృష్టాం

తంగా తీసుకుని యువనాశ్వుని ముఖాన కొడుకుకి కొత్తగా రాజైన వానికి ఒక పాఠం చెప్పించాడు.

'లోకము పగయగు పరుసనివాకున— చుట్టమగు మధుర వాక్యము వలనన్'- 'అని ఇందమ్మా అంటే అందమ్మ.

ఇందే అంటే అందే — అంతేకదా సహ జీవన తత్వం ఏమండీ అంటే ఏమండీ అంటారు. ఏరా అంటే ఏరా అంటారు. వాడి కేగాని నోరు వున్నదని వాళ్ళకిలేదా? 'పలుకు ప్రల్లదనము — పగకి కారణం' అంటుది భారతం— గొడ్డలితో కొట్టిన మాను మళ్ళీ చిగిరిస్తుంది. మాట వల్ల విరిగిన మనసుమాత్రం మరి కలియదు— ఇదీ భారతనీతిలోదే

'పగ, చుట్టరికం'— యీ రెండూ ఎక్కడోలేవు, మాటలోనే వున్నాయి. 'మాట వలన వచ్చు మన్నన'— భారతం—

ఇంద్రాను గ్రహం వల్ల పుట్టిన మహాను భావుడు మాంధాత. అన్ని విద్యలూ కరతలామలకములయి ఉన్నాయి. చక్ర వర్తి అయాడు. రూప యౌవన గుణ సంపన్నుడు. ఇక పరిపాలనబరువు కరు వుతో పాటు భరించ వలసి వుంది. దేశం విశాలం. ఎక్కడెక్కడ వున్నవారూ అనుకూలురై వుండాలి. ఆ అనుకూల్యం సంపాదించే మహాగుణం కొడుకుకి అవసరం కనక ఆ తండ్రి అనుభవశాలి కనక ఒక్కమాటతో యీ నీతి బోధిం చాడు. మాట మెత్తదనం వల్ల అందరూ చుట్టా లవుతారు. తిని పోయే చుట్టాలు కాదు, సర్వాత్మనా సర్వకాల సర్వావస్థలలో తననే అనుసరించి వుంటే ఆప్తులు అవుతారు. తూలనాడే స్వభావం అలవరచుకుంటే సన్నిహితులై వుండే వారు కూడా శత్రుకోటిలో చేరిపోతారు కనక

'మధుర వాక్యం' ఎంతైనా అవసరం ముఖ్యంగా పరిపాలకునికి- అని యువ నాశ్వుడు బోధించాడు మాంధాతకి.

---

# ఉదాత్త సారస్వతము

శిష్టా రామకృష్ణశాస్త్రి

ఉదాత్త నాయక కథోపేతమై, సభ్యమైన భాషలో వ్యక్తీకరింపఁబడిన యుదార భావాశయములు గలది యుదాత్తసారస్వత మనఁదగును. దీనినే యాంగ్ల భాషలో క్లాసికల్ లిటరేచరు అందురు. ఉదాహరణము, భారత భాగవతరామాయణాది పురాణములు, రఘువంశ నైషధాది కావ్యములు, మృచ్ఛకటికోత్తరరామచరితాది నాటకములును. దీనికి వ్యతిరేకముగా, సామాన్య మానవ సాంసారిక కథా విషయోపేతమై, నిత్యవ్యావహారిక భాషలో వ్యక్తీకరింపఁబడిన సర్వసాధారణ భావములు గలది లఘుసారస్వత మనఁదగును. ఇందుల కుదాహరణముగ నేఁటి కాలపు కథానికలు, నాటికలు ఖండకావ్యాదులు గ్రహింపనగును. ఉదాత్త సారస్వత మాదర్శ మానవ జీవితమును ప్రతిపాదించి, నిత్య జీవితమునకు దూరముగా నుండినను నాకర్షించి, శాశ్వతానందమును గూర్చి, విశ్వజనీనమై, యెన్ని మారులు చదివినను ప్రాత యనిపింపక, గౌరవాదరాభిరుచులను హెచ్చించి, క్రొంగొత్త చవులూరించి విశేష వ్యాఖ్యానములను స్ఫురింపఁజేయును. లఘు వాఙ్మయము వాస్తవిక నిత్య జీవనమును ప్రతిపాదించి, యపరిపక్వ భావములతో తాత్కాలిక వినోదమును గూర్చి, చదివిన కొలది దానిలోని పేలవత్వము తేలికగ గోచరించి, నిరాదరము జనించి, క్రమముగా వానిపై విసుకు, రోఁతగూడ పుట్టును. ఉదాత్త సారస్వతము గంభీరోజ్జ్వలముగ నుండి, యుత్తేజాభ్యుదయములను గల్గించి, మార్గదర్శకమై మనస్సులో శాశ్వతముగ హత్తుకొనిపోయి, మనలో ప్రతి నరమునకు పట్టిపోవును. లఘు వాఙ్మయము మన నిత్యజీవనమునకు, సన్నిహిత సంఘమునకును సంబంధించినదై యుండి, మనకు సానుభూతియు, స్నిగ్ధపరిచయమును గల్గించి, శీఘ్రముగ నభినందించునట్లు చేసి, చక్కిలిగింత పెట్టినట్లుండినను, త్వరలో పేలవమై మనస్స్మృతిపథమునుండి మాసిపోవును. దీనిలో జిగి, బిగి, పసలేదు. వివిధ వృత్తులలో దినమంతయు గడపి, శ్రమించి, విసికిన మీదట ప్రజాసామాన్య మీ లఘు సారస్వతము చదివి, చక్కిలిగింత పెట్టఁబడినట్లు కొంత తాత్కాలికోల్లాసమును పొందును కాని దానిలో లోఁతులేదు. ఉదాత్త వాఙ్మయము నీతి ధర్మములను ప్రతిపాదించి వానికి ప్రాధాన్యమొసగును. లఘు వాఙ్మయము వానికి ప్రాధాన్యమొసగక, మానవ నిరంకుశత్వమును స్వేచ్ఛను ప్రతిపాదించును. ఉదాత్త సారస్వత మాలోచనామృతము కాఁగ, లఘు సారస్వత మాపాతమధురము మాత్రమేయగును.

సామాన్యముగా నుదాత్త భావము లుదాత్త మానవుల నుండియే వెలువడఁగలవు. ఉదాత్తులు తమ భావముల కనుగుణముగా నుదాత్త కార్యములను చేయుదురు. ఇట్టివారు ధీరులుగాక తప్పదు. అందుచేతనే వారు ధీరోదాత్తులనఁబడిరి. అట్టివారు లోకమున కోటికే యొకరిద్దరు మాత్రమే యుండఁగలరు. తక్కినవారందరు లఘు మానవులో, లేక మధ్య తరగతికిఁ జెందిన సాధారణ మానవులో యగుదురు. ప్రపంచ మీ మూఁడు విధములైన జనులతోఁ గలసియే యుండును. మానవ ప్రకృతి గుణదోషసంకలితమని యంద ఱంగీకరింతురు. అందు పశుత్వ, మానవత్వ, దేవత్వములను మూఁడు ప్రవృత్తులు గలవు ఆహారము, నిద్ర, రోగము, శోకము, కామక్రోధాద్యరిషడ్వర్గముతోఁ గూడియుండుటచే (ఇవి పశువులందు గూడ నుండును గాన) మానవుడు పశుతుల్యుడగుచున్నాడు. బుద్ధి, విద్య, వివేచనాది శక్తి సంపన్నుడగుటచేతనే యాతనికి మానవత్వము సిద్ధించుచున్నది. ఈ గుణములు పశువులందుండఁజాలవు ఇందుచేతనే విద్యావివేకహీనుడు ద్విపాదపశువనఁబడుట, ఇఁక దయ, దాక్షిణ్యము, భక్తి మొదలగు గుణవిభూతి గల్గుటచే మానవుడు దేవ సమానుఁ డగుచున్నాడు. దోష

మొనర్చుట మానవత్వము, క్షమించుట దేవత్వమని కదా లోకోక్తి. (To err is human and to forgive is divine). ఈ త్రివిధ ప్రవృత్తులు సత్వ రజ స్తమో గుణ భేదముచేఁ గలుగుచు, వారి వారి లోఁ గల తారతమ్యము, త్రిగుణ మిశ్ర తారతమ్యము చేత నేయగుచున్నది. ఇందు చేత నే మానవులలో మంచి చెడులు కలిసి యున్నవని విశ్వసింపఁబడును. ఇట్టి మానవులతోఁ గూడినదే సంఘము. ఈ సంఘము వివిధ దేశ జాతులలో నాచార భేదములచేఁ గొన్ని విలక్షణములతో నుండును. ఇట్టి సాంఘిక జీవన ప్రతిపాదన మేకద సారస్వతము.

లోకములో మనమెల్లప్పుడును జూచు చుండు వానికి చిత్తాకర్షణ శక్తి యుండదు. అసాధారణములు, నద్భుతము లైన వ్యక్తులు చిత్తము నాకర్షించి, యందు స్థిరముగా నిలిచి, స్మృతి పథము నుండి శీఘ్రముగ మాసిపోవు. సామాన్య మానవుల జీవితము లద్భుతములు, ననన్య సామాన్యములు, లోకోత్తరములును గాకపోవుట చేతనే యూరును పేరును లేక నశించి శీఘ్రకాలముననే మరపు వచ్చును. వీరితోఁగూర్చిన సారస్వతమే లఘువాఙ్మయ మనఁబడును. సర్వలోకసాధారణముగా నిది లోకోత్తరము నలౌకికమునగును. ఇందుచేతనే సత్కవులు శాశ్వతముగ నుండి లోకము నాకర్షింపఁగల యద్భుత పాత్రల సృష్టించి, తన్మూలమునఁ దమ కావ్యముల కజరామరత్వములను కీర్తిని సంపాదించు కొనిరి. ఇట్టియద్భుత వ్యక్తులే యుదాత్త నాయకు లనఁబడిరి. ఈ లోకోత్తర వ్యక్తులను చిరస్మరణీయులను జేయుట కొఱకు కవులు తమ రచనల యందు సామాన్య ప్రపంచమును, ప్రకృతి సీమను కొంచెము దాటిపోవలసి వచ్చును. అంతట నా పాత్రల చరిత్రముల కలౌకికత లేక లోకోత్తరత్వ మేర్పడును పాశ్చాత్య సారస్వతమునమాక్బెత్తుసతియు, ఒథెల్లో, రిచార్డు, గొనిరిల్, జాన్ మొదలైన వారును, భారతీయ వాఙ్మయమున నలుడు, హరిశ్చంద్రుడు, యుధిష్ఠిరుడు, రాముడు, రావణుడు, దుర్యోధనుడు మొదలగువా రిట్టి యలౌకిక వ్యక్తులు లేక లోకోత్తర వీరులనఁబడుదురు. వీరులను మూఁడు విధములుగ విభజింప వచ్చును. అరిషడ్వర్గ ప్రాబల్యమున బొందు వీరులు పాశవ వీరు లనఁబడుదురు. ఉదాహరణమునకు నహుషుడు, రావణ దుర్యోధనులు, మాక్బెత్తు మొదలైనవారు. దయా దానక్షమాదుల వలన వీరత్వము సాధించినవారు దివ్య వీరులనదగు ఉదా-బలి,కర్ణుడు,రఘువు,ద్రౌపది, భీష్ముడు మొదలైనవారు. ధర్మ సంస్థాపనార్థము భూభారము తగ్గింపఁ బూనిన వారు ధర్మవీరు లనఁబడుదురు. ఉదాహరణమునకు శ్రీరాముడు, గాంధీ, బుద్ధుడు మొదలైనవారు. ఇటువంటి యసాధారణ వ్యక్తులు ప్రపంచమున జీవించి యుండుట యసాధ్యము కాదా యని పూర్వపక్షము, అసాధ్య మైనను నసంభావ్యము గాదని సమాధానము. సారస్వతమున సాధ్యమైన యసంభావ్య విషయముకంటె, నసాధ్య మైన సంభావ్య విషయమే పరిగ్రహింపఁ దగునని అరిస్టాటిల్ తన కావ్య తత్త్వమున వివరించి నాడు కాన నట్టి లోకోత్తర వ్యక్తుల యునికి సుసంభావ్యమే యని గ్రహింప వలయును. శివాజీ, గాంధి మొదలైన యసాధారణ వ్యక్తులను మనము ప్రత్యక్షముగాఁ జూచుటలేదా?

మానవ ప్రకృతిని యథా తథముగ చిత్రింపఁగల నిపుణు లని ఖ్యాతి కెక్కిన పాశ్చాత్య కవు లెట్టియుదాత్తనాయకు నందైన నేదో యొక దోష ముండి తీరు నని యెంచి, యతఁ డరిషడ్వర్గమునకు లోనై, తదుద్రేకమున మతి పోగొట్టుకొని వివేక శూన్యుడై, రక్తపాత మొనరించి నరరూప రాక్షసుని వలె ప్రవర్తించి, మానవ ప్రకృతి యందలి పాశవాసుర ప్రవృత్తులకే యెక్కువ గౌరవ మొసంగి, యాత్మపతనము గావించుకొని, ప్రపంచ మున పుణ్యముకంటె పాపమే ఎక్కువ గలదని ప్రతిపాదించిరి. ఇందలి నాయక పతనము విధిప్రేరితము గాక, ఘటనా క్రమమున నట్లే పరిణమించి తీరునట్లు వ్యక్త మగును. మాక్బెత్తు, హామ్లెట్, ఒథెల్లో, సికందరు, సీజరు, నెపోలియన్, హానీబాల్ మొదలగువారందరు పాశ్చాత్య సారస్వతమున మహావీరులు గను, నుదాత్త నాయకులుగను, ధీరులుగ గొనియాడఁబడి జాతీయ వీరులుగను శిరోమణులుగ గౌరవింపఁబడినవారే. ఇట్టి మహానుభావులే కామ క్రోధాదులచే జయింపఁబడి, యాత్మపతనము దెచ్చి కొనినచో, నిఁక సామాన్యుల విషయ మేమి లెక్క యను తత్వమును పాశ్చాత్య సారస్వతము బోధించును. అంతర్వైరోన్మాదమును, పాపపరాక్రమమును, పాశ్చాత్య కవులు మూర్తివంతము చేయుదురు. మానవులందలి భీకరపాశవ ప్రవృత్తులు నిరంకుశముగ చెలరేగ నిచ్చినచో రక్తపాతమునఁ దప్పక పరిణమించి తీరును. ఈ ప్రవృత్తులు తుద కమానుష చర్యలకు దారితీయుట సహజము. అటువంటి బీభత్స కర్మలకు లోభమో, ద్వేషమో, పగ సాధించుటయో, స్త్రీ

యెడ సందేహజనిత క్రోధమో కారణ మగుచుండును. ఇట్టి లౌకికావస్థలను గమనించియే షేక్స్పియరు విషాదాత్మక నాటకములను రచించెను. మాక్బెత్తు, ఒథెల్లో, ఇయాగో, రోమియో, బ్రూటస్ రిచార్డుIII, మాక్బెత్తురాణి, మొదలగు నమానుష పాత్రలను సృజించి విషాదాత్మక నాటకముల నాతడు కూర్చెను. ఈ రచనలం దుత్కృశత్రు ప్రాబల్యము మానవ ప్రకృతిని దాటి యాసురసీమను సమీపించెను. లోభాంధ వంశమున మాక్బెత్తు భార్య వీరవనిత యైనది. కామ ద్వేషములు గన్ను కప్పివేయ ఒథెల్లోయును, కుచ్ఛిత కౌశలవ్యూహమును పన్ని ఇయాగోయును వీరులైరి. విషాదాత్మక నాటకము లందలి వీరు లందఱు నిట్టివారే. పాశ్చాత్య సారస్వత మందలి యుదాత్త నాయకు లందఱు నిట్టివారే, షేక్స్పియరు సామగ్రి యాతని సృష్టి కనుకూలముగ నున్నది; విషాదాత్మక నాటకములే యాతని ప్రధాన సాధన సంచయము, అందలి రచనా ప్రణాళిక నరకమును సృజించి, తద్దుఃఖాగ్నిని, యాతనా నిచయమును గన్నులకుఁ గట్టినట్లు గలదు. సర్వసామాన్యముగ లోకమునకు ధర్మమును, పాపమునకు పుణ్యమును, నసురులకు దివ్యులును నణగియే యుందురు. పాపము ధర్మమును గప్పివుచ్చును. ఇందుచేతనే ప్రపంచము విషాదమయమనియు, నిందు సుఖముకంటె దుఃఖమే యధికమనియు నుంచికంటె చెడుగే విషమని యందఱు భావించుట ఈ విధమైన ప్రపంచ వ్యవహారము యొక్క నగ్న సత్యమును ప్రతిపాదించి పాశ్చాత్య కవులు దమ వాఙ్మయము నాసుర ప్రవృత్తి గల నాయకుల రక్తపాతముతో యాతనామయ లోకమును సృజించిరి. మిల్టనుకవి రచించిన పేరడైస్ లాస్టు కావ్యములో సైతాను యొక్క యాసురిక భీమప్రకృతి పాఠకుల మనస్సులందు హత్తుకొని నట్లుగ నింకొక పాత్ర నాటుకొనదు. ఆ కావ్యమున నాతఁడు నాయకుడుగ వ్యవహరించి, సర్వశక్తుడై, యన్ని కార్యములు నిర్వహించుచు, స్వర్గ మర్త్య పాతాళములు తన కార్యసీమలుగఁ జేసికొని, యపరిమిత బలకౌశలముతో, పరమేశ్వరుని సృష్టియందు ఘోర విప్లవమును గలుగఁ జేయును. సర్వజ్ఞుఁడు, సర్వశక్తుడని పేరుగాంచిన భగవంతుడు నిర్జీవ ప్రతిమవలె నే మూలనో డాగియుండును. సైతాను ప్రచండ విక్రమముగా నాసుర శక్తి, భయంకర దేవ ద్వేషము నా కావ్యమం దెల్లెడల మూర్తీభవించును. దేవద్రోహి యగు సైతాను చేతిలో కీలుబొమ్మలై, యతని ప్రలోభమునఁ బడి యాదాము నవ్వయు పాపానురక్తులై, తత్ఫల మెట్లనుభవించిరో, పాప పరిణామ మెంత విషభూయిష్ఠమైనదో చూపుటకే మిల్టనుకవి యట్టి రచనకుఁ బూనుకొనెను. ఆ కవి మానసమున మానవ ప్రకృతి యందలి తమోమయ మలిన భావములు సాక్షాత్కరించిన విధమును ప్రకటించుట కా కావ్యము నాతడు రచించెను. మిల్టనుకవి సృజించిన సైతానుపాత్ర మెంత యద్భుత రస పూరితమో, యాతఁడు చిత్రించిన నరక వర్ణము గూడ నంతయే యత్యద్భుతమును, సవిస్తృతమే. కాని యతని స్వర్గ సృష్టికి మాత్ర మాగుణ మబ్బలేదు. అందులకే యా స్వర్గముకంటె నా నరక వర్ణనమే చిరస్మరణీయ మైనది. పాశ్చాత్య సారస్వతమున నాసురసృష్టి సమృద్ధిగా నున్నందున, దాని యాధిక్యము వలన దైవ కల్పన ప్రచ్ఛన్నమును, మలినము నైనది.

నింద్యమైన పాప మూర్తిని, తద్భీషణ పరిణామమును సాక్షాత్కరించినట్లు చిత్రించి, మానవులను దుర్మార్గ పథము నుండి మానిపించుట యుక్తమో పాయము గనుక, పాశ్చాత్య సారస్వత మందలి యాసుర సృష్టి నైతిక దృష్టితో సమర్థనీయమే యైనను, తన్మూలముననే సత్ఫలము చేకూరుననుట మాత్ర మంగీకార్యముగాదు. పాప కంటకములను దూరమునకుఁ ద్రోసివేసినఁ జాలదు. మరల నవి పెరుగవచ్చును మానవ హృదయములలో. మఱియు మానవుడు పాపము చేయనంత మాత్రమున సత్పురుషుడై సద్గతి చెందడు. అందులకు పుణ్యము తప్పక చేయవలయును. కాన మానవ హృదయములలో పాపకంటకములను తీసివేసిన వెంటనే పుణ్య బీజములను నాటినఁగాని, యా క్షేత్రమున పుణ్యఫలములు ఫలింపనేరవు. పాప భీతి కలిగినంత మాత్రమున తనంత పుణ్య ప్రవృత్తి యలవడదు. మఱియు పాప ప్రవృత్తి కల్గునంత శీఘ్రమున గాని, తేలికగకాని పుణ్యప్రవృత్తి కలుగదు. పాప మార్గ నివృత్తి కల్గించుట యెంతకష్టమో, పుణ్య ప్రవృత్తిని మానవ మానసములలో కల్గించుట యంతకంటె నెక్కువ కష్టము. ఇందుచే మానవులందు ధర్మాసక్తి వెలయించుటకును, సద్వృత్తులఁ దృష్టి చేయుటకును, ధార్మికా ధర్మముల సృష్టించుటకును పుణ్యాత్ముల సౌశీల్యమును, ధార్మికుల యాదర్శోన్నతియు సారస్వతమున చిత్రించి చూపుటయే పరమ సాధనము. ఇవి యత్యవసరము.

షేక్స్పియ రాసుర నాశనధర్మ వీరుల పాత్రలను దన విషాదాత్మక నాటకము లందు చిత్రింపక పోలేదు. కాని వా రుజ్జ్వల రూపమున పెంపొందక పోవుటచే నాయసుర వీరులను మించ లేక పోయిరి. మాక్బెత్తుకు ప్రతిగా మాక్‌డఫ్, బాంకోలు కలరు; కాని వారసమర్థులు. రిచార్డు, జాను మొదలగు వారికి ప్రతియోగులే లేరు. కావున నా నాటకములం దాసురిక పాత్రములు ప్రబలములై, తత్ప్రతియోగ పాత్రముల నణగ ద్రొక్కినవి. ఇది లోక మర్యాద ననుసరించి చేసిన సృష్టికాని, లోకోత్తరను గాఁజాలదు. భారతీయ సారస్వతమున దీనికి వ్యత్యస్తముగా నాసురవీరులయు ధర్మవీరులయు ప్రవృత్తి చిత్రింపఁబడినది. అరిషడ్వర్గ ప్రాబల్యమున మానవులకు సంప్రాప్తమైన యాసుర వీర్యమును నాశనము చేయఁగల శక్తి సామర్థ్యము లింద్రియ నిగ్రహ వశమున దేవత్వమును సాధించిన ధర్మ వీరులకే కలదని భారతీయ సారస్వతము నిరూపించును. పాశ్చాత్యుల విషాదాత్మక నాటకములందలి విషాద నాయకులకును, భారతీయ సారస్వతమందలి యాసుర నాయకులకు నేమియు భేదము లేదు. వారిద్దరు నొక్కయచ్చునఁ బోసిన ప్రతిమలే. వీరిలో నొక్కరి చరిత్రమును జదివినఁ జాలును; తక్కినవారి చరిత్ర లాకోవకే చెందును. భారతీయ కవులీ గుణముల నెల్ల కేంద్రీకరించి, భారతమున దుర్యోధనుని, రామాయణమున రావణుని చిత్రించిరి భాగవతమందలి హిరణ్యకశిపుడు భగవంతుని ధిక్కరించిన సైతాను వంటివాడు. భోగపరాయణతకు దుర్యోధనుడును, నింద్రియ లాలసతకు రావణుడును తార్కాణము. ఈ రెండు పాత్రములను బహు నైపుణ్యముతో చిత్రించి వ్యాస వాల్మీకులంతటితో నూరుకొనలేదు. ఆపాప వీరుల చరిత్రములను మాత్రమే చదువుట వలన విషఫలము ప్రాప్తించి తీరును. పాప చరిత్రములనే పఠించుట వలన భావనా శక్తి గూడ మలిన మగును. పాశ్చాత్యుల విషాద నాయకుల చరిత్రములను జదివిన వారికి రావణ దుర్యోధనుల చరిత్రములను మాత్రమే చదివిన ఫలము చేకూరును. కాన నీ పాప రాక్షస వీరులకు ప్రతిగా ధర్మవీరులను గూడ వారు సృజించిరి. ఈ ధర్మ వీరులు దమ యుజ్జ్వల మహాప్రభావముచే నాయాసుర వీరుల నంధకారమున నణఁగఁ ద్రొక్కి. వీరే పాఠకుల భావనా శక్తి నాకర్షించి, దానిని ధర్మస్యూతముగా నొనరించిరి.

హైందవ ధర్మ శాస్త్రానుగుణముగ బ్రాహ్మణున కధ్యయనము, దమము, నార్జవము, నింద్రియ నిగ్రహమును, సత్యమును, క్షత్రియునకు బాహుబల పరాక్రమ యుద్ధ నైపుణ్యములును నిత్య ధర్మములై యున్నవి. యౌవనమున నరిషడ్వర్గము ప్రబలియున్నప్పుడు జితేంద్రియులు, సంయములునైన భారతీయులు తపోబలసహాయమున దానిని జయించి యాభ్యంతరిక వీరమును సాధించిరి. శ్రీరాముని యందు బ్రాహ్మణ క్షత్రియ వీరములు రెండును గలవు. క్షత్రియులలో భీష్మాదు లనేకులు బ్రహ్మవీర్యసంపన్నులైనట్లే, ద్రోణ పరశురామాది బ్రాహ్మణ శ్రేష్ఠులు క్షాత్ర వీర్యము నార్జించిరి. వారు కామాద్యరిషడ్వర్గమును శమాది షాడ్గుణ్యముచే జయింప నేర్చిరి. అస్త్ర శస్త్రాది విద్యలచే బాహ్య శత్రువులను జయించినట్లే, శమాది షట్కముచే నరిషడ్వర్గమును గూడ జయించినవాడే నిజమైన వీరుడుగ పరిగణింపఁబడుదురు. బాహ్య శత్రువులను మాత్రమే జయింపఁగల్గి, యంతశ్శత్రువుల నడఁచలేని వారికి సుఖమే లేదు. వారికి చిత్తశాంతి చేకూరదు. అంతరంగ సమరమున విజయ మొంది చిత్తమునకు శాంతి చేకూర్చుకొను వారికి భూతల మంతయు వశమైనట్లే యుండును. నిస్పృహుఁడగు వాని చిత్తమున మోహలోభములను బుట్టించఁగల వస్తువులేయుండవు. జ్ఞాన బలమే నిజమైన వీరత్వ మని భారతీయులు నమ్మిరి. అట్టి వీరులు రాజర్షు లనఁబడిరి. ఉదాహరణకు జనకుడు మొదలైనవారు.

ఆంగ్ల విషాదాత్మక నాటకములలో పాప చిత్రణ మెట్లు ప్రబలెనో, పాపగతి యెట్లౌన్నత్యము వహించెనో, యట్లే భారతీయసారస్వతమున ధర్మ చిత్రణము ప్రబలి, ధర్మగతి యౌన్నత్యము చెందెను. పారడైస్‌లాస్టునందు పాప వీరము, తద్విజయమును ప్రకటింపఁబడిన రీతి, భారత భాగవత రామాయణము లందు ధర్మవీరమును ప్రకటింపఁబడెను. యుధిష్ఠిరునియందు ప్రధానవీరము ధర్మవీరము ఈ విషయమున భీమార్జును లాతని యెదుట తలలెత్త నేరరు. భీమార్జునుల వలె దేహ బలమునఁగాని, యుద్ధ నైపుణ్యమునఁగాని యతఁడు ప్రధాన వీరుడు గాడు, యుద్ధమున కర్ణునకోడి పారిపోలేదా? తన సర్వస్వ మొకయెడను, సత్య మొకకడ నుండ ధర్మరాజు మనమున యుద్ధము ప్రారంభించెను. ద్రౌపతీ వస్త్రాపహరణ సందర్భమందు గూడ నతఁడచలుడై నిలచెను. ఈ యుద్ధమున స్థిరుఁడగుటచేతనే యతనికి యుధి

స్థిరు డను పేరు సిద్ధించినది. రామాయణమున వీరమున కెల్లనాధారభూతుడు శ్రీరాముడు. భీముని బలము, నర్జునుని యుద్ధ కౌశలము, ధర్మరాజు ధర్మ గౌరవమును శ్రీరాముని యందు కేంద్రీకృతములగుటచే వారందఱి కంటె నతడధికుడాయెను. వీనికిఁదోడు శ్రీకృష్ణుని ప్రభావము గూడ నాతనియందు వెలుగుచుండెను. శ్రీరామునియందు సమిష్టి చెందిన శక్తులు, వ్యష్టి రూపమున శ్రీకృష్ణ పాండవులయందు వ్యాపించినవి. శ్రీరాముని యందు త్రివిధ వీరములు ముప్పిరి గొన్నవి. ధనుర్భంగ రాక్షస సంహారములందు భీమబలమును, పరశురామ భంగ రావణ కుంభకర్ణాదుల వధలందర్జునుని యుద్ధనైపుణ్యమును, మహారాజ సౌధమునుండి ఘోరారణ్యమునకు బోవునపుడు, మహర్షుల కష్టములఁ దొలగించునపుడు, సుగ్రీవునితో స్నేహమొనర్చునపుడును, విభీషణునకు శరణమిచ్చునపుడును శ్రీరాముని ధర్మాసక్తి ప్రకటిత మగును. శ్రీరాముని పుణ్యవృత్తివలన రావణుని పాప ప్రవృత్తి పాతుపడినది. శ్రీరామ భరతుల స్నేహ ప్రభావము వలన కైకేయీ మంథరల పాపపాత్రములు రూపు మాసినవి. లోకోత్తరమైన పితృభక్తి, మాతృభక్తి పతిభక్తి భ్రాతృభక్తి విశదమైనది. సంస్కృత సారస్వతమున దివ్య ప్రకృతి సుందర ప్రభావ మధ్యమునందలి పాశవ ప్రకృతి ప్రజ్వరిల్లను. ధర్మాధర్మములకు, వీరత్వసృష్టికిని, దివ్యశోభకు భారత భాగవత రామాయణములే యునికిపట్టులు. అందలి సూక్ష్మ రూపమున నున్న యితివృత్తములను గ్రహించి, కవులు కావ్య నాటక ప్రబంధములను స్థూల రూపమున విశదీకరించి ప్రత్యక్ష ప్రతీతి నొందించి, తత్సంస్కారము మనస్సులలో నాటుకొనునట్లు చేసిరి.

పాశ్చాత్యుల విషాదాత్మక నాటకముల యాధిక్యము వాని యందలి కరుణ భయానక రసము లందిమిడి యున్నది. కాని కథా పరిణామమున రక్తపాతమైనచో బీభత్సరస ముదయించి, యదియే పెరిగి, పై రెండు రసముల నణఁగద్రొక్కి తానే యతిశయించును. రక్తపాతమును జూచినను, వినినను, చివరకు స్మరించినను గూడ బీభత్సముదయించి, గుండె లదరి, శరీర మంతయు కంపించి చిత్తక్షోభము చెందును. ఆ క్షోభము నశించువఱకు కరుణరసముదయింపఁ జాలదు. ధర్మపరులు నిగ్రహింపఁబడినను నిహతులైనను గూడ వారియెడ కరుణ పుట్టుట సహజము. ఉదాహరణమునకు సావిత్రి, సీత, దమయంతి, శకుంతల, సారంగధరుడు, డిసిడిమోనా, కాన్‌స్టెన్, ఒఫీలియా, పాండవులు, లియర్ మొదలైన వారు. విషాదాత్మక నాటకములలో భయావస్థలను చిత్రించుటకు వలయు నుపాయములన్నియు సమకూరియున్నవి. కాని పుణ్యమే యే సందర్భములందే యే విధముల ప్రస్ఫుట మగునో ప్రదర్శించుట కందటువంటి యవకాశము లేలేవు, ధర్మప్రతిపాదకత్వమునకు పాశ్చాత్యుల విషాదాత్మక నాటకములలో నవకాశము లేదు. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ యను దృష్టియే యందు కానరాదు. ఎట్టి మహావీరునందైన నేదే నొక దుర్గుణ ముండి, తన్మూలమున నరిషడ్వర్గమునకు వశ్యుఁడై, మహాదారుణ క్రియల నొనర్చి, తత్ఫలితముగా తన నాశనమును దానే తెచ్చి కొనుటను పాశ్చాత్య విషాదాత్మక నాటకములు ప్రతిపాదించునే కాని, పాపప్రతీకారము గాని, పుణ్యఫలము గాని యా నాటకములు సూచింపవు. శ్రీ రామ, నల, హరిశ్చంద్ర పాండవాదులెట్టి దురవస్థయందున్నను, నున్నతాదర్శముల కునికిపట్టయి, శాంత రసమును ప్రసరింపఁ జేయుదురు. అట్టి సాధన సంచయము, సౌకర్యోపాయములును ప్రాచ్య నాటకములం దమరినవి కాని విషాదాత్మక నాటకములందనువు పడవు, అందు ధర్మవీరు లెందును కానరారు. శ్రీ రామాది ధర్మవీరుల చరిత్రలందలి యనల్ప భావన మానవ హృదయములందు భక్తి శ్రద్ధలను బుట్టించి, వానిని శాంత రసముద్రితులఁ జేయును, విషాదాత్మక నాటకములందు పాపభీతిని మాత్రము గల్గించినను ధర్మాభాసముండునే కాని, ధర్మ వ్యాప్తి కందు తావులేదు. రావణాసురుని వలె సంచరింపఁ గూడదని మాత్రమే బోధించును గాని, రాముని వలె ప్రవర్తించిన పుణ్యము చేకూరునని ప్రాచ్య నాటకములు బోధించినట్లు, పాశ్చాత్య నాటకములు బోధించుట కందు ధర్మవీరులు లేనే లేరు. అధర్మమును నిర్మూలించి, ధర్మమును నెలకొల్పువారే ధర్మవీరులు. ఇట్టి ధర్మ ప్రతిపాదకత్వము వలననే యథార్థమునకు సారస్వతమున యుదాత్తత సిద్ధించును. ధర్మ ప్రతిపాదకత్వము ప్రబలెనా, యే కావ్య నాటకమైనను విషాదాత్మకము గాఁజాలదు. విషాదాత్మక నాటకములందు స్థాయీభావము పొందదగినవి భయానకరసము, పరిణామమున నుండఁదగినది కరుణరసము. ఈ రసోద్రేకములందు ధర్మ వికాసమునకు చోటులేదు. ఒక వేళ ధర్మ విన్యాస

మొనర్చుటకు ప్రయత్నించినచో వెంటనే శాంత రస మవతరించును. అప్పుడు విషాదాత్మకత్వమునకు రసభంగము కల్గును. అందుచేతనే విషాదాత్మక నాటకములు శాంత రసము జోలికిఁ బోవు. ధర్మ విన్యాసమునకును శాంత రసమునకు నవినాభావ సంబంధ మున్నది. అట్లే విషాదాత్మకత్వమునకు శాంత రసముతో వైర మున్నది. శాంత రస ప్రభావము చూడ వలెనన్నచో సంస్కృత కావ్య నాటక పురాణములనే పరిశీలింప వలెను. అరిషడ్వర్గ ప్రభావము నతితీవ్రముగ రావణ దుర్యోధనుల మూలమున ప్రదర్శించిన రామాయణ భారతము లందుఁ గూడ శాంత రస ప్రాబల్యము చక్కఁగ నిరూపింపఁబడినది.

సంస్కృత సారస్వతమున పవిత్ర ధర్మా ధర్మము లొక వంకను, నాసుర ప్రవృత్తు లింకొక వంకను ప్రతిపాదింపఁ బడినవి. రెండును లోకోత్తరము లైనవే. పాపనాశన మొక వంకను, పుణ్యోదయము మరియొక వంకను నుండి, ద్వివిధ సంపదచే నా సారస్వతము పాప నివృత్తి నొనర్చుటే కాక, పుణ్యమార్గ ప్రవృత్తిని గూడ గల్గించుచున్నది. ఇంత కంటె నున్నతాదర్శము లూహాతీతములై యుదాత్త సారస్వతమున కివి పరమావధిని జూపుచున్నవి. ఇందుల కుదాహరణముగా నొక విషయము భారత భాగవతములనుండి పరిశీలింతము. భారత కథలో ద్రౌపతి క్షత్రియాంగన వీరపత్ని. ఆమె కౌరవుల వలన పడరానిపాట్లు పడినదికదా. కౌరవ పాండవులకు సంధి చేయ రాయబారిగా పోనున్న శ్రీకృష్ణునితో ధర్మరాజు శాంత వచనములను విని యామె క్లేశము చెందినది. ఆ సందర్భమున తిక్కన సోమయాజి చేసిన రచన యిది.

ధర్మనందను పలుకులు తనకు హృదయ
తాప మొనరింప మోమున దైన్య మొంద
నున్న పాంచాలి యట్లని యొయ్యఁ బలికెఁ
గనలి శౌరితో గద్గదకంఠి యగుచు॥

చెప్పవలసిన దంతయుచెప్పిన తరువాత,

ద్రోవది బంధురం బయిన
క్రొమ్ముడి గ్రమ్మనవిడ్చి, వెంట్రుకల్
దావల చేతఁ బూని యసి
తచ్ఛవిఁబొల్చు మహా భుజంగమో
నా విలసిల్లి ప్రేలఁగ, మ
నంబునఁ బొంగు విషాద రోషముల్
కావఁగ లేక, బాష్పములు
గ్రమ్మఁగ దిగ్గనలేచి యార్తయై॥

వ॥ గోవిందు ముందటం బెట్టి యిట్లనియె.

ఇవి దుస్ససేను ప్రేళ్ళం,
దవిలి సగము ద్రెవ్విపోయి దక్కిన యవి, కౌ
రవులకడఁ దీఱు మాటల,
యవసరమునఁ దలఁపవలయు నచ్యుత వినిన్॥

ఈ వెంట్రుకలు పట్టి యీడ్చిన యాచేయి
తొలుతగాఁ బోరిలో దుస్ససేను
తను వింతలింతలు దునియలై చెదరి రూ
పఱియున్నఁ గనియుడుకాఱు గాక
యలు పాలఁ బొనుపడునట్టి చిచ్చే యిది
పెనుగవ పట్టిన భీమసేను
బహుబలంబును చాటించి గాండీవ
మను నొక విల్లెప్పుడును వహించు
కట్టి విక్రమంబుఁ గాల్పనే యిట్లు బ
న్నములు వడిన ధర్మనందనుండు
నేను రాజరాజు పీనుంగుఁ గన్నారఁ
గానఁబడయ మైతిమేనిఁ గృష్ణ॥

నెట్టన యిట్టి యల్కమది
నిల్పితి రక్కసితాల్మిఁ జిచ్చొడిం
గట్టిన యట్లు పెద్దయును
గాలము, దీనికి నారు పెన్నడుం
బుట్టదు, దుష్ట నిగ్రహము
పూని జగంబులు గాచునట్టి తోఁ
బుట్టవు నీవు తేజమునఁ
బొల్చిన భర్తలుఁ గల్గ నచ్యుతా॥

ఈమె మాటలను చేష్టలనుబట్టి ఈమె యెట్టి పౌరుషము గల వీరాంగనయో, యీమె కున్న యవమాన ప్రతీకార దీక్ష యెట్టిదో, యామె కున్న కోపజ్వాల లెట్లు పై కుబికి వచ్చు చున్నవో స్పష్టముగు చున్నవికదా. ఇట్టి ద్రౌపది నిద్రించు చున్న తన కుమారులను దయలేక సంహరించిన యశ్వత్థామను శ్రీకృష్ణార్జున భీములు గట్టితెచ్చి తన యెదుటఁ బెట్టినపు డతనిఁ జూచి యామె పలికిన మాటలు, చేసిన చేష్టలలోఁగల యౌదార్య మెట్టిదో తెలిపి యామె యుదాత్తత ప్రకటించు చున్నవి. భాగవతములో పోతన రచన యిది.

ఇట్లర్జునుఁడు దెచ్చి చూపిన, బాలవధ జనిత లజ్జావరాఙ్ముఖుండైన కృపి కొడుకుం జూచి, మ్రొక్కి సుస్వభావ యగు ద్రౌపది యిట్లనె.

వరగన్ మా మగవార లందఱును మున్
బాణ ప్రయోగోప సం
హరణాద్యాయుధ విద్య లన్నియును ద్రో
ణాచార్యుచే నభ్యసిం
చిరి, పుత్రాకృతి నున్న ద్రోణుఁడవు, నీ
చిత్తంబులో లేశముం
గరుణా సంగములేక శిష్యసుతలన్
ఖండింపఁగాఁ బాడియే.

భూసురుఁడవు, బుద్ధి దయా-
భాసురుఁడవు, శుద్ధ వీరభట సందోహా
గ్రేసరుఁడవు, శిశుమారణ-
మాసుర కృత్యంబు, ధర్మమగునే తండ్రీ.

ఉద్రేకంబున రారు, శస్త్రధరులై యు
ద్ధావనిన్ లేరు, కిం
చి ద్ద్రోహంబును నీకుఁ జేయరు, బలో
త్సేకంబుతో జీకటిన్
భద్రాకారుల చిన్న పాపల, రణ
ప్రౌఢక్రియా హీనులన్
నిద్రాసక్తుల సంహరింప నకటా,
నీ చేతు లెట్లాడెనో॥

అక్కట, పుత్రశోక జని
తాకుల భార విషణ్ణ చిత్తనై
పొక్కుచు నున్న భంగి, నినుఁ
బోర కిరీటిని బద్ధుఁ జేసి నేఁ
డిక్కట కీడ్చి తెచ్చుట స
హింపనిదై భవదీయ మాత, నేఁ
డెక్కడ నిట్టి శోకమున
నే క్రియ నేడ్చుచు పొక్కుచున్నదో॥

అని శ్రీకృష్ణార్జునులంజూచియిట్లనియె

ద్రోణునితో శిఖం బడక
ద్రోణకుటుంబిని యున్నదింట న
క్షీణతనూజ శోకపివ
శీకృతనై విలపించుభంగి నీ
ద్రౌణిఁ దెరల్చి తెచ్చుటకు
దైన్యము నొందుచు నెంత పొక్కునో
ప్రాణ వియుక్తుడైన, నతి
పాపము, బ్రాహ్మణహింస మానరే.॥

భూపాలురకు విప్రులఁ,
గోపింపం జేయఁదగదు, కోపించినఁ ద
త్కోపానలంబు మొదలికి,
భూపాలాటవులఁగాల్చుభూకంపముగాన్.

అని యిట్లు ధర్మ్యంబును, సకరుణంబును, నిర్వ్యాళీకంబును, సమంజసంబును, శ్లాఘ్యంబు నుంగాఁ బలుకు ద్రౌపది పల్కులకు ధర్మనందనుండు సంతసిల్లె. నకుల సహదేవ సాత్యకి ధనంజయ కృష్ణులు సమ్మతించిరి. సమ్మతింపక భీము డిట్లనియె.

కొడుకులఁ బట్టి చంపెనని
కోపము చెందదు, బాలఘాతుకున్
విడువు మటంచు చెప్పెడిని,
వెవట్టిది ద్రౌపది, వీఁడు విప్రుఁడే
విడువఁగ నేల, చంపు డిటు
వీనిని, మీరలు చంపరేని, నా
పిడికిటి పోటునన్ శిరము
భిన్నము సేసెదఁ జూడు డిందఱున్

అని పలికిన నశ్వత్థామకు ద్రౌపది యడ్డంబు వచ్చె. భీముని సంరంభంబు చూచి హరిచతుర్భుజుండయి, రెండు చేతుల భీముని వారించి, కడను రెంటను ద్రుపద పుత్రికను దలంగించి, నగుచు భీమున కిట్లనియె.

అవ్వుఁడు గాడు వీఁడు, శిశు
హంత దురాత్మకుడాతతాయి హం
తవ్యుఁడు, బ్రహ్మ బంధుఁ డగు,
దప్పదు నిక్కము, 'బ్రాహ్మణోన హం
తవ్య' యటంచు వేదము శ్రు
తంబగు గావున ధర్మదృష్టిగ
ర్తవ్యము వీనిఁగాంచుట య
థాస్థితిఁ జూడుము పాండవోత్తమా.

అని సరసాలాపంబులాడి పవననందను నొడంబరచె.

ఇందలి యశ్వత్థామ చర్య యాసురము. ద్రౌపది ప్రవర్తనము దివ్యము. అశ్వత్థామ యాసురకార్య నిర్వహణము విని యాపాదమస్తకము నడలనివారుండరు. ఆ కూరమన్యుని సేవగించుకొననివా రుండరు. ద్రౌపది లోకోత్తర సహృదయత, క్షమ, ధర్మప్రీతియు నశ్వత్థామ నింద్య చరిత్రమును గూడ మరుగుపరచి, యుదారమును, శాంతమును నగు రసముచే మనస్సు నార్ద్రి మొనర్చి, ధర్మానురాగము ఉదయింపఁ జేయుటచే, నెట్టి పాపచిత్తమైనను చిత్తమునుండి తొలఁగి, యంతఃకరణమున ధర్మబల ముద్భవింపఁ జేయునని యుద్బోధించును. ఇందలి భీముని ప్రకృతి సర్వజన సామాన్యముగ నుండి శత్రుత్వమును సాధించునదై, రజస్తమోగుణ భూయిష్టమైనది. ఇది లోక సామాన్యము. ద్రౌపది కూడ లోక సామాన్య వనితయే యైనచో నశ్వత్థామను వధింపఁజేసి పగదీర్చికొనియెడిదే. అప్పు డామె జీవితము సామాన్య మానవ జీవితమువలె శీఘ్రముగ విస్మరింప బడెడిదే. కాని యామె సత్వగుణ ప్రాధాన్యము గలదగుటచే తన కోపోద్రేకమును నిగ్రహించుకొనగలిగినది. సామాన్యముగా కోపోద్రేకము పాపపుణ్య వివేకమునుకూడ చంపి యాసురకార్యనిర్వహణమునకు ప్రేరేచును. బాలవధకు తనలో దాను లజ్జపడుచున్న యశ్వత్థామను జూచి ద్రౌపది పుత్రాకృతి నున్న ద్రోణు' డనుకొనినదే కాని, శత్రువుగా చూడక, వెంటనే సుస్వభావయై మ్రొక్కినది. తర్వాత, 'చిత్తములో లేశముం గరుణా సంగములేక శిష్యసుతులం ఖండింపఁగా పాడియే' అని యతని హృదయశోధనమునకు ప్రేరేచినది. యామె, పిమ్మట మెత్తగా 'శిశుమారణ మాసురకృత్యంబు, ధర్మ మగునే తండ్రీ' అని పసివానిని మందలించినట్లుగా తండ్రీ! యని సంబోధించుచు నుద్బోధించినది. 'నిద్రాసక్తుల సంహరింప నీ చేతు లెట్లాడెనో' యని కొంచెము మెత్తమెత్తగా నతని కాఠిన్యమును ప్రకటించి చూపిన దామె. తదుపరి

పుత్రశోకాకులరైన తన వలెనే యశ్వత్థామ మాత యతనిని బట్టిదెచ్చిన వార్త విని యెంత శోకించునోయని 'ఆత్మవత్సర్వభూతాని' యనునట్లు సహృదయతఁ జూపినది. ద్రోణ మరణమునకు సహగమనము చేయకయున్న ద్రోణుని భార్య, భర్త మరణంబుతోఁ బాటు పుత్రవధ గావించినచో, తాను పుత్రశోకము పొందురీతిగ విలపించును గాన బ్రాహ్మణవధ మానుఁడని దన భర్తలకు ధర్మము బోధించును. తన పగ దీర్చికొనుటకంటె, ధర్మాచరణమునకు ప్రాధాన్యమిచ్చి ద్రౌపది దన క్షమయు, నౌదార్యమును ప్రకటించినది. ఇందుచే నీమె చరిత ముదాత్తమైనది. ఉదాత్త సారస్వత మన నిదియే. దీని ప్రభావమున శాంతరస ముదయించి యమృత సేచనమువలెనే హృదయములు విప్పారును. ధర్మదేవత సాక్షాత్కరించినట్లు తోఁచును. ఇందుచేతనే ధర్మరాజు ద్రౌపది పలుకులకు సంతసిల్లి, కృష్ణాదులు సమ్మతించిరి. ఇట్టి యద్భుత సేచనము పాశ్చాత్య సారస్వతమునఁ గోచరింపదు. ఇది లోకోత్తరము, దివ్యమును.



# సంగ్రామ భేరి

డా॥ సి. నారాయణరెడ్డి

విరమించకు విశ్రమించకు
వెచ్చని నిట్టూర్పు దించకు
ఎంతో దూరం నీ గమ్యం
అంతకు దూరం నీ హర్మ్యం.

ఇది దుర్గమ మార్గం భాయీ
ఇక్కడ నీ వొక్కడ వోయీ
లేవిట వృక్షమ్ముల బారులు
లేవయ్యా రయిళ్ళ దారులు.

హిమ ఝురులూ హిమగిరులున్నవి
హిమ ఝుంఝూ పూత్కృతు లున్నవి
ఇది దుర్గమ మార్గం భాయీ
ఇక్కడ నీ వొక్కడ వోయీ.

పాంచాలీ పంచపాండవులు
పరమర్షులు భక్తులు ముక్తులు
ఏ మహిమను కళ్ళకు హత్తిరో
ఏ శక్తికి హారతు లెత్తిరో
ఆ హిమగిరి సానువు లివియే
ఆ మంచు తుఫానులు అవియే

ఐనా ఒక అవ్యక్త స్థితి
ఈనా డెదురై నిల్చున్నది.
దృగంతాల నరి కడుతున్నది
తొడగొట్టి సవా లంటున్నది.

పద పద పద ముందుకు ముందుకు.
పగళ్ళనీ రేలని యెంచకు.
విరమించకు విశ్రమించకు
వెచ్చని నిట్టూర్పు దించకు.

హిమగిరి శృంగమ్ముల వాడికి
ఈ కాల నిశీధం చీలెను.
పిడుగు దెబ్బతో చకితమ్మై
విధి సైతం నేలం గూలెను.

నలు దిక్కుల నిప్పులు కురిసెను
నలు దిక్కుల జ్వాలలు విరిసెను.
పలు దిక్కుల భూత పిశాచ
మ్ముల కహకహారవములు మొరసెను.
కాళ్ళ క్రింది ధరిత్రి సాంతం
కాల భుజంగం వలె ప్రాకెను.

భయద మృత్యు భేరీ ధ్వనితో
ప్రతిశిఖరం ప్రతి ధ్వనించెను.
సురాసురులు సైతమ్మెన్నడు
చూడని దృశ్యం కనవచ్చెను.

అడుగడుగున మీ అరికాళ్ళకు
అగ్ని కంటకమ్ములె గ్రుచ్చెను.
ప్రతి అంగం సురిగిన గానీ
ప్రతి అస్థిక విరిగిన గానీ
ఒడలంతా బడలిన గానీ
నడు నడు ప్రళయమ్మే రానీ.

కాల మ్మను దుప్పటి సందిట
కను మూసిన ధరిత్రి యంతట
జాగృతి దీపమ్ములు నాటుము
జయ సందేశమ్ములు చాటుము.

విరమించకు విశ్రమించకు
వెచ్చని నిట్టూర్పు దించకు.
ఎంతో దూరం నీ గమ్యం
అంతకు దూరం నీ హర్మ్యం.

గుజరాతీమూలం : 'స్నేహరశ్మి'

---

# పారిశ్రామిక విశేషాలు

## రాష్ట్రరంగం

ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి కార్పొరేషన్ (లిమిటెడ్) మేనేజింగ్ డైరెక్టరు, అధ్యక్షుడు హంగరీలో గాజు ఫ్యాక్టరీలు పనిచేసే విధానాలను పరిశీలించినమీదట హైద్రాబాదులో గాజు ప్రాజెక్టును నెలకొల్పే విషయంలో సాంకేతిక ఒడంబడిక మార్పుకు ఆమోదం పొందారు.

ఈ కార్పొరేషను, రూ. 600 లక్షల వ్యయంతో కొత్తగూడెంలో స్థాపించ దలచిన దుక్క ఇనుము ప్రాజెక్టుకు సంబంధించి వారు ప్రాథమిక చర్చలు జరిపారు.

రాష్ట్రంలో పి II సి పవర్ కేబుల్స్‌ను ఉత్పత్తి చేసేందుకై ఒక ప్రాజెక్టును నెలకొల్పడానికి కార్పొరేషను భారత ప్రభుత్వంనుంచి అనుమతి పొందింది.

## ప్రైవేటు రంగం

విదేశ సంస్థల సహకారంతో తమ సంస్థలో హైడ్రాలిక్ హైస్టులు, టిప్పింగ్ గేర్లు, హెవీడ్యూటీ ట్రేలర్లు, సెమీ ట్రేలర్లను ఉత్పత్తి చేసేందుకై హైద్రాబాదులోని ఆల్విన్ మెటల్ వర్క్స్ (లిమిటెడ్) వారు లైసెన్సు పొందారు.

అసెటేట్ రేయాన్ దారం ఉత్పత్తి శక్తిని 1.8 మిలియన్ కేజీలకు పెంపొందించుకోవడానికి కాగజ్‌నగర్‌లోని మెసర్స్ సర్‌సిల్క్ (లిమిటెడ్) సంస్థ వారికి భారత ప్రభుత్వం అనుమతి ఇచ్చింది.

శ్రీ జి. డి. కోఠారి సహకారంతో బోనకల్లులో స్థాపించ దలచిన సిమెంటు ఫ్యాక్టరి "అరుణ సిమెంట్ కార్పొరేషన్ (లిమిటెడ్)" అని పేరు పెట్టుకోవడానికి హైద్రాబాదులోని భారత ప్రభుత్వపు కంపెనీల రిజిస్ట్రారు ఆమోదం తెలిపారు.

## సింగరేణి కాలరీలు

1964 మే నెలలో 262,042.5 టన్నుల బొగ్గును వెలికి తీశారు.

రామకృష్ణాపురం, బెల్లంపల్లి కాలరీల వద్దగల రెండు శిబిరాలలో 100 మంది తూర్పు పాకిస్తాన్ శరణార్థులకు తాత్కాలికంగా వసతి సౌకర్యాలు కల్పించారు. శరణార్థుల కొరకు వస్త్రాలు కొనేందుకై బెల్లంపల్లి కాలరీ కార్మికులు రూ. 4 వేల మేరకు విరాళాలు ప్రోగుచేశారు. కాందిశీకులకు ధోవతులు, చీరలు, చోళీలను పంపిణీ చేశారు. సింగరేణి కాలరీల మేనేజిమెంటు శిబిరాలకు నీరు, విద్యుచ్ఛక్తి సౌకర్యాలు కల్పిస్తున్నది. బెల్లంపల్లి కాలరీల ప్రధాన ఆసుపత్రి, మందమారి డివిజనులోని కల్యాణఖని చికిత్సాలలలో కాందిశీకులకు వైద్య సహాయం లభింపజేయడానికి కూడా మేనేజిమెంటు సంసిద్ధత తెలియజేసింది.

మందమారి డివిజన్ (ఆదిలాబాదు జిల్లా) లోని నెం. 3 కల్యాణఖని వద్దగల రెండవ లోడింగ్ స్థావరం వరకు నిర్మించిన నూతన రైల్వే సైడింగ్‌ను జూన్ 10 వ తేదీన ప్రారంభించారు. ఈ ప్రదేశంలోనే ఒక కొత్త బొగ్గు స్క్రీనింగ్ యంత్రాన్ని కూడా వినియోగంలోకి తెచ్చారు. నాలుగు మైళ్ల పొడవుగల రైల్వే సైడింగ్ నిర్మాణవ్యయం రూ. 12 లక్షలు. కొత్త బొగ్గు స్క్రీనింగ్ యంత్రం స్థాపితశక్తి రోజుకు 1400 టన్నులు. దీని వ్యయం రూ. 11 లక్షలు. రామకృష్ణాపురంలో కూడా ఒక స్క్రీనింగ్ యంత్రాన్ని స్థాపించి రైల్వే సైడింగ్‌ను నిర్మించే వరకూ ఇక్కడి బొగ్గును లారీల్లో కొత్త స్క్రీనింగ్ యంత్రం వద్దకు చేర్చి పనితీసుకుంటారు. రామకృష్ణాపురం గనులు మందమారి గనులకు అయిదు మైళ్ళ దూరంలో వున్నవి. రామకృష్ణాపురం గనులవద్దకూడా రైల్వే సైడింగ్ పనులు త్వరితంగా కొనసాగుతున్నవి. రామకృష్ణాపురం వద్ద కొత్త లోడింగ్ స్థావరం ఏర్పాటు త్వరలో పూర్తికావచ్చు

## ఖాదీ, గ్రామీణ పరిశ్రమల బోర్డు

శ్రీ ఏ. భగవంతరావు, ఆంధ్రప్రదేశ్ ఖాదీ, గ్రామీణ పరిశ్రమల బోర్డు అధ్యక్షులుగా జూన్ 12 వ తేదీన ఛార్జి పుచ్చుకున్నారు.

# పిలుపు

దీపాల పిచ్చయ్యశాస్త్రి

చిలిపి బుద్ధిజేసి చీనా దురాత్ముండు
హద్దుమీరి కడు నహంకరించి
కదిసి కయ్యమునకు కాల్ ద్రవ్వుచున్నాడు.
కదలి రండు వాని గండడంప!

మారణ యంత్ర వ్రాతముఁ
జీరికి గైకొనక పిడుగు చిట్లిన గతి తెం
పారగ జొరబడి హోరా
హోరి గనుం బోరు మన సహోదరు లరుగో!

భారతదేశ రక్షణకు
ప్రాణము లొడ్డి పెనంగుచున్న హం
వీరుల కండగా నిలిచి,
విత్త సహాయ మొనర్చి, యుద్ధ సం
భారము లంద జేసి, పగ
వాని మదం బడగించి, గెల్పు జెం
డా రహి నిల్ప దీక్షకు గ
డంగుడు భారత వీర సోదరుల్,

'చీనా-ఇండియ భాయిభాయి' యనుచున్
స్నిగ్ధ ప్రసంగంబులన్
తేనెల్ చిందగ జేయుచున్ఁ గపటమై
త్రిన్ గోముఖ వ్యాఘ్రమై
యీనా డిట్లు దురాక్రమమ్మునకు వా
డెత్తెత్తి నాఁడట్టి దు
ర్మార్గునిన్, ద్రోహిని మట్టుపెట్టక సహిం
పన్ వచ్చునే శాంతిమై!

# తెలుగు నవలావికాసం

తెలుగు నవల బహుముఖాలుగా వికాస మందింది. జీవితంలోని అన్ని కోణాలలోకీ ప్రవేశించింది. వివిధ అలంకారాలు సంతరించుకుంది. ఇంకా యింకా మెరుగులు దిద్దుకుంటూనే వుంది.

— వేటూరి ఆనందమూర్తి

'నవల' అనేమాట ఇటలీభాషలోని 'నొవెల్లా' అనే మాటలోంచి పుట్టిందని చెప్తారు. నొవెల్లా అంటే అర్థం ఊహా జీవిత చిత్రణ అని. తెలుగు ప్రజకు నవల అన్నమాట ఎంత సన్నిహితం అయిపో యిందంటే అసలు అదొక విదేశీయమాటనే విషయాన్నే వారు మర్చిపోయారు. మహా రాష్ట్రీయులూ, హిందీభాష మాట్లాడేవారూ నవల బదులు 'కాదంబరి' అనో, లేదా 'ఉపన్యాస్' అనో వాడుతున్నారు గాని తెలుగువారు మాత్రం ఇంగ్లీషు మాటనే యథాతథంగా వుంచేసుకున్నారు. అసలు 'నవల' అనే తెలుగుమాటకు అర్థం స్త్రీ అని. ఆ అర్థం ఈనాడు మరుపు తెరలోకి వెళ్ళి పోయింది.

సంఘటనలూ, పాత్రలూ కల్పితాలై, తద్వారా పాఠకుడికి నవతను సంతరింప జేస్తూ, వ్యక్తి మామూలు అనుభవాలకు దూరంకాని సమకాలిక జీవిత పరిశీలనాను భవ చిత్రణే నవల. మరీ ఎక్కువగా వ్యక్తి పరిశీలన లేకుండా, ఎక్కువగా సంభాషణా యుతంగా వున్న కథాకథన పద్ధతే మంచి విధానం అని వించస్టర్ అభిప్రాయం.

నన్నయ రచించిన 'కుమార అస్త్రవిద్యా ప్రదర్శనము,' తిక్కనరచించిన 'కీచకవధ'– ఈ రెండుమహాభారత గాథలూనాటకీయధోర ణిలో సాగిన నవలలకు మచ్చుతునకలు అనవచ్చు. కేతన 'దశకుమార చరిత్ర', తిమ్మన 'పారిజాతాపహరణము', మల్లన 'రాజశేఖర చరిత్ర', రామరాజభూషణుని 'వసు చరిత్ర'లలో నవల ధోరణులు కను పిస్తాయి. సూరన 'కళా పూర్ణోదయము' యితివృత్తంలో స్వతంత్రరచన గనుక తెలుగులో మొట్టమొదటి నవలగా దానినే చెప్పవచ్చు. కాని యిది గద్యరచనకాదు. ఒకవిషయం చాలా విచిత్రం అనిపిస్తుంది మనకు. ఈయనకు సమకాలికుడై ఎక్కడో మరో దూర దేశంలోని షేక్స పియర్ వ్రాసిన కామెడీ ఆఫ్ ఎర్రర్స్‌కూ యీ తెలుగు ప్రబంధానికీ సన్నిహితమైన పోలికలు వున్నాయి.

సంస్కృత 'కాదంబరి'కి కొక్కొండ వేంకట రత్నంగారు చేసిన ఆంధ్రానువాదం 'మహాశ్వేత' అనేగద్యరచనా, నరహరి శెట్టి గోపాలశెట్టివిరచితమైన 'శ్రీ రంగరాజ చరిత్రం' ఈ రెండూతెలుగులోనవలారచనకు తొలి ప్రయత్నాలు. తెలుగునవలా సాహిత్య జగత్తులో యివి తొలి మొలకలుగా పేర్కొ వచ్చు. ఈనాడు మనం చూస్తున్న తెలుగు నవల స్వరూపం కందుకూరి వీరేశలింగం గారి 'రాజశేఖర చరిత్ర'లో రూపురేఖలు దిద్దుకొంది. అది తెలుగు నవలా చరిత్ర లోనేఒకకొత్త శకాన్నిప్రారంభించింది. రాజ శేఖర చరిత్ర గోల్డ్‌స్మిత్ వ్రాసిన "వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్"కు అనుసరణ అని కొంత మంది అభిప్రాయం. సమకాలీన సాంఘిక జీవితాన్ని వ్యంగ్యంగా చిత్రించిన చక్కటి రచన యిది, తనంత తానుగా వ్రాయడమే గాక వీరేశలింగంగారు యితరులనుకూడా ప్రోత్సహించే వారు. వివిధ పత్రికలద్వారా నవలారచనలో పోటీలు ఏర్పాటు చేశారు.

చిలకమర్తి లక్ష్మీనరసింహం సాహితీ రంగంలోకి దూకి, వరుసగానాలుగేళ్ళు తన నవలలకు ప్రథమ బహుమతుల్ని గెలుచు కున్నారు. ఆయన చేతిలో నవల స్వరూప స్వభావాలే మారజొచ్చాయి వీరి 'రామ చంద్ర విజయం' వీరేశలింగం గారి 'రాజ శేఖర చరిత్ర' ధోరణిలో సాగిన చక్కటి నవల. ఆనాటి ఉత్తరాంధ్రుల సాంఘిక జీవనం చక్కగా యిందులో చిత్రితమైంది. స్పష్టమైన వర్ణనలు, చక్కటి హాస్యం, నిత్య జీవితంలో తరచు కనుపించే పాత్రలు వీరినవలల్లోదర్శనమవుతాయి. 'హేమలత', 'కర్పూర మంజరి', 'అహల్యాబాయి', 'సౌందర్య తిలక' వంటి కాల్పనిక–పౌరా ణిక, కాల్పనిక-చారిత్రక నవలలుకూడా వీరు రచించారు.

ఆ తరువాతి రచయితలు రకరకాల పద్ధతుల్లో నవలా రచనకు ప్రయత్నించారు. నవలల్ని అచ్చువేసేందుకు కొన్ని ప్రచురణ సంస్థలు వెలిశాయి. ప్రతిభగల రచ యితలకు చక్కటి అవకాశం లభించింది. కేతవరపు వేంకటశాస్త్రి, భోగరాజు నారా యణమూర్తి, దుగ్గిరాల రాఘవచంద్రయ్య,

మరికొందరూ చారిత్రక నవలా రచన సాగించారు. వేంకటశాస్త్రిగారి 'రాయచూరు యుద్ధం', నారాయణమూర్తిగారి 'విమలా దేవి', 'ఆంధ్రరాష్ట్రము' మొదలయిన నవలలూ; రాఘవ చంద్రయ్యగారి 'విజయ నగర సామ్రాజ్యం' అనే నవలా చెప్పుకో దగ్గ చారిత్రక నవలలు. ఈ చారిత్రక నవలా రచయితలకు కొమర్రాజు వెంకటలక్ష్మణరావు గారు తమ విజ్ఞానచంద్రికా గ్రంథమండలి ద్వారా ఎంతగానో సహాయపడ్డారు.

బాపిరాజు, విశ్వనాథగార్ల రాకతో ఆంధ్ర సాహితీవనంలో చారిత్రక గుల్మాలు వింత వాసనల్ని వెదజల్లే కుసుమాల్ని పుష్పిం చాయి. ఈ యిరువురి చేతుల్లోనూ చారి త్రకనవలలు పరిపూర్ణంగా వికాసమందాయి. ఆంధ్ర శాతవాహనులను ఆధారంగా చేసుకుని బాపిరాజు వ్రాసిన 'హిమబిందు' ఒకచక్కటి చారిత్రక నవల. ఈ నవలలో వీరి బహుముఖ ప్రతిభ వెల్లడవుతుంది. వీరి 'గోన గన్నా రెడ్డి' కాకతీయుల కాలానికి సంబంధించినది. విశ్వనాథ వారి ఏకవీర తెలుగులోవున్న చారిత్రక నవల లన్నిటిలోనూ ఆణిముత్యం వంటిది. దీనిని మించినది మరొకటి లేదు. పరిమాణంలో చిన్నదే. కాని కవిత్వపు పాలుమాత్రం యిందులో ఎక్కువ. కవి సామ్రాట్ విశ్వనాథ వారి శైలి యీ నవ లను ఒక కావ్యంగా ప్రతిష్ఠించింది. వీరి 'ధర్మచక్రం', 'బద్దన్న సేనాని', 'కడిమి చెట్టు' ప్రత్యేకంగా పేర్కొనదగ్గ చారిత్రక నవలలు. చారిత్రక నవలా రచయితలుగా అగ్రపీఠాన్ని అధిరోహించిన వీ రిరువురూ, సాంఘిక నవలా సామ్రాజ్య సింహాసనాన్ని కూడా అధిరోహించి సాహితీ జగత్తును నిరాఘాటకంగా పరిపాలించారు.

నోరి నరసింహశాస్త్రిగారు గణతికెక్కిన మరొక చారిత్రక నవలా రచయిత. వీరి 'నారాయణ భట్టు'. 'మల్లారెడ్డి', 'రుద్రమ దేవి', 'కవి సార్వభౌముడు', అనే నవలలు మామూలు చారిత్రక నవలలవంటివి గాక కొద్దిపాటి వైవిధ్యం కలవి. ఆంధ్రదేశంలోని ప్రసిద్ధ సాహితీవేత్తల చుట్టూ అల్లుకుని సాగిన యితివృత్తాలుగల నవలలివి. కొన్ని గొప్ప గొప్ప ఇంగ్లీషు నవలలకు కొంత మంది ప్రసిద్ధ చిత్రకారుల, సంగీత కోవిదుల జీవితాలు ఎలా యితి వృత్తాలుగా అయ్యాయో, అదే విధంగా యీయన తన నవలలకు యితివృత్తాలుగా సుప్రసిద్ధాంధ్ర సాహితీవేత్తల జీవితాలను ఎన్నుకున్నారు.

సుప్రసిద్ధ చరిత్రకారుడు డా॥ నేలటూరి వెంకట రమణయ్య 'మధుమావతి', 'ఛత్ర గ్రాహి' వంటి ఆసక్తికరమైన చారిత్రక నవలలను కొన్నిటిని రచించారు. కేవలం చరిత్రను, అందమైన నవలగా మలచగల నేర్పు వీరికి వుంది.

వీరి చారిత్రక నవలలు ఆసక్తికరము లనడంలో ఎట్టి సందేహమూలేదు. మంగో లియా వీరుడు చంఘిజ్‌ఖాన్ జీవితాన్ని చిత్రిస్తూ తెన్నేటి సూరి ఒక నవల వ్రాశారు. ఇటీవలి కాలంలో చెప్పుకోదగిన చారిత్రక నవలలుగా మల్లాది వసుంధరా దేవిగారి 'తంజావూరు పతనం'; ధూళిపాళ శ్రీరామమూర్తిగారి 'భువన విజయము'; కొర్లపాటి శ్రీరామమూర్తిగారి 'చిత్రశాల' లను పేర్కొనవచ్చు.

## డిటెక్టివ్ నవల

ఇరవయ్యో శతాబ్దపు తొలి రోజుల్లో విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి మార్గంలో, ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమండలి మార్గంలో అనేక ప్రచురణ సంస్థలు తలఎత్తాయి. ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమండలి, రామ విలాస గ్రంథమాల సాహితీ జగత్తులో అశేష కృషి గావించాయి. ముఖ్యంగా నవలా రచనకు ఎంతగానో తోడ్పడ్డాయి. పాఠకుడిలో ఉత్కంఠను రేకెత్తించే నవ లలు ప్రజలను బాగా ఆకర్షిస్తాయి గనుక అపరాధ పరిశోధక నవలలు చాలావరకు బయల్వెడలాయి. నిత్య జీవితంలో ప్రతి విషయంలోనూ — ముఖ్యంగా సాహిత్య రంగంలో — బెంగాలీలను అనుసరించడం ఆ రోజుల్లో ఒకఫేషన్ అయిపోయింది. బెంగాలీలోంచి తెలుగులోకి అనువాదాలు అసంఖ్యాకంగా వచ్చాయి. ఆంధ్రప్రచారిణీ పేరుక్రింద వేంకట పార్వతీశ్వర కవులు వంటి పండితులు, యింకా మరికొందరు అపరాధ పరిశోధక నవలలు అనేకం ప్రచురించారు. 'ప్రమదావనం' వంటి అచ్చమైన మౌలిక నవలను కూడా వీరురచించారు. జొన్నలగడ్డసత్యనారాయణ మూర్తి, తాపీ ధర్మారావువంటి రచయితలు 'కాలసర్పి', 'వాడేవీడు' వంటి అపరాధ పరిశోధక నవలలను సరస్వతీ గ్రంథమాల, వేగుచుక్క గ్రంథమాల ద్వారా ప్రచురిం పించారు. చింతా దీక్షితులుగారి 'చిత్రలేఖ' మాలె రాఘవరావుగారి 'అపరిచిత', శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'రక్షా బంధనము' ప్రత్యేకించి చెప్పదగిన అపరాధ పరిశోధక నవలలు అభ్యుదయ కవి శ్రీశ్రీ తెలుగు పాఠకులకు కానన్‌డైల్ శైలిని పరిచయం చేశారు.

ఇటీవలి కాలంలో యీ మాదిరి నవల లకు కొత్తగా అశేష ప్రచారం లభించింది. శారద (అసలుపేరు నటరాజన్. స్వత హాగా తమిళుడు), టెంపోరావ్, కొమ్మూరి సాంబశివరావు, ఆరుద్ర గారలు యీ రకపు డిటెక్టివ్ నవలల్లో సిద్ధ హస్తు లనుపించు

కున్నారు. ఆరుద్ర ఈ మాదిరి యితివృత్తాలని అతి చాకచక్యంతో మలచగల రచనానికి వీరి 'పలకలవెండిగ్లాసు' అన్న నవలే యిందుకు నిదర్శనం. డబ్బు చేసుకోవడమే ప్రధానోద్దేశంగా మరీ చవకబారు పుస్తకాలుకూడా వస్తున్నాయి. కేవలం ప్రజలలో చదివే అలవాటును కలిగించడానికి తప్ప మరెందుకూ పనికిరావివి. వెనకటికి రెండు దశాబ్దాల క్రిందట చారిత్రక నవలలు ప్రజలకు విజ్ఞానాన్ని యిస్తే, కొవ్వలి నవలలు ఎలా ప్రజల్లో పఠనాశక్తిని ప్రేరేపించి ప్రోత్సహించాయో ఆదేవిధంగా యీ నవలలు కూడాను.

## సాంఘిక నవలలు

సాంఘికనవలారచనకువీరేశలింగంగారు యిచ్చిన ప్రోత్సాహంతో చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు కూడా కొన్ని సాంఘిక నవలల్ని వ్రాశారు. 'గణపతి' గ్రామీణ వాతావరణంతో కూడిన చక్కటి హాస్య నవల. కేతవరపు వేంకటశాస్త్రిగారి 'అగ్రహారం' 'రాజ్యలక్ష్మి' వంటి సాంఘిక నవలలు సమకాలీన జీవితాన్ని, సంఘాన్ని చిత్రిస్తాయి. ఆ తరువాతి రచయితలు. సమాజం ఎదుర్కొనే సమస్యల్ని తీసుకుని ఎవరికితోచిన విధంలో వారు వాటిని సాధించడానికి ప్రయత్నించారు. రాజకీయ అన్యాయాలు, సాంఘికఅసమానతలు, ద్వేషాలూ, కార్పణ్యాలూ రచయితలను ఆకర్షించాయి. ఈ విషయాలను యితివృత్తాలుగా తీసుకుని కొందరు శక్తివంతమైన నవలలు రచించారు. ఉన్నవ లక్ష్మీనారాయణగారి 'మాలపల్లి' యీ విధమైన సాంఘిక, రాజకీయ వాతావరణంతో సాగిన నవల. ఈయన మహాత్మాగాంధీ అనుయాయుడు. అందువల్ల తన నవలలో యీయన గాంధేయమార్గాన్ని చిత్రించారు. సత్యాగ్రహం, కారాగార జీవితం, అస్పృశ్యత మొదలయిన అంశాలతో కూడిన యీ నవల ప్రజల కళ్ళు తెరిపించే బలీయమైన సాధనంగా చెప్పవచ్చు. ఇందులో గ్రామీణ జీవితం కళ్ళకు కట్టినట్లు చిత్రించబడింది. ఈ నవలలోని భావాలు బ్రిటిష్ పరిపాలకులకు నచ్చలేదు. వారు దాన్ని నిషేధించారు. కొడవటిగంటి కుటుంబరావు 'చదువు' జాతీయోద్యమం నాటి ఒక యువకుని ప్రయత్నాలు, కష్టాలను వ్యక్తం చేస్తుంది.

మహీధర రామమోహనరావు, 'రథచక్రాలు', పట్టికోట ఆళ్వారుస్వామి 'ప్రజలమనిషి' బానిసత్వంలో మ్రగ్గుతున్న ప్రజల జీవనసంగ్రామాన్ని వ్యక్తంచేస్తాయి.

## సూర్య, చంద్రులు

సాంఘిక నవలా జగత్తులో కూడా విశ్వనాథ, బాపిరాజుగార్లు యిరువురూ దేదీప్యమానంగా ప్రకాశించే సూర్యచంద్రులు. ఆంధ్ర విశ్వవిద్యాలయపు బహుమతిని వీరిరువురూ 'వేయిపడగలు', 'నారాయణరావు' నవలలకు సమానంగా పంచుకున్నారు. విశ్వనాథ ప్రవాహానికి ఎదురీదుతారు. పూర్వపు విలువలను పునరుద్ధరించడానికి బద్ధకంకణులైనవారు. వీరి 'వేయిపడగలు' జమిందారీ కుటుంబానికి సంబంధించిన మూడుతరాలవారి గాథ ఒకవిధమైన సాదృశ్యపు నవల యిది. ఇందులోని పాత్రచిత్రణ అద్వితీయమైనది. గతించిపోయిన ఒకానొక యుగానికిసంబంధించిన సాంఘిక, ఆర్థికవిద్యా సాంస్కృతిక, కళాజీవనపథాలను ఈ నవల చిత్రిస్తుంది. ఇంచుమించు ప్రతి వాక్యంలోనూ రచయిత కవితాప్రతిభ ద్యోతకమవుతుంది. బాపిరాజు 'నారాయణరావు' పాశ్చాత్య నాగరికతతో కలుషితమైన వాతావరణాన్ని, దానివల్ల ఎదురయ్యే సమస్యలను చిత్రిస్తుంది. 'వేయిపడగలు' వివరణాత్మకమైన నవల. ప్రతికావ్యంలోనూ వీరు కవితా శిఖరాలను అందుకున్నారు. 'నారాయణరావు' పాత్రాగతమైన నవల. ఈ రెండూకూడా మన సంస్కృతిని, నాగరికతను అన్ని కోణాల్లోంచీ ప్రకటించే ప్రయత్నం చేశాయి. 'చెలియలికట్ట', 'తెరచిరాజు', 'మాబాబు', 'జేబుదొంగలు' విశ్వనాథవారి మరికొన్ని సాంఘికనవలలు. వీటిలో సనాతన సాంప్రదాయాలను పరిపోషించారు వీరు. శిల్పంలో ఒకదానికొకటి పోలికలు లేకపోయినా, ప్రతినవలా దేనికది ఒక అపూర్వసృష్టి. 'హాహా హూహూ' 'పులుల సత్యాగ్రహం' వంటి భయానక కల్పనానవలలనుకూడా వీరు రచించారు. వీరి నవలల పరిమాణందృష్ట్యా, వైవిధ్యం దృష్ట్యా కూడా తెలుగు నవలాసాహిత్యంలో విశ్వనాథవారికి ఉన్నతస్థానం వుంది. కవిగా, చిత్రకారుడుగా, నవలా రచయితగా బాపిరాజుగారి కున్న బహుముఖ ప్రతిభ 'తుఫాను' 'కోణంగి' 'జాజిమల్లి' వంటి నవలల్లో వ్యక్త మవుతుంది.

గ్రామీణ జీవితాన్నీ, సాంఘిక సమస్యలను చిత్రించే చక్కటి నవలల్లో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'వడ్లగింజలు', మొక్కపాటి నరసింహశాస్త్రిగారి 'ఏకోదరులు', రావూరి సత్యనారాయణరావుగారి 'నెలవంక' చెప్పుకోవచ్చు. నవలలు చిన్నవే అయినప్పటికీ అత్యంత మనోహరంగా, ప్రతిభతో మలచారువీరు. ఇంపైన శైలి, చక్కటి కథనం వీరివి.

'శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి' తన స్వస్థలం అయిన తూర్పు గోదావరి జిల్లాలోని సనాతన బ్రాహ్మణ కుటుంబాల్లో మాట్లాడుకునే భాషలో వ్రాస్తారు. వీరి తెలుగు అటు ఇంగ్లీషు వల్లగాని, యిటు హిందీ వల్లగాని కలుషితం కాలేదు.

ఆ విధంగా వ్రాయడం ఆయనకే చెల్లింది' అన్నారు విమర్శకు డొకాయన.

## హాస్య నవల

మొక్కపాటి నరసింహమూర్తి గారి 'బారిష్టరు పార్వతీశం', జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రిగారి 'దేవయ్య' పాఠకుల్ని కడుపుబ్బ నవ్విస్తాయి. ఈ నవలలో చిలకమర్తి వారి 'గణపతి' మళ్ళీ బ్రతికి వచ్చాడనిపిస్తుంది మనకు. మునిమాణిక్యం నరసింహారావుగారి నవలికలన్నీ యీ కోవలోనివే. వీటిలోని యితివృత్తాలు మధ్యతరగతి జీవితం చుట్టూ అల్లుకుని వుంటాయి. తన హాస్యవ్యంగ్య నవలికల ద్వారా ఆంధ్ర పాఠక లోకానికి అతి సన్నిహితు డయిపోయిన ముళ్ళపూడి వెంకటరమణను ఇక్కడ ప్రస్తావించక తప్పదు. ప్రస్తుత సమాజంలో సంఘంలో మన చుట్టూ, కళ్ళముం దున్న హెచ్చుతగ్గుల్ని వెలికి తీసి, మనిషి ఆలోచనల్ని భూతద్దంలోంచి యీ నవలలు చూపిస్తాయి. మన అమాయకత్వానికి కడుపుబ్బ నవ్విస్తాయి. నవ్విస్తూనే జీవిత సమస్యల్ని ఎదుర్కొనే ధైర్యాన్ని మనలో నింపుతాయి.

## ఆధునిక నవల

చలం చేతిలో తెలుగు నవల ఒకకొత్త శక్తిని సంపాదించుకుంది. పురుషజాతి ఆధిపత్యానికీ, సంఘంలోని అత్యాచారాలకూ తీవ్ర వ్యతిరేకి యీయన. స్త్రీ పురుష సంబంధాలపై, సాంఘిక ఆచారాలపై వీరికి గల భావతీవ్రత వీరి నవలల్లోనూ ప్రతిబింబిస్తుంది. వీరి నవలలు సమాజంలో చైతన్యం కలగడానికీ, సంఘం తనను తాను పరిశీలించుకోవడానికీ కారణమయ్యాయి. చలం అభిప్రాయాలు తీవ్రమైన విమర్శలకు గురికావచ్చు. కాని వీరి కలంపోటుకు తిరుగులేదు. అనేక రకాలుగా విదేశీయ, స్వదేశీయ ప్రభావాలతో ప్రభావితు డయ్యారు చలం. ఏమయినా 'మైదానం'వంటి వీరి నవలలు తెలుగు నవలా వికాసంలో సంధి కాలాన్ని తెలియజేస్తాయి. 'జీవితాదర్శం', 'ఓ పువ్వు పూసింది' నవలల్లో చక్కటి ఊహ, కావలసినంత కవిత్వం, అందమైన పసితనం కనుపిస్తాయి.

ఫ్రాయిడ్ మనస్తత్వ శాస్త్రం మనలోని విజ్ఞానుల్ని బాగా ఆకర్షించింది. మానసిక పరిశీలనా దృష్టితో చాలా మంది కొత్త కొత్త నవలలు వ్రాయడం ప్రారంభించారు. కొడవటిగంటి కుటుంబరావు 'ఆడజన్మ', 'కులం లేని పిల్ల', 'లేచిపోయిన మనిషి' మొదలయినవి ఆ విధమైన మనస్తత్వ పరిశీలనతో చిత్రితమైన నవలలు. మనస్తత్వ చిత్రణలో కుటుంబరావు ప్రతిభ అద్వితీయమైనది. జి. వి కృష్ణారావు 'కీలుబొమ్మలు' పల్లె జీవితానికీ, పట్టణ జీవితానికీ వ్యత్యాసాన్ని వ్యక్తం చేస్తుంది. ఈ నాటి నాగరికత ప్రభావం వ్యక్తుల మీద ఎలా ప్రతిఫలిస్తున్నదో యీ నవల తెలియచేస్తుంది. గోపీచంద్, రాచకొండ విశ్వనాథశాస్త్రి, బుచ్చిబాబు వంటి రచయితల చేతుల్లో ఆధునిక తెలుగు నవల మరికొంత దూరం ముందుకు పోయింది. విశ్వనాథశాస్త్రి 'అల్పజీవి' నవల ఈనాటి మధ్య తరగతి తెలుగు జీవితానికి సంబంధించిన ఒక గుమాస్తా జీవిత గాథ. చైతన్య స్రవంతి ధోరణిలో సాగిన నవల యిది. గోపీచంద్ 'మెరుపుల మరకలు', బుచ్చిబాబు 'చివరకు మిగిలేది' అస్తిత్వ వాదం మార్గంలో సాగిన నవలలకుమచ్చుతునకలు. మొదటి నవలలోని ఉషారాణి, రెండవ నవలలోని దయానిధి— యీ ఇరువురూ అస్తిత్వ వాదులు. అంటే తమలోని కొన్ని కొన్ని సాంఘికమైన లోపాలు వున్నప్పటికీ, మంచి చెడ్డలను గురించి అట్టే ఆలోచించకుండా పరిపూర్ణమైన, స్వేచ్ఛాయుతమైన జీవితాన్ని గడపడానికై జీవితసంగ్రామాన్ని సాగించే వా రన్నమాట. మరింత సానుభూతితో తమను అర్థం చేసుకోమంటాయి యీ పాత్రలు.

## భవిష్యత్తులో నవల

ఆధునిక నవల యింకా పరిణామ మందుతూనే వుంది అయితే యీ పరిణామం వల్ల ఫలితం వుంటుందో లేదో తెలియదు. కాని ఒక సంగతి మాత్రం నిజం. ఈనాటి రచయితలు తమతమ వ్యక్తిత్వాలను నిలుపుకోవా లన్న ధ్యేయంతో ఆధ్యాత్మిక పథంలోకి అడుగు పెడుతూన్న చిహ్నాలు అగుపిస్తున్నాయి. గోపీచంద్ 'పిల్లతెమ్మెర,' 'గడియపడని తలుపులు', 'అసమర్థుని జీవయాత్ర', 'చీకటి గదులు', 'పండిత పరమేశ్వర శాస్త్రి వీలునామా' వంటి నవలలు తెలుగు నవలా పరిణామ వికాసాన్ని వ్యక్తం చేస్తాయి.

భవిష్యత్తులోని నవలకు రూపు రేఖలు దిద్దడంలో వారపత్రికలు, వార్తాపత్రికలు ప్రధాన పాత్ర వహిస్తున్నాయి. ఇతర భారతీయ భాషల్లోనూ, విదేశ భాషల్లోనూ అశేష ప్రచారంపొందిన నవలల అనువాదాలకు సినిమా ఎంతగానో ప్రోత్సాహాన్ని యిస్తున్నది. ఏటా అసంఖ్యాకంగా తెలుగులో మౌలిక నవలలు, నవలికలు అచ్చవుతున్నాయి. ఆసక్తితో పాఠకులు వాటిని చదువుతున్నారు.

పిలకా గణపతి శాస్త్రి 'విశాల నేత్రాలు', మురయా 'సంకల్ప వికల్పాలు', సింగరాజు లింగమూర్తి 'ఆదర్శాలూ–అంతర్యాలూ', పోతుకూచి 'అన్వేషణ', శ్రీదేవి 'కాలాతీత వ్యక్తులు' ఈమధ్యకాలంలోతెలుగులోవచ్చిన చెప్పుకోదగిన మౌలిక నవలలు. ఇటీవల లత, ముప్పాళ రంగనాయకమ్మ, కోడూరి కౌసల్యాదేవి, సులోచనారాణి వంటి రచయిత్రులు నవలా రచనలో గణనీయమైన కృషి చేస్తున్నారు.



## ఆంధ్రప్రదేశ్‌లో పొగాకు పరిశ్రమ

భారతదేశంలో పొగాకు పండించే రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్‌దే అగ్రస్థానం. దేశమొత్తంమీద పండేపొగాకులో సుమారు 42 శాతం ఒక్క మన రాష్ట్రంలోనే పండుతుంది. ద్వితీయస్థానం గుజరాత్, మహారాష్ట్రాంది. ఈ రెండురాష్ట్రాలు కలిసి 21.6 శాతం పొగాకును ఉత్పత్తి చేస్తున్నాయి. మన దేశంలో పొగాకుపంటవల్ల రైతులకు ఏటా సుమారు రూ. 55 కోట్ల ఆదాయం వస్తున్నది. దీనివల్ల ఎక్సైజు డ్యూటీద్వారా ప్రభుత్వానికి వార్షికంగా సుమారు రూ. 63 కోట్ల మేరకు ఆదాయం లభిస్తున్నది. రూ. 15 కోట్లమేరకు విదేశ మారకం కూడా లభిస్తున్నది.

మన దేశంనుంచి జరిగే ఎగుమతులలో ప్రధానమైనది వర్జీనియా పొగాకు. కాగా దేశంమొత్తంమీద పండే వర్జీనియా పొగాకులో 96 శాతం ఒక ఆంధ్ర ప్రదేశ్‌లోనే పండుతుంది. ముఖ్యంగా రాష్ట్ర ఆర్థిక వ్యవస్థలో ఫ్లూక్యూర్ చేసిన వర్జీనియా సిగరెట్టు పొగాకు ప్రముఖస్థానం వహిస్తుంది. భారతదేశంనుంచి ఎగుమతి అయ్యే ఈ పొగాకులో 8 శాతానికిపైగా మనరాష్ట్రంలో పండుతుంది. వర్జీనియా పొగాకును శ్రీకాకుళం, విశాఖపట్నం, ఖమ్మం జిల్లాలు మినహా కోస్తా ఆంధ్రలో మాత్రమే పండిస్తారు. నికోటిన్ పదార్థం తక్కువశాతంలో వుండే ఇతరరకాల పొగాకును ఆంధ్ర ప్రాంతంలో విరివిగా పండిస్తారు. నికోటిన్ ఎక్కువశాతంలో వుండే మూడవరకం పొగాకును చాలాకొద్దిగా పండిస్తారు. ఆంధ్ర ప్రదేశ్‌లో పండే వర్జీనియా పొగాకులో 50 శాతానికిపైగా గుంటూరుజిల్లాలో పండిస్తారు. నికోటిన్ తక్కువ శాతంలో వుండే అన్ని ఇతర పొగాకు రకాలలో 65 శాతానికిపైగా ఈ జిల్లాలో పండుతాయి.

రాష్ట్రంలో వర్జీనియా పొగాకు 'హ్యారిసన్' ప్రత్యేక రకాన్నికూడా ఎక్కువగానే పండిస్తారు. ఇదిగాక గుంటూరు జిల్లాలో 'నాటు' రకం పొగాకు కూడా పండుతుంది. చౌకరకం సిగరెట్లను తయారుచేయడానికి



లేతరంగు ఆకును వాడగా, పైపుకూ మిశ్రమాలకూ ముదురురంగు ఎక్కువగ్రేడు ఆకులను ఉపయోగిస్తారు. గుంటూరు జిల్లాలో 'వైట్ బర్లీ'అనే మరోరకం పొగాకునుకూడా వేస్తారు. కొన్నిరకాల సిగరెట్లకు దీనిని వినియోగిస్తారు.

ఆంధ్రప్రదేశ్‌లో 1963 డిశంబరు నెలాఖరు నాటికి సుమారు 2,95,500 ఎకరాల విస్తీర్ణంలో పొగాకు వేసినట్లు 1963–64వ సంవత్సరపు తొలి అంచనా వివరాలు తెలుపుతున్నాయి. గత సంవత్సరం ఇదే కాలంలో 3,47,000 ఎకరాలలో ఈ పైరు వేసినట్లు అంచనా వేశారు. గుంటూరు, కర్నూలు, మహబూబ్‌నగర్, ఖమ్మం జిల్లాలలో పొగాకును ఈయేడు నిరుటికంటే ఎక్కువ విస్తీర్ణంలో వేయగా శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా, నెల్లూరు, అనంతపురం, హైదరాబాదు, కరీంనగర్ జిల్లాలలో తక్కువ విస్తీర్ణంలో వేశారు. మిగిలిన జిల్లాలలో చాలా స్వల్పవిస్తీర్ణంలో దీనిని వేశారు.

పొగాకు నారుమళ్ళు వేయడం, నాట్లు వేయడం మామూలుగా జూలైలో జరుగుతుంటుంది. మార్చి ఆఖరువరకు కోత జరుగుతుంది. సాధారణంగా జూలై–ఆగస్టు నెలల్లో పొగాకు నారుమళ్ళు వేస్తారు. సెప్టెంబరు – అక్టోబరు నెలల్లో నాట్లు జరుగుతాయి. సుమారుగా డిశంబరు ముగింపులో కోత ప్రారంభమవుతుంది. మార్చి చివరికి ఇది పూర్తవుతుంది. వర్జీనియా పొగాకు, దేశవాళీ పొగాకు పైర్లనుకూడా ఇదేవిధంగా వేసి, కోస్తారు. మార్చి, ఏప్రిల్ నెలల్లో వర్జీనియా పొగాకు క్యూరింగ్ ముమ్మరంగా జరుగుతుంది. జనవరిలో ఇది ప్రారంభమవుతుంది. రాష్ట్రంలో ఒంటి బట్టీ ఫ్లూక్యూరింగ్ బ్యారన్లు సుమారు 17,130. జంట బట్టీబ్యారన్లు దాదాపు 1267 వున్నాయి. దీనిని బట్టి క్యూరింగ్ ప్రాముఖ్యతను గ్రహించవచ్చు. భారత దేశంలో 30 పొగాకు రీడ్రైయింగ్ ఫ్యాక్టరీ లున్నాయి. కాగా 29 ఫ్యాక్టరీలు మన రాష్ట్రంలోనే వున్నవి. గుంటూరులో గల రీడ్రైయింగ్ ఫ్యాక్టరీల సంఖ్యం 24. మిగతా 5 ఫ్యాక్టరీలు తూర్పు గోదావరి జిల్లాలలో వున్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లో పండించిన క్యూర్



పొగాకు పంట

చేసిన వర్జీనియా పొగాకును మద్రాసు, కాకినాడ, విశాఖపట్నం రేవులద్వారా ఎగుమతి చేస్తారు. ముడి వర్జీనియా పొగాకు మద్రాసు రేవునుంచి ఎగుమతి అవుతుంది. ఇంగ్లాండు చైనా, ఇండోనీషియా, జపాను, ఎడెన్, నెదర్‌లాండ్స్, బెల్జియం, హాంగ్‌కాంగ్, ఈజిప్టు, ఫ్రాన్స్— ఈ దేశాలు భారతదేశం నుంచి ఎగుమతి అయ్యే మొత్తం పొగాకులో 90 శాతానికి పైగా దిగుమతి చేసుకుంటాయి. భారదేశపు ఫ్లూక్యూర్ పొగాకును, ముఖ్యంగా మంచిరకాలను బ్రిటన్ ఎక్కువగా కొంటుంది. రష్యా, చైనా దేశాలకు స్థిరమైన స్థానికమార్కెట్లు లేనందువల్ల అవి తక్కువ గ్రేడు పొగాకునుకొంటాయి. ఆంధ్ర ప్రదేశ్‌లో ఉత్పత్తి అయ్యే దేశవాళీ పొగాకును ఎక్కువగా ఇంగ్లాండు, జపాను దిగుమతి చేసుకుంటాయి.

1954 వ సంవత్సరంలో పొగాకు వ్యాపారంలో మాంద్యం ఏర్పడింది. మన దేశంలో పండే పొగాకును కొత్త మార్కెట్లను అన్వేషించే నిమిత్తం భారత ప్రభుత్వం శ్రీ కె. రఘురామయ్య నాయకత్వాన ఆగ్నేయాసియా దేశాలకు ఒక ప్రతినిధి వర్గాన్ని పంపించింది. చైనాతో ఒక ఒప్పందం కుదుర్చుకోటంలోనూ, రష్యా, చైనా వంటి దేశాలలో భారత దేశపు పొగాకుకు మార్కెట్లు ఏర్పరచడంలోనూ ఈ ప్రతినిధివర్గం విజయవంతమైంది.

తరువాత 1956 వ సంవత్సరంలో, ఇతర అంశాలతోపాటుగా వివిధ పన్నులను గూర్చి కూడా పరిశీలన జరిపేనిమిత్తం కేంద్ర ప్రభుత్వం శ్రీ కె. రఘురామయ్య అధ్యక్షతన పొగాకు ఎగుమతి సంఘాన్ని నియమించింది. ఈ సంఘం సిఫార్సుల ఫలితంగా, ద్వితీయ ఆర్థిక కమిషను సిఫార్సుల ఫలితంగా పొగాకు వ్యాపారం, కొంతవరకు పుంజుకోగలగడమేగాక రాష్ట్ర ప్రభుత్వ ఆదాయాభివృద్ధికి కూడా చాలా వరకు తోడ్పడగలిగింది.

## ఆంధ్ర ప్రదేశ్‌లో

పొగాకురైతులకు, గుంటూరు, విజయవాడ, రాజమండ్రి వంటి ముఖ్య ప్రదేశా



బేళ్ల తయారీ

లలో ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం నెలకొల్పిన మార్కెటు కమిటీలు సహాయపడుతున్నాయి. భారత ప్రభుత్వం వాణిజ్య, పరిశ్రమల మంత్రిత్వ శాఖ ఆధ్వర్యంలో నియమించిన పొగాకు ఎగుమతుల అభివృద్ధి మండలి, ఆంధ్ర ప్రదేశ్‌లో ఉత్పత్తి అయ్యే వర్జీనియా తదితర రకాల పొగాకు ఎగుమతులను పెంపొందించడం పట్ల శ్రద్ధ వహిస్తున్నది.

పొగాకు సగటు ఎకరా దిగుబడిని హెచ్చించే నిమిత్తం పొగాకు విస్తరణ పథకాన్ని ప్రారంభించారు. గుంటూరు, ఏలూరులలో సహాయ పొగాకు విస్తరణాధికార్లు తగు సిబ్బందితోసహా నియమించబడినారు. ఈ పథకం మేరకు, రైతులకు, మేలురకం విత్తనాల ఉపయోగం, ఆధునిక సేద్య విధానాలు, చీడ, తెవుళ్ళను అరికట్టడం, ఎరువుల ఉపయోగం, భూసార పరిశీలన, అనువైన భూముల ఎంపిక, సక్రమ క్యూరింగ్ పద్ధతులు మొదలైన వాటిని గురించి తెలియజేస్తారు. రైతుల భూఖండాలపై ప్రత్యక్ష ప్రదర్శనలు నిర్వహిస్తారు. వరంగల్, ఖమ్మం, కర్నూలు జిల్లాలలో కొత్త ప్రదేశాలలో సిగరెటు పొగాకు పంట అభివృద్ధి చెందడంలో ప్రస్తుత సిబ్బందితో ఈ ప్రాంతాలకు కూడా ఈ పథకాన్ని విస్తరింప జేయడానికి తలపెట్టారు.

ఖమ్మం జిల్లా బూర్గంపాడులో రాష్ట్ర ప్రభుత్వం అధ్వర్యంలో పొగాకు పరిశోధన పథకాన్ని ప్రారంభించారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఈ పథకానికి పెట్టుబడి పెడుతున్నాయి. రాజమండ్రిలో భారత ప్రభుత్వం అధ్వర్యంలో కేంద్ర పొగాకు పరిశోధన శాల పనిచేస్తున్నది. బూర్గంపాడులో తెలంగాణా ప్రాంతానికి సంబంధించిన సమస్యలు పరిశీలించబడతాయి. క్యూరింగ్ పద్ధతులు, అనువైన రకాలను కనుగొనడం ఈ పరిశోధనల లక్ష్యం. "డెల్క్రెస్ట్", "హిక్స్" రకాలకు ఉన్నత శ్రేణి ఆకులు అధికశాతంలో లభిస్తాయి. సిగరెట్లకు ఉపయోగించే పొగాకు రకాలలో 75 శాతం ఈ రకాలకు చెందినవి.

## అనుబంధం

ఆంధ్రప్రదేశ్‌లో పొగాకు పంట విస్తీర్ణం, దిగుబడుల వివరాలు :—

| సంవత్సరం | విస్తీర్ణం (హెక్టర్లు) | దిగుబడి (టన్నులు) |
|---|---|---|
| 1956–57 | 1,60,220 | 1,34,667 |
| 1957–58 | 1,45,193 | 1 15,464 |
| 1958–59 | 1,58,532 | 1,34,698 |
| 1959–60 | 1,44,066 | 1,11,583 |
| 1960–61 | 1,42,831 | 1,12,964 |
| 1961–62 | 1,62,000 | 1,31,000 |
| 1962–63 | 1,64,000 | 1,36,100 |

# అధ్యాపకుని అధికారం

— జమదగ్ని

ఏరి కోరి ప్రవేశించి పదిహేనేళ్లు సర్వాత్మనా అవలంబించిన వృత్తిని కూడా అవసరమైతే విడిచి పెట్టేయడానికే అతను నిశ్చయం చేసుకున్నాడు. వృత్తి మర్యాదను సంరక్షించ వలసిన అధికారులు నిర్వీర్యులై స్వధర్మ నిర్వహణంలో తోడ్పడకపోయి ప్రతిబంధకంగా తయారౌతూ ఉంటే అంతకంటే గత్యంతరం లేదని తోచిందతనికి.

అందుకనే జేబులో రాజీనామా కాయితం వ్రాసిపెట్టుకుని మరీ వెళ్ళాడు కాలేజికి.

పరిస్థితులు ఇలా విషమిస్తాయని అతననుకోలేదు.

కళ్ళ యెదుట జరుగుతున్న మహా ఘోరాన్ని నివారించడం తనధర్మం. తాను ఉపాధ్యాయుడు. తన విధి తరగతిలో పాఠం చెప్పడం మాత్రంతో పూర్తి కాలేదు. విద్యార్థులు క్రమశిక్షణతో మెలగేటట్లు చూడడం కూడా తన విధిలో ప్రధాన భాగమే. అదిన్నీ తరగతి గదికి మాత్రమే పరిమితమై ఉండదు. ఎక్కడ ఎప్పుడు అక్రమధోరణి కనిపించినా దాన్ని సరిదిద్దవలసిన బాధ్యత తనమీద ఉన్నది. మన కెందుకులే అని ఉపేక్షించడం తన విధిని తాను నిర్వహించక పోవడమే. మహాకవి తిక్కన అన్నట్లు ధర్మమూ, సత్యమూ అపజయం పొందే దుస్థితి ఏర్పడ్డప్పుడు దక్షుడైన వాడు ఉపేక్షిస్తే అది వాణ్నే నాశనం చేస్తుంది. ధర్మాన్నీ సత్యాన్నీ జయింపజేసేందుకు దైవ మెలాగూ ఉంటుంది.

తాను దక్షస్థానంలో ఉన్నాడు.

చూస్తూ ఊరుకోవడం తన ధర్మం కాదు.

అది కాలేజీ వరండా. మధ్యాహ్నం క్లాసులు ప్రారంభం కాబోయేవేళ. విద్యార్థులందరూ వరండాలోనే నిలబడి ఉన్నారు. తన కప్పుడు క్లాసు లేదు. లైబ్రరీకి వెళ్దామని బయలుదేరి వెళ్తూ ఉంటే ఇరవయ్యో నంబరు గదిదగ్గర జనం గుంపుగా ఉండడం కనిపించింది. ఒకరు కాదు. ఇద్దరు కాదు. ఏభైమంది మూగిపోయారు ; ఎందుకో తెలియదు. తక్కిన గదుల్లోకి అప్పటికప్పుడే విద్యార్థులు వెళ్ళి పోవడమూ, ఉపాధ్యాయులు పాఠాలు ఉపక్రమించడమూ జరుగుతోంది. వీళ్ళ ఉపాధ్యాయుడు రాలేదు కాబోలు. అందుకోసం మూగి ఉన్నా రనుకున్నాడు తాను. సరాసరి అక్కడకు వెళ్ళాడు.

కనిపించిన దృశ్యం పరమ శోచనీయమైంది. చేరినమూక తన రాకను గుర్తించ లేదు. అంచేత ఆ దృశ్యం కంటబడింది. ఇద్దరు విద్యార్థినులు గోడ కతుక్కుపోయి ఉన్నారు. వాళ్ళను కదలనివ్వకుండా వీళ్లు మూగారు. వాళ్ళలా ఇరుకున పడడానికి కారకుడైనవాడు వాళ్ళదగ్గరే ఉండి నానామాటలూ అంటున్నాడు. వాడనే మాటలకు ఇవతలివాళ్ళు గొల్లుమంటూ కోలాహలం చేస్తున్నారు. ఇప్పుడు తాను వెనక్కు వెళ్ళి ఇలా జరుగుతోందని చెప్పి ప్రిన్సిపాలును తీసుకురావడానికి వీలు లేదు. అలా తాను వెళ్ళి వచ్చేలోపల ఇక్కడ ఏం జరిగినా జరగవచ్చు. వాళ్ళు ఏభైమందీ, తాను ఒక్కడూ అని జంకడానికివీల్లేదు. అశ్రుపాత పర్యంతమయి ఆ అమ్మాయిల ముఖాలు ఆక్రందనోన్ముఖమవుతున్నాయి. అంతలో ఎవడో అసలు వాణ్ని తోశాడన్నట్లుగా వాడు వెళ్ళి ఒకమ్మాయిని గోడకు వేసి నొక్కాడు. తాను జర్రున దూసుకుపోయి వాడి చేయి పట్టుకుని ముఖమెత్తి తనవంక చూడడానికి గూడా సందివ్వకుండా చాచి చెంపమీద కొట్టాడు. చట్రాతిమీద ఛళ్ళున పడ్డ కుండ పెంకుల్లా ఎక్కడివాళ్ళక్కడ ఒక్క పురుగు లేకుండా పారిపోయారు.

వాడుమాత్రం ముఖం కందగడ్డయి పళ్లు పటపట కొరుకుతున్నాడు.

'మీరు వెళ్ళండమ్మా' అని విద్యార్థినులను తాను పంపించివేశాడు.

తాను ఇటు తిరిగేటప్పటికి 'నీ అంతు చూస్తా' నంటూ వాడూ పారిపోయాడు.

ఇప్పుడు తా నేం చెయ్యాలి ?

ఆ విద్యార్థి పేరు తనకు తెలుసు. రెండో సంవత్సరం హిస్టరీ గ్రూపులో ఉన్నాడు. ఒకటి రెండుసార్లు తన దృక్పథంలోపడి మందలింపబడ్డవాడే. ఒకమారు అవిధేయంగా ప్రవర్తిస్తే పిలిచి కోప్పడి అన్న సంరక్షణలో ఉంటున్నాడని తెలుసుకుని, ఆ అన్నను కలుసుకుని అతని సంగతి చెప్పడం కూడా జరిగింది. ఆ అన్న తన ఎదుటనే తమ్ముణ్ణి మందలించాడు. ఆ మందలింపు ఏమీ పనిచేసినట్లు లేదు. అట్టే వయోభేదం లేని ఆ అన్న అదుపులో వీడు లేడన్నమాట. చేసిన తప్పు తెలిసికొని పశ్చాత్తాప పడక పోవడమే కాకుండా బెదిరించిగూడా వెళ్ళాడే! కోపంతో క్షుద్రవాళ్ళు నోటికి వచ్చినట్టంటారు. అంత మాత్రానికి తాను పట్టించుకోగూడదు. కాని జరిగిన దాన్ని నలుగురికీ తెలియజెయ్యడం మాత్రం అవసరం. ఇదేమి నాగరకతో గాని స్త్రీ స్వాతంత్ర్యం గురించి బహుళ ప్రచారం జరిగే ఈ రోజుల్లోనే స్త్రీ పరాభవమూ ఎక్కువ జరుగుతోంది. అందులో సహవిద్యా విధానంలో ప్రయోజనాల మాట దేవుడెరుగు. అభిమానం కల ఆడపిల్ల చదువుకోనడానికే వీలు లేని దుర్భర పరిస్థితు లేర్పడుతున్నాయి. వెళ్ళేటప్పుడూ, వచ్చేటప్పుడూ దూసుకుపోయే వాగ్బాణాలకే ఎంత గుండె నిబ్బర మున్నా చెదిరిపోతుంది. ఎవడు వేశాడో తెలుసుకోడానికే శబ్దవేధి విద్య తెలియాలి. తెలిసి పట్టుకున్నా నిరూపణకు సాధ్యంకాదు. నిరూపణ లేందే శిక్షించడానికి వీల్లేదు. అన్నవాడు నేనన్నానని ఒప్పుకోవడానికి వాడేం హరిశ్చంద్రుడా? అయినప్పుడు అననే అనడు. అన్నానని ఒప్పుకోందే శిక్షించడానికి వీల్లేదు కాబట్టి అంటూనే ఉంటాడు. దాన్ని నిరోధించడం ఈ వాతావరణంలో సాధ్యంకాదు. ఉన్న చెవులు లేవనుకొని తిరుగుతున్నాం. సరే! కళ్ళుకూడ లేవనుకొని ఎల్లా తిరగగలం?

అల్లా తిరగలేకనే తాను కల్పించుకుని వాణ్ణి శిక్షించాడు. వాడి దౌష్ట్యం ఆ శిక్షను మించిపోయింది చాలని శిక్ష దౌష్ట్యాన్ని పెంచుతుందేగాని తగ్గించదు. అందుకనే బెదిరించి వెళ్ళాడు. వాడి సంగతి పూర్తిగా కనుక్కోకుండా విడచిపెట్టకూడదు.

ఆడపిల్లల గదిదగ్గరకు వెళ్ళి ఆ విద్యార్థిను లిద్దరికీ కబురుచేశాను.

తన్ను చూస్తూనే వాళ్ళ కళ్ళల్లో నీళ్ళ కుండలు భళ్ళుమన్నాయి.

'దేవుడులా వచ్చారు మాష్టారూ! మీరు రాకపోతే ఏమై పోయేవాళ్ళమో' అంటూ గొల్లుమన్నారు.

వాళ్ళను కూర్చోబెట్టి జరిగిం దేమిటో చెప్పమన్నాడు తాను.

ఆ క్లాసులో మొత్తం అయిదుగు రాడపిల్లలు. వీళ్ళిద్దరూ వెయిటింగు రూముకి రాకుండా సరాసరి క్లాసుకే వెళ్ళారుట. ఆ క్లాసు మాష్టారు ఆపూట రారని తక్కిన వాళ్ళకు తెలిసి వాళ్ళు వెళ్ళనేలేదట. అక్కడికి వెళ్ళాక ఆసంగతి తెలుసుకుని వీళ్ళు బయలుదేరి వస్తూవుంటే 'ఉండండి ఉండండి' అంటూ ఈ రామచంద్రు డడ్డు పడ్డాడట. పిక్నిక్కుకు వీళ్ళు రామన్నారుట. వీళ్ళు గూడా రావాలని అతను పట్టు పట్టుతున్నాడట. అత నా మాట అంటూ ఉంటే తక్కినవాళ్ళంతా చేరారుట. 'వస్తా మనండి, వెళ్ళనిస్తాం'– 'వాళ్ళు పతివ్రతలురా! వాళ్ళెందుకు వస్తారు?'– ఇలా మొదలుపెట్టి ఎన్నెన్ని అవాచ్యాలు వినబడ్డాయో అంతు లేదట. ఈ రామచంద్రుడు తమ వెంటబడి ఎప్పుడూ ఏదో అంటూనే ఉంటాడట. ఇటీవల క్లాసు రిప్రజింటేటివు గూడా అయాడు. అప్పటినుంచీ మరీ హద్దుమీరి పోతున్నాడట.

'మేము రిపోర్టు ఇస్తే, ఏమీ జరక్కపోతే; వాడు మమ్మల్ని బతకనివ్వడు. అందుకనే నోరుమూసుకు కూర్చుంటున్నాము. ఇవాళ పాపం బద్దలయి మీ కంట బడ్డాడు. మీరే మమ్మల్ని రక్షించాలి' అంటూ వాళ్ళు ప్రాధేయ పడ్డారు.

వాళ్లన్నమాట నిజమే!

అన్నవన్నీ పడి ఊరుకుంటూంటేనే ఆశ పిల్ల బ్రతుకు అధ్వాన్నంగా ఉంటోంది. రిపోర్టు చేస్తే ఇంకేమైనా ఉందా? ఫలానా వాళ్లు రిపోర్టు చేశారని వెంటనే తెలుస్తుంది. వాళ్ళ పేరు సర్వాసభ్యంగానూ గోడలమీది కెక్కిపోతుంది. వ్రాసిన వాళ్ళను పట్టుకోలేక పోవడం అల్లా ఉంచి గోడల మీది వ్రాతలు చెరపడం ఆలస్యమయిన కొద్దీ అల్లరి ఎక్కువవుతూ ఉంటుంది. రిపోర్టు ఇవ్వకముంటే బురద చిందగొట్టుకోవడమే. అభిమానం కలవాళ్ళెవ్వరూ ఆపని చెయ్యరు.

ఆ ఆడపిల్లల పరిస్థితిలోనే అధ్యాపకుడూ ఉంటున్నాడు. అధ్యాపకులు చేసిన ఫిర్యాదుల మీద వెంటనే క్రమశిక్షణ చర్యలు తీసుకోరు. న్యాయస్థానాల్లోలాగ విచారణ జరగాలి. జరిగిందన్న నేరానికి ఋజువుండాలి. నిందితుడంగీకరించాలి. శిక్ష పడాలి. అదైనా ఏమిటి? రూపాయో రెండు రూపాయలలో జరిమానా! ఆ శిక్ష విద్యార్థికి కానేకాదు. ఆ భారం వహించేది

సంరక్షకులు. వాళ్లను మోసగించేందుకు శతకోటి దరిద్రానికి అనంతకోటి ఉపాయాలు. క్రమశిక్షణ చర్య తీసుకునే అధికారం సరాసరి అధ్యాపకునకే ఉంటే అత డాడపిల్లల పరిస్థితిలో ఉండవలసిన అవసరమే ఉండదు. అతనంటే భయమూ భక్తీ తప్పకుండా ఏర్పడతాయి. అధ్యాపకుణ్ని అధ్యక్షుడు విశ్వసించడు. అధ్యక్షుణ్ని అధికారులు విశ్వసించరు. ఈ అవిశ్వాసాన్నీ, ఈ అధికార రాహిత్యాన్నీ ఆలంబనంగా చేసుకుని అల్పబుద్ధు లెక్కువయి విద్యార్థిలోకాన్నంతటినీ అపఖ్యాతి పాలు చేస్తున్నారు. చెదురు చెదురుగా ఉండే ఒకరిద్దరు ఉపేక్షితులై తాచెడ్డకోతి వనమంతా చెరిచిందన్నట్లు తమలాంటి వాళ్ళను పదిమందిని తయారు చేస్తున్నారు. ఆ పదిమందీ చేరి వేలకొలది విద్యార్థులకు విద్యావ్యాసంగానికే అవకాశం లేకుండా చేస్తున్నారు.

ఈ విషచక్రం ఇట్లా ఇంకెన్నాళ్ళు పరిభ్రమిస్తుందో తెలియదు.

తాను ఆహుతి అయినా సరే దీనికి స్వస్తి చెప్పే ఉపాయం చూడాలి.

జరిగినదీ, విన్నదీ క్రోడీకరించి ఉద్వేగ రహితంగా చిత్తస్వాస్థ్యంతో తాను చేసిందీ, దాని ఫలితమూ వివరించి ఆ పూటనే ప్రిన్సిపాలుకు రిపోర్టు చేశాడు.

ఆ కాగితం చదువుకుని ఆయ నన్న మాటకు ఫలితంగానే తానీ నిశ్చయానికి వచ్చాడు.

రిపోర్టు ఇచ్చి వస్తూ ఉండేటప్పుడు తన్ను చూసి తన పేరూ, ప్రిన్సిపాలు పేరూ కలిపి 'డౌన్, డౌన్' అని అరచిన అరుపులు ఆ నిశ్చయాన్ని మరింత దృఢపరిచాయి.

రాత్రంతా ఆలోచించినా ఆ నిశ్చయం మారలేదు.

అందుకనే రాజీనామా లేఖ వ్రాసి జేబులో పెట్టుకుని మరీ వెళ్ళాడు కాలేజీకి.

## 2

ఆరోజు మొదటి గంటలోనే ఇరవై ఆరో నంబరు గదిలో రెండో సంవత్సరం హిస్టరీ గ్రూపువాళ్ళ క్లాసు తన కున్నది.

గంట కొట్టగానే తాను మామూలుగా క్లాసులోకి వెళ్ళాడు.

ఆడపిల్లలు అయిదుగురూ మాత్రం కూర్చుని ఉన్నారు.

తక్కిన విద్యార్థి బృందం యావత్తూ చెట్లకింద చేరి 'డౌన్ డౌన్' నినాదాలతో కాలేజి వాతావరణా న్నంతటినీ ముఖరితం చేస్తూనే ఉన్నది.

ఉన్నవాళ్ళకు తాను గంటసేపూ పాఠం చెప్పాడు.

అయిదుగురు మాత్రమే వచ్చారనీ, తక్కిన వాళ్ళు రాలేదనీ ప్రిన్సిపాలుకు చెప్పి తాను తన గదికి వెళ్ళాడు.

మెదటి గంటలో సమ్మె చెయ్యడం ఆ క్లాసుకు మాత్రమే పరిమితమై ఉన్నది. క్రమంగా దాన్ని వ్యాపింపజేసి, అందరు విద్యార్థుల చేతా సమ్మె చేయించాలని ప్రయత్నం జరిగింది.

'ఈ బాడీగార్డు (కొట్టిన ఉపాధ్యాయుడికి గిట్టని కుర్రాళ్ళు పెట్టుకొన్న పేరు. ఆడపిల్లల్ని అల్లరి పెడుతుంటే అడ్డు పడ్డాడు. కాబట్టి ఆయన ఆ ఆడపిల్లలకు అంగరక్షకుడని వాళ్ళ ఉద్దేశం) ఇవ్వాళ్ళ నన్ను కొట్టాడు. రేపు మరొకర్ని కొడతాడు. ఇలా మనం పడుతూ ఉండవలసిందేనా? వీల్లేదు, వీల్లేదు. బాడీగార్డు డౌన్, డౌన్! ప్రిన్సిపాల్ డౌన్, డౌన్!'

ఇలా ప్రచారం అన్ని గదుల దగ్గరా జరిగింది.

ప్రిన్సిపాలు తన గదిలోనుంచి, తాను బైటికి రాలేదు.

విద్యార్థుల్లో బయలుదేరిన సంచలనం గమనిస్తున్న ఉపాధ్యాయులందరూ సామూహిక మనస్తత్త్వం ఎటు మొగ్గుతుందో తెలియక ఫలితాలకు ఎదురు చూస్తూ ఆందోళన పడుతున్నారు. ఇద్దరు ముగ్గురు పలుకుబడిగల అనుభవజ్ఞులు 'వ్యర్థ ప్రయత్నాలు చెయ్యక మీమీ క్లాసులకు వెళ్ళం'డని హెచ్చరిస్తున్నారు.

అంతలో రెండవ పీరియడు గంట మ్రోగింది.

మూడవ సంవత్సరం విద్యార్థుల గది దగ్గర విద్యార్థులలో ఏర్పడ్డ రెండుపక్షాల వాళ్ళకూ కొంత వాగ్వాదం జరిగింది.

'ఆయన పాఠం సుష్ఠుగా చెప్పేవాడు. బుద్ధి చెప్పేవాడు గుద్దితే తప్పేమిటి? మేము సమ్మె చెయ్యం. మీరూ మానేసి బుద్ధిగా క్లాసుకు వెళ్ళండి' అన్నారు ఒక పక్షం వాళ్ళు.

రెండో పక్షం వాళ్ళు పిచ్చి అరుపులు అరిచారు.

కాలేజీ అంతటి చేతా సమ్మె చేయించడం సాధ్యం కాక పోయేటప్పటికి కనీసం 'బాడీగార్డు' క్లాసులకైనా వెళ్ళకుండా చెయ్యాలని రామచంద్రం క్లాసు వాళ్ళు ప్రయత్నించారు.

'బాడీగార్డు' అదృష్టం బాగుండి ఆ ప్రయత్నమూ ఫలించలేదు.

పోతే రామచంద్రం నాయకత్వంలో ఆ క్లాసువాళ్ళే మిగిలారు చెట్టుక్రింద.

ఆ రోజల్లా వాళ్ళు ఏ క్లాసుకూ వెళ్ళ లేదు. అల్లా చెట్టుకింద కూర్చుని బాడీ గార్డు పతన భజన చేస్తూనే ఉన్నారు.

'బాడీగార్డు' ఆరోజు తనకున్న మిగిలిన క్లాసుల్లో పాఠమూ చెప్పాడు. నిర్విరామంగా వినిపిస్తున్న తన పతన భజనా విన్నాడు.

దాన్ని ఆపే ప్రయత్నం జరక్కపోవడం అతని నిశ్చయాన్ని మరింత దృఢతరం చేసింది.

సాయంకాలం పరిపాలక సంఘం సమావేశం జరుగుతుందనీ, దానికి తాను హాజరు కావాలనీ ప్రిన్సిపాలునుంచి కబురు వచ్చింది

తానా సమావేశానికి వెళ్ళాడు. రామచంద్రం అక్కడే గోడదగ్గర నిలబడి ఉన్నాడు. తక్కిన పరిపాలక సంఘ సభ్యులతో ప్రిన్సిపాలుగారు సంప్రతిస్తున్నారు.

'ఆ ఆడపిల్లలు రిపోర్టు ఇమ్మంటుంటే ఇవ్వడంలేదు. ఇతడేమో నాకేమీ తెలియదంటున్నాడు. ఏమిటి చెయ్యడం?'

'టీచరు రిపోర్టుమీద చర్య తీసుకోవడమే సబబు. ఆపని నిన్న సాయంకాలానికే జరిగి ఉండవలసింది. ఇంతవరకూ ఉపేక్షించడంతో సమస్య విషమించింది'.

'అంత తొందరపడితే ఎలా? కొంచెం ముందువెనక లాలోచించాలి'.

లోపలి కడుగు పెడుతున్న అతనికి ఈ మాటలు వినిపించాయి.

వెళ్తూనే అతను ప్రిన్సిపాలుగారికి నమస్కరించి 'అయ్యా! ఒక మనవి. తమరు కబురంపించారు కాబట్టి వచ్చాను. నేను ఒక విద్యార్థి చేసిన అసభ్యవర్తనపై ఫిర్యాదు చేశాను. అతని సమక్షంలో ఈ సమావేశం జరగడమేమిటో నా కర్థం కావడంలేదు. నన్నూ, అతన్నీ వాది ప్రతివాదులుగా చూచి న్యాయనిర్ణయం చేస్తారా ఇక్కడ? నేనా పరిస్థితికి తల ఒగ్గడానికి సిద్ధంగా లేను. నిన్న తమరు నాతో అన్నమాటను బట్టీ ఇటువంటి దుస్థితి తటస్థిస్తుందని నేను అనుకున్నాను. దానికి సిద్ధపడే వచ్చాను నేను. అతడు చేసిన దోషానికి నేను విధించిన శిక్ష చాల లేదు. నన్ను బెదిరించి మరీ వెళ్ళాడు. ఈ రోజల్లా కాలేజీలో అతడూ, అతని నాయకత్వంలో ఆ క్లాసు విద్యార్థులూ ఎంత ఘోరంగా ప్రవర్తించారో మా అందరితోపాటు తామూ గమనించే ఉండాలి. అంతపని చేసినా అతన్ని శిక్షించే నాథుడు లేనప్పుడు అతనీ రోజున ఇలా ప్రవర్తించాడంటే అందులో ఆశ్చర్యం ఏమీలేదు. ఫిర్యాదుపై అతనికి ప్రత్యేక శిక్షా, అతని నాయకత్వంలో ఆ క్లాసు విద్యార్థులు సమ్మె చేసినందుకు వాళ్ళందరికీ శిక్షలూ అమలు జరిగేవరకూ నేనా క్లాసుకు పాఠం చెప్పదలుచుకోలేనని మనవి చేస్తున్నాను. అవసరమయితే రాజీనామా ఇవ్వడానికైనా సిద్ధంగా ఉన్నా కాని అతనితో సమాన స్థాయిలో ఈ సమావేశంలో పాల్గొనడానికి నా కెంతమాత్రమూ అంగీకారం కాదు. ఏమిశిక్ష విధించాలో నిర్ణయించడానికి ఉండమంటే ఇక్కడ ఉంటాను. లేకుంటే నన్ను అనుమతించండి. సెలవు తీసుకుంటాను' అన్నాడు.

ఆ మాటలు వింటున్నంతసేపూ ప్రిన్సిపాలు ముఖాన నెత్తురుచుక్కలేదు.

అధ్యాపకుని ధర్మవీరం ముందు అధ్యక్షుని అధికారం నిర్వీర్యమయింది. ఆయననోట మాట రాలేదు.

పాలకసంఘ సభ్యుల్లో ఒకరు రామచంద్రాన్ని వెళ్ళిపొమ్మని చెప్పారు. అతను కదలలేదు. ప్రిన్సిపాలు గూడా చెప్పాక వెళ్ళిపోయాడు.

అధ్యాపకు డంతవరకూ నిలబడే ఉన్నారు.

'నాకు సెలవిప్పించండి' అన్నాడు మళ్ళీ అతను.

రామచంద్రాన్ని వెళ్ళిపొమ్మని చెప్పిన సభ్యుడే అతన్ని కూర్చోపెట్టాడు.

ఆయనే కల్పించుకుని ప్రిన్సిపాలు గారితో ఇలా అన్నాడు.

'మనం వెంటనే ఆ క్లాసు విద్యార్థుల తల్లిదండ్రులకు నోటీసు ఇవ్వాలి. ఇలా వీళ్ళు సమ్మె చేస్తున్నారనీ, రేపు క్లాసులకు హాజరుకాని పక్షంలో చర్య తీసుకోవలసి వస్తుందనీ హెచ్చరించాలి. రామచంద్రాన్ని కనీసం వారంరోజులపాటైనా సస్పెండు చెయ్యాలి. సస్పెన్షను కాలంలో అతన్ని కాలేజి ఆవరణలోకి రానియ్యకూడదు. వస్తే అదనపు శిక్ష విధించాలి.'

ప్రిన్సిపాలు విని 'సరే కానివ్వండి' అన్నారు.

## 3

మర్నాడు కాలేజికి ఆక్లాసు విద్యార్థులందరూ హాజరయ్యారు.

ఆ నోటీసులు వెంటనే జారీ అయినట్లున్నాయి. సమ్మె సడలిపోయి అంతా వచ్చారు.

కాని అందరితోపాటు రామచంద్రమూ వచ్చాడు. అతన్ని సస్పెండు చెయ్యలేదు ప్రిన్సిపాలు.

'బాడీగార్డు' వాళ్ళ క్లాసుకు వెళ్ళలేదు.

ఆయన వెళ్ళడని ప్రిన్సిపాలుకు తెలుసు తాను ఉండి ఆయన్ను క్లాసుకు పంపించికపోతే అప్రతిష్ఠ. ఏమిచెయ్యాలో తోచక నాలుగు రోజులు సెలవుపెట్టి ఇంటిదగ్గర కూర్చున్నారు ప్రిన్సిపాలు గారు.

తాత్కాలికాధ్యక్షులు అతన్ని సస్పెండు చెయ్యాలని అధ్యక్షులకు సలహా యిచ్చిన పాలక సంఘసభ్యులే! ఆయన సూచన అమలు జరగలేదయ్యె. ఆయన వచ్చి అధ్యాపకుణ్ని అడగడానికి సంకోచించారు, కాని అధ్యక్షులు వచ్చాక 'ఏం చేశా?' రని అడుగుతారేమో! ఆయన సస్పెండు చెయ్యనప్పుడు తాను చెయ్యడం భావ్యంకాదు. ఆలోచించి చివరకాయన మధ్యేమార్గ మొక్కటి తొక్కారు.

ఒక మధ్యవర్తి ద్వారా అధ్యాపకునకు కబురు వచ్చింది.

'మీరు క్లాసు తీసుకోకుండా ఉండడం ఉచితంగా లేదు. ఇంకా మీకు ఇష్టంలేని పక్షంలో సెలవు పెట్టండి.'

అధ్యాపకుడు మళ్ళీ ఆయన ద్వారానే కబురు చేశాడు.

'నాకు సెలవు పెట్టవలసిన అవసరం లేదు. ఎందుకు క్లాసు తీసుకోవడంలేదో నేను మనవి చేసే ఉన్నాను. అవసరమయితే మీరు వ్రాతమూలకంగా అడిగితే నా కారణాలు నేను వ్రాసియిస్తాను.'

ఈ కబురు అసలు అధ్యక్షులకు గూడా వెళ్ళింది.

అధ్యక్షు లాలోచించుకున్నారు. పైకి వెళ్ళితే నిర్ణయం తమ చేతుల్లో నుంచి దాటిపోతుంది. ఎటుపోయి ఎటు వస్తుందో తెలియదు. వీ డెవడో గడుసు పిండంగానే ఉన్నాడు. ఇది ఇక్కడనే పరిష్కరించుకోవాలి గాని చేయిదాటి పోనివ్వగూడదు,

సెలవుపెట్టిన నాలుగురోజులూ అయినాక ఆయన కాలేజికి వచ్చారు. వస్తూనే ఆ నాలుగు రోజులూ భార్గవు డా క్లాసు తీసుకోలేదని తెలుసుకున్నారు.

అతని డిపార్టుమెంటు హెడ్డుకు కబురంపించి ఆ క్లాసువైపు కెవరికైనా సద్దండి అని చెప్పారు.

ఆయన సౌమ్యంగానే 'అయ్యా! ఈ కాలేజిలో అల్లరిక్లాసు లన్నీ అతనే నిర్వహిస్తున్నాడు. అతను విడిచిపెట్టిన క్లాసుకు మరొకరిని పంపడం సాధ్యం కాదు. మే మెవ్వరమూ ఆ క్లాసు తీసుకోలేము. మీరు క్రమశిక్షణచర్య తీసుకుంటే అతనే వెళ్తాడు' అని మనవి చేశారు.

దీంతో ప్రిన్సిపాలుకు పచ్చివెలగకాయ గొంతున పడ్డట్టయింది.

వెంటనే భార్గవుడికి కబురు చేశారు.

'ఏమిటండీ ఇది? నన్నేం చెయ్య మంటారు?' అంటూ విసుక్కున్నాడు.

'అయ్యా! తమ రేం చెయ్యవలసిందీ చెప్పవలసిన వాణ్ని నేను కాను. నా ఇబ్బంది నేను మనవి చేసుకున్నాను. కనిపించిన దోషాన్ని నివారించేందుకు నేను క్రమశిక్షణ చర్య తీసుకుంటే దౌష్ట్యంతో ఒకడు నన్ను బెదరించి, కాలేజి అంతటిచేతా సమ్మె చేయించాలని ప్రయత్నం విఫలుడై, తన క్లాసు వాళ్ళ అందరిచేతా ఒకరోజు రోజల్లా సమ్మె చేయించి, మనందరి పేర్లూ జోడించి పతన భజన చేశారు. ఈ అవినయానికీ, దౌర్జన్యానికీ ఏ శిక్షా లేదంటే నే నా క్లాసును ఎదుర్కోలేనని మనవి చేసుకున్నాను. తరువాతి కర్తవ్యం తమరే నిర్ణయించాలి' అన్నాడు భార్గవుడు.

'నేను వెళ్ళి వాళ్ళందరిచేతా క్షమాపణ పత్రం వ్రాయించి ఇస్తాను. మీరు క్లాసు తీసుకుంటారా?'

'అది కొంత నయం. కాని ఆ శిక్ష చాలదని నా ఉద్దేశం. అవిధేయత ఎంత ప్రబలిందో క్షమాపణ పత్రాలు వ్రాయడమూ అంత విరివి అయిపోయింది. అందులో కనీసం మానసికంగానైనా బాధ పడడం జరగడం లేదు. మీరు వెళ్ళి వాళ్ళను చీవాట్లుపెట్టి క్షమాపణ పత్రం వ్రాయించి తీసుకురండి. తర్వాత నేను వెళ్ళి నాకు తోచినచర్య తీసుకుంటాను. అధికారుల అండ ఉన్నదంటే నా శక్తి మీద నాకు విశ్వాసం ఉన్నది. నేను చెప్పిన పని వాళ్ళు చేస్తారు. నే నంటే భయభక్తులూ ఏర్పడతాయి.

నేను తీసుకునే చర్య మీరు చూడదలిస్తే నాకేమీ అభ్యంతరం లేదు.

నా హద్దు నేను మీరనని మాత్రం మీకు హామీ ఇస్తున్నాను!'

అధ్యాపకుని మనో నిశ్చయం అధ్యక్షుల కర్థమైంది.

ఏమనుకున్నారో ఏమో లేచి బయలుదేరి వెళ్ళారు. వెళ్లేముందు అధ్యాపకుణ్ని మీరు తీసుకునే చర్య ఏమిటని కుతూహలానికైనా అడగలేదు.

ఆ క్లాసు వాళ్ళందరూ ఇవాళగూడా భార్గవుడు క్లాసు తీసుకోడన్న ఊహలోనే తమ గదిదగ్గర ఉన్నారు.

అధ్యక్షులు వెళ్ళి క్రమశిక్షణనుగూర్చి గంభీరోపన్యాసం చేసి అధ్యాపకునికి క్షమాపణ పత్రం తామే వ్రాసి అందరు విద్యార్థులచేతా సంతకాలు పెట్టించారు.

ఆ కాగితం తెచ్చి భార్గవుడి కిచ్చి 'ఇక మీ రేం చేస్తారో చెయ్యండి' అన్నారు.

'చిత్త' మంటూ భార్గవుడా కాగితం పుచ్చుకుని క్లాసుకు బయలుదేరాడు.

అధ్యక్షులు వస్తున్నారేమో అని వెనక్కి తిరిగి చూచాడు గాని ఆయన రావడం లేదు. వరండాలో నిలబడిఉండి చూస్తున్నారు.

భార్గవుడు తరగతి గది గుమ్మంలో నిలబడ్డాడు.

అతన్ని చూస్తూనే విద్యార్థు లందరూ లేచి నిలబడ్డారు.

వేదికమీదికి వెళ్ళి క్లాసు కభిముఖంగా నిలబడ్డాడు భార్గవుడు.

చీమ చిటుక్కుమంటే వినిపించేంత నిశ్శబ్దంగా ఉంది.

అయిదు నిమిషాలైంది, పది నిమిషాలైంది.

అతను కూర్చోలేదు, నిలబడే ఉన్నాడు.

మానవత్వంసహజమైన నీతికి కట్టులోబడి ఆయన కూర్చోలేదు; కాబట్టి విద్యార్థులూ కూర్చోలేదు.

ఇంచుమించు గంటసేపూ అలాగే నిలబడ్డారు.

నిలబడ కేం చేస్తారు? వాళ్ళకూ పరిస్థితి అర్థమయింది. ఇన్నాళ్ళూ తమక్లాసు తీసుకొని ఈ అధ్యాపకుణ్ని అధ్యక్షులు స్వయంగా వచ్చి క్షమాపణపత్రం తమ అందరిచేతా వ్రాయించి యిచ్చి మరీ పంపించారు. అధ్యాపకుని అధికారం ఇంత స్పష్టంగా తెలుస్తూ ఉంటే కాదనడానికి వీలెక్కడున్నది ?

ఇంకో అయిదు నిమిషాల్లో పీరియడు అయిపోతుంది. అప్పుడు భార్గవుడు 'కూర్చోండి' అన్నాడు.

అంతా కూర్చున్నారు.

'నిలబడండి'

అంతా నిలబడ్డారు.

'కూర్చోండి'

అంతా కూర్చున్నారు.

'నిలబడండి'

అంతా నిలబడ్డారు.

'రామచంద్రం ! ఇటువచ్చి ఇక్కడ నిల్చో!' అని గుమ్మంవైపు చూపించాడు భార్గవుడు.

రామచంద్రుడు బిక్కుబిక్కు మంటూ చెప్పినట్లు చేశాడు.

'చేసినతప్పు దిద్దుకోవడం ఎలాగో తెలుసా ? ఎవళ్ళ చంపలు వాళ్ళు వేసుకోవాలి. వేసుకో !'

అధ్యాపకుని ఆదేశాన్ననుసరించి రామచంద్రంతోపాటు అందరూ చెంపలు వేసుకున్నారు.



భారత రాష్ట్రపతి జూలై 12 వ తేదీన తిరుపతిలో శ్రీవెంకటేశ్వర విశ్వవిద్యాలయం గ్రంథాలయానికి ప్రారంభోత్సవం చేస్తున్న దృశ్యం.



గ్రంథాలయంలో రాష్ట్రపతి



ముఖ్యమంత్రి జూలై 1 వ తేదీన స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో యూనిట్ ట్రస్ట్ పథకం క్రింద యూనిట్ల అమ్మకానికి ప్రారంభోత్సవం చేస్తున్న దృశ్యం.

జూలై 20 వ తేదీన టర్కీ ప్రభుత్వ ఇంటీరియర్ మంత్రిత్వశాఖ జనరల్ డైరెక్టర్ హైదరాబాదు సనత్‌నగర్‌లోని

సమకాలీన చిత్రకళా భవనానికి (రాష్ట్ర ప్రదర్శనశాల) జులై 10 వ తేదీన కేంద్ర ఉక్కు, గనుల శాఖామంత్రి శ్రీ ఎన్. సంజీవరెడ్డి శంకుస్థాపన చేశారు.



నాగార్జున కొండవద్ద జులై 26 వ తేదీన మధ్య తరగతి వర్గాల విశ్రాంతి గృహానికి ముఖ్యమంత్రి శంకుస్థాపన చేస్తున్న దృశ్యం.



మునిసిపల్ కార్పొరేషన్ల నాల్గవ సమావేశాన్ని జులై 31 వ తేదీన గవర్నరు ప్రారంభించారు.

STATE BANK OF INDIA

బేగంపేట విమానాశ్రయంలో జులై 31 వ తేదీన స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా కౌంటరుకు ప్రారంభోత్సవం చేస్తున్న గవర్నరు.

# జంగం కథలు

మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

ఆంధ్ర ప్రదేశంలో ఆనాటి నుండి ఈనాటి వరకు బహుళ ప్రచారం పొందిన జంగం కథలు ఈ నాడు బుర్ర కథలుగా పిలువబడుతూవున్నాయి. ఒకనాడు మత ప్రబోధానికి, దేశ భక్తికి ప్రతిబింబంగా నిలబడిన జంగం కథా కళారూపం రాను రాను యాచనకూ, వుదరపోషణకూ వుపయోగపడి తిరిగి ఈ నాడు దేశ భక్తిని ప్రబోధిస్తూ ప్రజా సమస్యలను చిత్రిస్తున్నది.

జంగం కథలను ఎక్కువ మంది జంగాలే చెప్పడం వల్ల వీటికి జంగం కథలనే పేరు వచ్చింది. ఈ కథలను సిరికి జంగాలూ, బుడిగె జంగాలూ, సెట్టి బలిజెలు, సెట్టి ఫణిజలూ, ఈతముక్కు జంగాలూ వంశ పారంపర్యంగా ప్రచారంలోకి తీసుకు వచ్చారు. జంగాలందరూ శైవ భక్తులు కావడం వల్ల శైవ వైష్ణవ మతాల మధ్య వచ్చిన సంఘర్షణ కాలంలో శైవ మత ప్రచారానికి ఈ కథలను వుపయోగించారు. వీరశైవ మతం బాగా వ్యాప్తిలోకి వచ్చే నాటికి అంటే క్రీస్తుశకం 1150 నాటికీ ఈ కథలను జంగాలు పాడుతూ వుండేవారు. వీరు ఈ కథలతో పాటు పగటి వేషాలను కూడ ప్రదర్శించేవారు. *వైచరాజు వేంకటనాథ కవి పంచతంత్రంలో, కడిపోని తెర నాటకపుటూరి జంగాలు* అని వుదహరించడాన్ని బట్టి నాటకాలను కూడ ప్రదర్శించే వారని తెలుస్తూ వుంది.

## బుడిగె జంగాలు

దాసరులందరూ వైష్ణవ భక్తులైనట్లే జంగాలందరూ శైవభక్తులు. వీరు చెప్పే కథలకు జంగం కథలని పేరు. వీ రి కే బుడిగె జంగాలనే పేరు కూడ వాడుకలో వుంది అందుకు కారణం; వారు కథలో వుపయోగించే వాయిద్యానికి బుడిగె అనే పేరునుబట్టి వీరికి బుడిగె జంగాలనే పేరు సార్థక నామ మైంది. ఈ బుడిగెనే, డక్కీ అనీ, డిక్కీ అనీ, గుమ్మెటనీ, అనేక రీతులలో ఆయా ప్రాంతాలలో వ్యవహరిస్తున్నారు. బుడిగెలు మామూలు గుమ్మెట్లకంటే చిన్నవి. ఇవి ఇత్తడితోనూ, కంచుతోనూ చేయబడి వుంటాయి.

జంగాలు ప్రారంభంలో శైవ కథలనే ప్రచారం చేసేవారు. తరువాత శైవేతర కథలైన దేశింగురాజు - విరాట పర్వం - భల్లాణ - సిరియాళ - దేవయాని - వామన విజయం- అంబరీషోపాఖ్యానం మొదలైన కథలను కూడ ప్రచారంలోకి తెచ్చారు. జంగాలు వీరశైవ ప్రచారకులవడంవల్ల వారి కథలన్నీ వీరావేశంతో చెప్పబడుతూ వుండేవి. ధేనువుకొండ వెంకయ్యగారి విరాటపర్వం జంగంకథలో జంగాలయొక్క వేషధారణ - వాయిద్యాలు - వర్ణన వుంది. *అడిదం సూరకవి జంగాల పాలు దేవాంగుల విత్తంబు* అని వర్ణించడం వల్ల దేవాంగులైన సాలెవారిని యాచిస్తారని తెలుస్తూంది.

## శారదకాండ్రు

ఆంధ్రదేశంలో ఈ శారదకాండ్ర అనే జాతివారు, ఒక్క తెలంగాణాలో తప్ప మరెక్కడా అంతగా కనిపించరనీ, జానపద గాయకులుగా భిక్షుకులుగా వుండేవారిలో కూడ వీ రెక్కువనీ, మున్నూరు, ముత్తరాసి మొదలైన తెగలకులములనుండి యుద్భవించిన జాతుల్లో, శారదకాండ్రజాతి ఒకటనీ, డా॥ బి. రామరాజుగారు (జానపద గేయసాహిత్యం (765) పేజీలో వుదహరించారు. ఓ భారతీ కరుణామతి, భళి, శారదా కరుణానిధి అనే వంతపాట పాడడం వలనకూడా వీరికి శారదకాండ్రు అనే పేరు వచ్చివుండవచ్చును. అంతేకాక వీ రుపయోగించే వాద్యంలో భుజముమీద ధరించే తంబురాకు శారద అనిపేరు. బుర్రకథలో వుపయోగించే తంబురాకు దీనికీ ఏమీ తేడా లేదు. శారదను ఒక భుజముమీద ధరించి వాయిస్తారు. శారద అంటే సరస్వతి. విద్యలతల్లి సరస్వతి పేరును వా రుపయోగించే తంబురా వాయిద్యానికి మారుపేరుగా

శారద అని నామకరణం చేశారు. వీరికథ శారదాదేవి స్తోత్రంతో ప్రారంభ మవుతుంది. ముఖ్యంగా వీరి జట్టులో పురుషుడు కథచెపితే, అతని ఇద్దరుభార్యలూ, వంతలు పాడుతారు. ఒక భార్యను కలిగివున్న కథకుడు, కథచెపితే, అతనిభార్య డక్కీకొడుతుంది. దీనిని వీరు డిమ్కి అనికూడా పిలుస్తారు. వీరు పాడే పాటల్లో శారద వరుసలనేకాక చరిత్రాత్మకమైన వీరగేయాలను వీరావేశంతో పాడుతారు. తెలంగాణాలో ప్రచారంలోవున్న ప్రసిద్ధ వీరకథలైన సదాశివరెడ్డికథ – సర్వాయిపాపడు కథలనూ, సర్కారు ఆంధ్రదేశంలో ప్రఖ్యాతి వహించిన బొబ్బిలియుద్ధం, ఫల్నాటి వీరచరిత్ర, బాలనాగమ్మ మొదలైన కథలనూ శారదాకాండ్రు చెపుతూవుంటారు. పైన ఉదాహరించిన ఒక్కొక్కకథనూ మూడు నాలుగు రాత్రులు చెపుతారు. ఈ కథలు చెప్పేవారు ఎక్కువమంది వరంగల్లు తాలూకా, వెంకట్రావులపల్లి మొదలైన చుట్టుపట్ల గ్రామాలలో వున్నారు. శారదకాండ్రు అందరూ శైవమతస్థులు. మాంసాహారులైన జంగమజాతివలన కలిగిన జాతి ఈ శారదాకాండ్రు అని కొందరి అభిప్రాయం. వీరు ఎల్లమ్మ పోచమ్మ మొదలైన ముఖ్యదేవతల్ని పూజిస్తారు. వీరు ఎంతమంది భార్యలనైనా చేసుకొనవచ్చు. వీరందరూ శైవమతస్థులైనప్పటికీ లింగధారణలో కొంతమందికి పట్టింపులేదు.

## ఉత్తమ కళారూపం

ఈ జంగం కథలను ప్రజాప్రబోధానికి ఆయుధంగా వుపయోగించారంటే అందులో ఒక విశేషం లేకపోలేదు. బుర్రకథ ఫణితులు చాల వుత్తేజకరమైనవీ, వుద్రేకమైనవీ. అన్నిరసాలనూ తేలికగా ప్రజాహృదయాల్లో చొప్పించగలశక్తి ఈజంగం కథలకుంది. వీరరసంద్వారా ప్రజలను వుద్రేకపర్చవచ్చును, కరుణ రసంద్వారా ఏడ్పించవచ్చును, హాస్యరసంద్వారా కడుపుబ్బ నవ్వించవచ్చును, శృంగార, బీభత్స రసాలకు ప్రాముఖ్యం తక్కువైనా నవరసాలూ, ఈ జంగంకథా సంవిధానంలో మిళితమైయున్నాయి. సంగీతం సాహిత్యం నృత్యం, వాద్యం, శిల్పం, తాళం, లయ, అభినయం ఆహార్యం మొదలైన హంగులన్నీ ఈ కథలో తొణికిసలాడుతూ వుంటారు. ఈ కథల్లో వుపయోగించే గుమ్మెటలు వీరణపు మ్రోతలను గుర్తుకు తెస్తాయి. జంగం కథా కళారూపంలో ప్రజలను మేల్కొల్పే మహత్తరశక్తి వుంది. ఈ నాటికీ ఈ కళారూపం విద్యాధికులనుండి. అతిసామాన్యులవరకూ ఆనందింపజేయగల వుత్తమ జానపద సంగీతకళారూపంగా తయారైంది.

జంగం కథను తెలుగు జాతియొక్క సంగీత జానపద కళారూపంగా చెప్పుకోవచ్చు. ఈ జంగం కథల్లో విద్వత్తును ప్రదర్శించే శ్లోకాలూ, దేశీయ ఛందస్సు అయిన మంజరీ ద్విపదలూ, దరువులూ, కీర్తనలూ, కందార్థాలూ మొదలైనవన్నీ ప్రవేశపెట్టబడ్డాయి. ఉదాహరణకు శ్రీనాధుడు వ్రాసిన పల్నాటి వీరచరిత్ర మంజరీ ద్విపదలో రచించిందే.

## పూర్వ కథలు

ఆంధ్రదేశపు పల్లెల్లో రైతు కూలీలకు పనిలేని తీరిక సమయాలలోనూ, దేవుని వుత్సవాలలోనూ, ముఖ్యమైన పండుగ దినాలలోనూ ఈ కథలను చెప్పిస్తుండేవారు. ఈ కథలను చెప్పే జంగాలు పగటిపూట శంఖు గంటతో ఇంటింటా వ్యాజకం చేస్తూ. ఈ రాత్రికి నడిబజారులో ఫలానా కథ జంగం కథగా చెప్పుతున్నామని, ఫలానావారు చెప్పిస్తున్నారని, ఇంటింటా ప్రచారం చేస్తూ 10 లాంతర్లను ప్రోగుచేసి తెల్లవారేవరకూ ఈ కథలను చెప్పి వేలాది ప్రజలను ఆనందింపజేసేవారు. ఆనాడు జంగం కథలకు మంచి ఆదరణ వుండేది. ఈ కథకులు ఏ మారుమూల గ్రామంలో కథచెప్పుకున్నా హాయిగా రెండుమూడు బస్తాలు ధాన్యం, డబ్బు సంపాదించుకోగలిగేవారు. ఈ వుపాధితో వారు వారి జీవితాలను సాగించేవారు. రాను రాను కుటుంబంలోని సభ్యులందరూ ఈ కథల్లో పాల్గొనేవారు పురుషుడు కథను చెప్పితే ఆయన భార్య వంత పాడేది. కొంతమంది ఇద్దరు భార్యలను చేసుకుని ఇరువుర్నీ వంతలుగా చేసుకుని జీవనభృతిని తేలికగా సంపాదించుకునేవారు. వృత్తిరీత్యా ఇరువురు భార్యలను చేసుకోవడం తప్పుగా ఎంచేవారు కారు. ఇలాంటి వీరికి ఏవిధమైన ఆశయమూ వున్నదని చెప్పలేము. ఒకనాడు ప్రబోధం కొరకు ఏర్పాటైన జంగంకథాకళారూపం పారంపర్యంగా జీవనోపాధికీ అంకితమైంది. ఈ కథలను ముగ్గురు స్త్రీలు కలిసి చెప్పడంకూడ పరిపాటైంది. మూడు స్త్రీకంఠాలూ కలిసి ఏ బాలనాగమ్మ కథనో చెపుతూవుంటే పల్లెల్లో కథలు వినే అమ్మలక్కలు, కథలో వచ్చే హృదయ విదారక దృశ్యాలకు కండ్లవెంట నీరు కార్చేవారు. స్త్రీగొంతులతో చెప్పబడే ఈ కథలు అతి శ్రావ్యంగా వుండేవి.

## ప్రదర్శనం - పరికరాలు

వీరి ప్రదర్శనాలకు రంగస్థల మంటూ ఏమీలేదు. విశాలమైన వీధిలో ఒక పందిరి వేసి చుట్టూ కిరసనాయిలు లాంతర్లు వ్రేలాడకట్టేవారు. ఈ లాంతర్లు లేని రోజుల్లో ఆముదపు దీపాలనూ, నూనె కాగడాలనూ, లేదా ఇలాయి కజ్జలనూ వెలిగించేవారు. ఈనాడు పెట్రోమాక్సు లైట్లను వాడుతున్నారు. ముగ్గురు వ్యక్తులుండి, రెండు

పెట్రోమాక్సు లైట్లుంటే అతి తేలికగా జంగంకథా కార్యక్రమం జరిగిపోతుంది. కథకునికి ఒక తంబురా, మూడు అందెలు. రెండు కాళ్ళకు గజ్జెలూ. వంతకు రెండు గుమ్మెట్లు. ముగ్గురికీ మూడు గొన్లూ మూడు తలగుడ్డలూ వుంటే కథ జరిగిపోతుంది. ఒక్కసారి ఈ సామగ్రిని ఏర్పాటు చేసుకో గలిగితే రోజువారీగా కావలసిన సామగ్రి ఏమి వుండదు. ముగ్గురు వ్యక్తులూ వేలాది ప్రజలకు తెల్లవార్లూ కథ వినిపించి కూర్చో బెట్టగలరు. వీరి బృందం ఒక గ్రామంనుంచి మరో గ్రామం వెళ్ళాలంటే ఎవరిసామాను వారు భుజాలకు తగిలించుకుని సునాయా సంగా ప్రయాణం చేస్తారు.

## కథా విధానం

జంగం కథల్లో కథకుడు తంబురాను ధరించి శృతిని మీటుకుంటూ చేతి అందె లతో తాళం వేస్తూ కాళ్ళతో నృత్యం చేస్తూ కథను ప్రారంభిస్తాడు. ప్రక్కనున్న వంత దారులు రెండు గుమ్మెటలను భుజాలకు తగిలించుకుని దద్దోతిమి - తధిమితత్తధిమి - తకిట తతధిమి - ధిందాతద్దిందా - తకతక్క తకతక్కా — అనే దరువు వేస్తూ తధిగిణతోం అంటూ మధ్య మధ్య గమకాల నిస్తూ కథా సన్నివేశాల ననుసరించి, మధ్య మధ్య అరరె, అరరె, భళి, భళీ అంటూ కథకునికి హుషారు నిస్తూ, వుధృతంగా నృత్యం చేస్తూ ప్రజల కందుబాటులో అన్ని ప్రక్కలకూ తిరు గుతూవుంటాడు. కథకుని లయ ప్రకారం వంతలు గమకంగా వాయిస్తారు. కథకుడు చక్కగా చరణం పాడితే దానిని వంతదార్లు తిరిగి వంత పాడుతారు. కథకుడు కథను వివరిస్తే ఆ కథను ప్రజలకు అర్ధమయ్యే భాషలో ఒక వంతదారు విపులంగా వివరిస్తే మరో వంతదారు, (ఇతడు హాస్యగాడు) ప్రేక్షకులకు వచ్చే అనుమానాలను హాస్య ధోరణిలో కథకుని ప్రశ్నించి, సున్నిత హాస్యంతో ప్రజలను ముగ్ధుల్ని చేసి కథను ముందుకు నడిపేవారు. ఈ హాస్యంవల్ల పరాకుగావున్న ప్రేక్షకులందరీని ఒక హద్దులో వుంచి కథను వినేటట్లు అభిలా షను కలిగించేవారు. కథకునికీ వంతలకూ మధ్యనున్న అవినాభావ సంబంధం ఇంతా అంతా అని చెప్పలేం. కథా గమనంలో ఆయా ఘట్టాలలో ఎక్కడా వీసమంత వెలితి రానీయరు. కావాలనుకున్నప్పుడు ప్రేక్షకులను నవ్వించగలరు, ఏడ్పించగలరు, వుద్రేకపరచగలరు. కథనువిన్న ఆ కొంచెం సేపూ ప్రేక్షకులను ఒడలు మరచేటట్లు చేయగలరు. వంతలు కథను ఆలాపిస్తుంటే కథకుడు చేతిలోవున్న అందెలతో బాటు ఒక అందమైన చేతిగుడ్డను వూపుకుంటూ రెండవ చేతితో తంబురాను మీటుతూ కాళ్ళ గజ్జెలు ఘల్లు మనేటట్లు, నృత్యం చేస్తూ అటూ ఇటూ చేతులు వూపుకుంటూ, సాత్విక ఆంగిక చలనాదులతో రంగస్థలియంతా కలియ దిరుగుతూ, యుద్ధ ఘట్టాలలోనూ, రౌద్ర ఘట్టాలలోనూ, పిడుగులు బడ్డట్లు ఎగిరి ఎగిరి గంతులు వేస్తూ, గిఱు గిఱ్ఱున గిరకాలు కొడుతూ, పళ్ళు పట పట కొరుకుతూ, అరరే అరరే అంటూ వంతలను కేకలతో అదలిస్తూ హంగామా చేసి ప్రేక్ష కులను నివ్వెర పోయేటట్లు జేసేవారు. పైన వివరించిన ప్రదర్శనా విధానాన్ని బట్టి జంగం కథ కళారూపం ఎంత పదునైనదో మనకు బోధ పడుతూ వుంది. ముగ్గురు వ్యక్తులతో కూడిన ఈ కళారూపం యొక్క ప్రాముఖ్యం అనిర్వాచ్యమైంది. ఇది ఇంతటి వుత్తమ కళాయుధం గనుకనే చరిత్రాత్మకంగా ఆంధ్ర ప్రజా హృదయా లలో హత్తుకుపోయింది.

## బుర్రకథ అంటే ?

ప్రజాహృదయాలను ఇంతగా చూర గొన్న ఈ జంగంకథల యొక్క పూర్వ చరిత్ర మనకు సరిగా తెలియడంలేదు. యక్షగానం, వీధినాటకం, తోలుబొమ్మలాట లాగా తెలిసి నట్లు ఈ జంగంకథలయొక్క పరిణామం తెలియడంలేదు. జంగంకథగా వర్ధిల్లిన ఈ కళారూపం నేడు బుర్రకథనీ తాంబురాకథనీ తంధాన కథనీ గుమ్మెట్లకథనీ, అనేక ప్రాంతీయమైన భేదాలతో పిలువబడుతూ వుంది. కృష్ణా గుంటూరు జిల్లాలలో ఈ నాడు. జంగంకథలంటే చాలమందికి తెలి యదు. బుర్రకథ అనేపేరు అబాల గోపా లానికీ తెలుసు. అలాగే రాయలసీమ జిల్లా లలో బుర్రకథంటే ఎవరికీ తెలియదు. అక్కడ తంధాన కథలనే వ్యవహరిస్తు న్నారు. ఈ విధంగా జంగంకథ ప్రాంతీయ మైన భేదాలతో వివిధనామాలతో పిలువ బడుతూవుంది. ఈ కథకు ఇన్ని పేరులు రావడానికి కారణంకూడా లేకపోలేదు.

ఈ కథల్లో ప్రధానకథకుడు తంబురాను వుపయోగిస్తున్నాడు. ఆ తంబురాకు వుపయో గించే బుర్రనుబట్టి దీనికి తంబురాకథనీ, బుర్రకథనీ పేరు వచ్చివుండవచ్చు. ఈ కథలో వుపయోగించే గుమ్మెట్లను, డక్కీ లనీ బుర్రలనీ వ్యవహరించడంవల్ల ఈ కథ లకు డక్కీకథలనీ, బుర్రకథలనీ పేరు సార్థకమై యుండవచ్చునని కొందరి అభి ప్రాయం.

అలాగే ఈ కథలకు తంధాన కథలనీ తంధాన పాటలనీకూడ ప్రచార ముంది. ముఖ్యంగా బుర్రకథలో గుమ్మెట్లువాయిస్తూ వంతలు పాడేవారు. తంధానా — తాని తంధానా — అనే వంతపాట పాడటంవల్ల కూడ ఈ కథలకు తంధానకథలని పేరు వచ్చివుండవచ్చు. తంధానకథలు ప్రాచీన

కాలంనుండీ వున్నవనడానికి వుదాహరణగా క్రీడాభిరామంలో

పద్యం :

అకలంక స్థితిగోరి కొల్చెదరు
బ్రహ్మానంద సంభావనన్
సకలానంద మయైక మాతలగుచున్
సంతోష చిత్తంబునన్
తకదుమ్మల్ దుకతాళముల్ జవనికల్
తందాన లమ్మయ్యకున్
ఎకవీరమ్మకు మాహురమ్మకు నధో
హ్రీంకార మధ్యాత్మకున్.

అని క్రీడాభిరామ కర్త పేర్కొనడాన్ని బట్టి కాకతీయ యుగం నాటికే ఈ జంగం కథలు బహుళ ప్రచారంలో వున్నాయని వుదాహరణను బట్టి తెలుస్తుంది. *దుకతాళముల్ జవనికల్ తందానలమ్మయ్యకున్* అనడం వల్ల ఆనాటి జంగం కథల్లో జవనిక వాద్యంకూడ వుపయోగించినట్లు వూహించ వచ్చు. తంధాన అనే వంతపదం ఆనాడు పాడబడే ప్రతి కథలోనూ వంతగా పాడి వుండవచ్చును.

ఆంధ్ర ప్రజాజీవితంలో ఇంతటి విశిష్ట స్థానాన్ని సంపాదించుకున్న ఈ బుర్రకథను గూర్చి పాల్కురికీ సోమనాథుడు బసవ పురాణంలోగాని పండితారాధ్య చరిత్రలోకాని తొలి వీధినాటకం క్రీడాభిరామంలో కాని ఎవ్వరూ దీనిని పేరుపెట్టి స్పష్టంగా పేర్కొనకపోవడం చూడగా ద్విపద భూయిష్ఠమైన ఈ రచనకు ప్రక్కవాద్యాల ప్రాబల్యాన్ని బట్టి క్రమేపీ ఈ పేరు రూఢమై యుండ వచ్చును. ప్రాచీన కళారూపాలైన యక్షగానం, వీధినాటకం, పూర్వరూపం బుర్రకథ కావచ్చునని శ్రీనాథుని కాలానికిముందు నుంచే ద్విపద ప్రబంధం బుర్రకథ వంటిది గానరూపంలో వుందనడానికి క్రీడాభిరామం లోని ఈ క్రిందిపద్యమే తార్కాణ మని *తిరుమల రామచంద్ర*గారు *జయంతిపత్రి*కలో 'తెలుగువారి *తొలి సంగీతకళా రూపం*' అనే వ్యాసంలో పలనాటివీరచరిత్రకు సంబంధించిన ఈ పద్యాన్ని వుదహరించారు.

పద్యం :

ద్రుత తాళంబున *వీరగుంభిత*
ధుధుం ధు ధుంకిటాత్కార సం
గతీ వాయింపుచు నాంతరాళిక
లయ గ్రామాభిరామంబుగా
యతిగూడం ద్విపదప్రబంధమున
వీరనీకముం బాడె నా
క్కృత ప్రత్యక్షరముం గుమారకులు
ఫీట్కారంబునం దూలగన్

అని 14 వ శతాబ్దములో రచయింప బడిన క్రీడాభిరామ కాలానికే బుర్రకథ కళారూపం ప్రచారంలో వుందనడానికి ఈ పద్యంలో వుదాహరించిన ఇతివృత్తమే నిదర్శనం. దీని ఇతివృత్తం వీరచరిత్రకు సంబంధించింది. పాడింది ద్విపదకావ్యం, వీరగుంభితను వాయించింది ఒక స్త్రీపైన వుదహరించిన వీరగుంభిత నేటి గుమ్మెటని పండితుల అభిప్రాయం. గుమ్మెట్లవాద్యం గంభీరంగానూ, గుంబనగా వుండే ధ్వని విశేషం అవడంవల్ల దీనికి గుంభిత అనే పేరు వచ్చివుండవచ్చును. ఈ గుంభితను ఆనాడు స్త్రీలు వాయించినట్లే ఈ నాటి కథల్లో స్త్రీలూ, పురుషులూ కూడా వాయిస్తున్నారు. ఈ దక్కీలు పూర్వంనుంచీ వున్నవనడానికి *కాశీఖండం* 165 పేజీ 56 వ పద్యంలో శ్రీనాధుడు.

పద్యం :

వల్లకి చక్కి కాహళము వంశము
*ఢక్కహుడుక్క*ఝుర్ఝరుల్
ఝల్లరి యాదిగా గలుగుశబ్ద
పరంపరతాళ శబ్దమై —

అని వుదహరించడాన్ని బట్టి ఢక్క హుడుక్క అనేదానినిబట్టి కాహళము మొదలైన వివిధ వాద్యాలతోపాటు ఢక్క అనే నేటి ఢక్కీనీ బుడబుక్కలవా రుపయోగించే హుడుక్కను కూడ వుపయోగించి వుండ వచ్చును. అలాగే *పండితారాధ్యచరిత్ర*లో.

అలరుచు బసిహారులట్ల యందురును
లలినుచ్చి *చాంగు భళా*యనువారు.

అనే దానిని బట్టి నేటి వంతలు పాడే భళానోయి భాయి తమ్ముడూ, మేల్ భళా నోయి దాదానా అనే దానికి *దగ్గర*గా వుండడాన్నిబట్టి తంధానా, తాని తంధనా, భళా భళీ మొదలైన వంత విశేషాలు, ఆనాటి నుంచీ ప్రచారంలో వున్నట్లు మనం తెలుసుకోవచ్చు.

బుర్రకథ గానవిశేషంగా రూపొందిందనడానికి పై ఉదాహరణలే గాక, *క్రీడాభిరామం*లో

పద్యము :

రాగముల నుండి లంఘించి రాగమునకు
నురుయ నూరు దయ్యంబు పైనొత్తిగిల్ల
కాయవల్లీ మహాలక్ష్మి కైటభారి
వలపు బాడుచువచ్చె జక్కుల పురంధ్రి.

జక్కుల పురంధ్రి వలపుబాడుచు వచ్చె అనే దానిని బట్టి గాన విశేషంగా రుజువౌతోంది.

అలాగే *బసవ పురాణం*లో సోమనాధుడు శ్రీయాళ చరితను గురించి.

కరమర్థి నూరూర శిరియాలు చరిత
పాటలుగా గట్టి పాడెదువారు.

అనడాన్ని బట్టీ,

శ్రీనాధుడు *కాశీఖండం*లో *దక్షవాటి* పురమును వర్ణిస్తూ.

కీర్తింతు రెద్దాన్ని కీర్తి గంధర్వులు
గాంధర్వమున యక్షగాన సరణి.

అనడాన్ని బట్టి గంధర్వగానాన్ని యక్షగాన సరణిలో పాడి వినిపించేవారని అర్థ

మౌతోంది. పై వుదాహరణలను బట్టి ఒకే నటి వివిధ వాద్య విశేషాలతో వివిధ పాత్రల్ని అభినయించేదని తెలుస్తూంది.

ఈ జాతికి చెందిన కథలను స్త్రీలే కాక పురుషులు కూడ పాడి వినిపించినట్లు *క్రీడాభిరామం*లో పద్యం 130

వాద్యవైఖరి కడు నెరవాది యనగ
ఏకవీరా మహాదేవి ఎదుట నిల్చి
పరశురాముని కథలెల్ల ప్రౌఢిపాడె
చారుతర కీర్తి బవనీల చక్రవర్తి.

వివిధ వాద్యాలతో పరశురాముని కథలు బవనివారు పాడి వినిపించినట్లుగా వుంది. జవనికలు, డక్కీలు మొదలైన వాద్య వైఖరులన్నీ చేరి వుండవచ్చును. ఇందుకు మరో వుదాహరణగా *పండితారాధ్య చరిత్ర*లో.

అదట గంధర్వ యక్ష విద్యాధి
రాదులై పాడెదు నాడెడువారు.

పై వర్ణనలను బట్టి నటి నాట్యానికి అనుకూలమైన దుస్తులు ధరించి యక్షిణి లాగా తంబురా లాంటి జంత్ర వాయిద్యాన్ని వాయిస్తూ, పాడుతూ, ఆడుతూ, కథ వినిపించేదని తెలుస్తూవుంది.

ఈ మాదిరి కథ వినిపించింది. జక్కుల పురంధ్రి అని విదితమౌతోంది. దీనిని బట్టి మూల యక్షగానం, సంగీత నృత్య సహాయంతో కథ వినిపించే కళారూపమని స్పష్టమౌతోంది.

ధర్మాంగద చరిత్ర – చిత్రాంగద విలాసం మొదలైన యక్షగానాలు, 'వేషముల్ గట్టి జనులు పాడి వినిపింప' అనడాన్ని బట్టి, 'వలపు బాడుచు వచ్చె జక్కుల పురంధ్రి' అనే దానిని బట్టి గోవింద దీక్షితుడు సంగీత సుధ అనే లక్షణ గ్రంథంలో యక్షగానం యక్షులచేత పాడబడే ఒక సంగీత విశేషమని వుదహరించడాన్ని బట్టి పాడి వినిపించడానికే వుపయోగపడ్డాయని ఒర మౌతూంది. అతి ప్రాచీన యక్షగానాన్నలై ఓబయ మంత్రి గరుడాచల యక్షగానమూ, కందుకూరి రుద్రయ్యచే రచించిన సుగ్రీవ విజయమూ పాడి వినిపించినవేగాని యక్షగానాలుగా ప్రదర్శింపబడినవి కావు. కేవలం ఒకే నటి వివిధ పాత్రల్ని అభినయించేదని ఉదాహరణలను బట్టి తెలుస్తూంది.

అంతేగాక 15 వ శతాబ్దం ప్రారంభంలో శ్రీనాథకవి యక్షగానాలను గుంచి పొగిడాడు. భీమేశ్వరపురాణంలో ఒక వేశ్య వేషంధరించి ద్రాక్షారామ వీథుల్లో భిక్షాటన చేసినట్లు వర్ణించాడు.

పద్యం :

సాని ఈసానియై మహోత్సవము నందు
గేల నవచంద్రకాంతంపు గిన్నె పూని
వీధి భిక్షాటన మొనర్చువేళ జేయు
మరులునృత్యంబు జగముల మరులుగొలుపు

దీనినిబట్టి ఒకే నటి వీథుల్లో నృత్యం చేసినట్లుంది. ఇదేజాతికి చెందిన కథలను గురించి 16 వ శతాబ్దానికి చెందిన చంద్రశేఖరుడు తన చంద్రశేఖర శతకంలో

పద్యం :

ఇంటిని తిమ్మరాజు కత ఇంటిని ఈర్ల
కథా ప్రసంగముల్
ఇంటిని పాదులాలి ఇబమింటిని
నాయకురాలి శౌర్యమె
ప్పంటికి నందివాక్కుల పొందు
చరిత్రల నాడు భాగ్య
మెన్నంటికి గల్గనోయను నవజ్ఞుడు.
మూర్ఖుడు చంద్రశేఖరా.

ఈ పద్యంలో వుదహరించి ఈర్లకథలే పలనాటి వీరులచరిత్ర. దీనిని శ్రీనాథుడు ద్విపద కావ్యంగా రచించినట్లు పైనే తెలుసుకున్నాం. దీనిని పిచ్చుకుంటలవారు కథగా చెపుతారు. దీనిని బుర్రకథగా కూడ చెప్పి వుండవచ్చు. తిమ్మరాజు కథ అనే బంగారు తిమ్మరాజుబుర్రకథ నేటికీప్రచారంలోవుంది.

అయ్యగారి వీరకవి రచించిన *చిత్రాంగద విలాసమనే* యక్షగానంలో.

చిత్రాంగదవిలాసమనగయక్షగానమొనరింతు
వేషముల్ గట్టి జనులు పాడివినిపింప.

పేర్కొనడాన్నిబట్టి యక్షగానరూపంలో వున్న వీథి నాటకమని బోధపడుతూవుంది. పైఉదాహరణలనుబట్టి యక్షగానాలు, వీథి నాటకాలు, బుర్రకథలు మొదలైనవన్నీ దేశి సారస్వతానికి చెందిన సంగీత రూపకాలుగా పరిణామం చెందుతూ, దేనికి దానికే ఒక ప్రత్యేకమైన రూపాన్ని సంతరించుకుని వివిధ కళారూపాలుగా వృద్ధిచెంది వుండవచ్చును. ఇలా గానరూపంగా అభివృద్ధి పొందుతూ వచ్చిన యక్షగానంలో సూత్రధారుడు ప్రవేశించి నటియొక్క పాటకు వంతపాడుతూ కథాగమనంలో వచ్చే చిల్లర పాత్రలకు వాచికం చెప్పుతూ వుండేవాడు, నటి వివిధ పాత్రల్ని అభినయిస్తూ కథ వినిపించేది. ఈ విధానమే భామాకలాపం, గొల్ల కలాపంగా రూపొంది వుండవచ్చు. సూత్రధారుడు విదూషికుడుగా మారివుండవచ్చు.

తరువాత యక్షగానంలో వచ్చిన మార్పుల ననుసరించి మరో దశనందుకుంది. ఒకే నటి వివిధ రకాల పాత్రల్ని అభినయించడమే కాకుండా విడి విడిగా ఒక్కొక్కరూ, ఒక్కొక్క పాత్రను అభినయించే సాంప్రదాయం ఏర్పడింది. తంజావూరు యక్షగానాల్లోనూ, యాదవదాసు గరుడాచల యక్షగానంలోనూ పాత్రల ప్రవేశం ప్రవేశ పెట్టబడి వుంది. అంటే ప్రవేశించే ప్రతిపాత్ర తన వూరు పేరు తెలుపుతూ, 'వెడలె సత్యభామ, అని స్త్రీ పాత్రలూ. 'వెడలె యమధర్మ రాజు' అని పురుష పాత్రలూ ప్రవేశించేవన్న మాట.

ఈ దశలో పరిణామం చెందియన క్షగానాలను యక్షగాన నాటకాలని వీధి నాటకాలని పిలిచారు.

ఈ విధంగా యక్షగానాలు రచనలో ప్రదర్శనలో అభివృద్ధి చెందుతున్నా మూల యక్షగాన మైన సంగీతరూపం బుర్రకథ గాను, హరికథ గానూ రూపొందింది. ఇందుకు వుదాహరణ హరికథా పితామహుడైన అజ్జాడ ఆదిభట్ల నారాయణ దాసుగారు తమ హరికథల నన్నిటినీ యక్షగానాలనే వ్యవహరించారు.

యక్షగానాలను వినిపించేది యక్షులైన జక్కులవారైతే బుర్ర కథ వినిపించేది జంగాలు.

మూల యక్షగానంలో స్త్రీలు కథను వినిపిస్తే బుర్ర కథలో పురుషులు వినిపిస్తారు.

యక్షగానంలో సూత్రధారుడూ, విదూషకుడూ వున్నట్లే బుర్ర కథలో వంతదారులు ప్రవేశించారు.

యక్షగానంలో విదూషకుడు హాస్యం చెపితే బుర్ర కథలో వంతదారు హాస్యం చెబుతాడు.

ఆ నాటి నుండి ఈ నాటి వరకూ కొన్ని బుర్రకథలను స్త్రీలు కూడ కథలను చెప్పడం వల్ల ప్రేక్షకులను ఎక్కువగా ఆకర్షించగలిగేవారు.

ఈ విధంగా పరిశీలన చేసేటట్లయితే మూల యక్షగానం రూపాంతరంపొంది బుర్రకథగా పరిణామం చెందిందని శ్రీనివాసచక్రవర్తిగారు నాజరు సన్మానసంచిక 34-35 పేజీలలో వుదాహరించారు.



# కమ్యూనిటీ రేడియో సెట్లు

1964 మే నెలలో రాష్ట్రంలోని దిగువ పేర్కొన్న గ్రామాలలోనూ, సంస్థలలోనూ కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పారు:

హైద్రాబాదు జిల్లా: మాధవాపురం, చౌదరపల్లి, లోయలపల్లి, మసాన్‌పల్లి.

మెదక్ జిల్లా: ధర్మాజీపేట, గుంజార్ పల్లి.

వరంగల్ జిల్లా: నెల్లికుదురు, మదనపల్లి, అబ్బాపూర్, ఓబులకేశవాపూర్, గూడరేవుల.

పశ్చిమ గోదావరి జిల్లా: రేలంగిలోని జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాల.

శ్రీకాకుళం జిల్లా: చినమెరంగి లోని జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాల.

నెల్లూరు జిల్లా: అన్నంబాక, ఉనుగుంట పాలెం, వెంబలూరు, వెంకటేశ్వర (ఎం.ఎం), బొమ్మిరెడ్డిపల్లి, నందవనం, చౌదేపల్లి, ముత్యాలపాడు (హెచ్. డబ్ల్యు), గండ్లపాలెం, చిన్నకండ్లగుంట.

చిత్తూరు జిల్లా: పడిరి, కీలపూడి, షమ్మర్‌బహదూర్ పేట, క్రిష్ణజిమ్మాపురం, నరిగపల్లి, చెరుకువారిపల్లి, తాటిగుంట పాలెం, పైపాలెం పెద్దబంగారునాధం, రాజగోపాలపురం, దొమ్మండ్లపల్లిలోని వయోజన పాఠశాల.

అనంతపురం జిల్లా: రావులుదికి.

కడప జిల్లా: అనంతయ్యగారిపల్లి, బ్రాహ్మణపల్లి, కూచువారిపల్లి, గాడెల, మంగపేట, నాగవరంలోని మహిళామండలి, ఓబనపల్లి మహిళామండలి, పట్టణవారిపల్లి, పెనగలూరు, ఎల్లారెడ్డిపల్లి, వలసపల్లి, సున్నప్పారపల్లి, వరికుంట, చెంపర్ల, మదపూరు, గుండ్లపల్లి, రెడ్డివారిపల్లి, పందిల్లపల్లి, వనిగిమళ్ళ.

కర్నూలు జిల్లా: నర్సపల్లి, బి. ఉప్పలు, బి. తాడిపత్రి, భూపనపాడు.

మహబూబ్‌నగర్ జిల్లా: మన్ననూరు, గోపాలపురం (లక్ష్మిపల్లి శివారు), తీగలపల్లి, చినమరూరు (వెల్టూరు శివారు), పాలకొండ.

నల్గొండజిల్లా: మంద్ర, గండ్లపల్లి.



# వరిసముత్యాలు

వాచకత్వము లేఖనోచితత్వము నాంధ్ర
లిపిరీతిగా సర్వలిపులయందు
ఫణితి జాతియుఁ దీవ్రిభంగియును దెనుంగు
బాసపోలిక సర్వభాషలందు
వదనవికాసంబు మృదువాక్యతయు బంధు
జనులయట్లు సర్వ జనులయందు
మర్మజ్ఞతయుఁ బ్రౌఢమతియును గణకత్వ
విద్యయట్లనే సర్వవిద్యలందు
మన్ననయును నిర్వంచనమతియు మిత్ర
గణములట్లను సర్వార్థిగణములందు
ననుట సహజంబు లివియు వర్ణనలుగావు
గుండనామాత్యునకు మంత్రి కుంజరునకు.

చతురప్రజ్ఞుఁడు చంద్రగుప్తున కిలం జాణక్యు భంగిం దివ
స్పతికిం దైవతమంత్రి యోజసుమనశ్లాఘ్యుండు వత్సావనీ
పతికిం దొంటి యుగంధరాఖ్యగతి శుంభత్పుణ్యుఁ డమ్మేదినీ
పతికిం బ్రెగ్గడ భాగురాయణుఁ డనం బ్రఖ్యాతుఁ డిద్ధస్థితిన్.

అరయం దుష్టజనుల్ స్వదుశ్చరణ జాత్యంధుల్ నిజాచారధీ
గరిమాతిస్తుతిమంతు లాత్మఘనరక్షా జాగరూకాత్మకుల్
పరదోషేక్షణ దివ్యచక్షు లితర ప్రజ్ఞా ప్రశంసానిరం
తర మౌనివ్రతు లన్యవిత్త హరణధ్యానక్రియానైపుణుల్.

బలవద్దైన్యము వక్త్రగహ్వరముగాఁ బలోపేట్లఁ గొన్నట్టియ
ప్పులు మైదాలులుగాఁగ బాలరుదితంబు ల్మోగుటల్గాఁగదు
ర్నిలయారణ్యములోభయప్రకరమూర్తిక్రూరమైయుండగా
దలమే వెల్వడఁజేయ లావుకలిమిన్ దారిద్ర్యశార్దూలమున్.

అస్మదిరాజీ రూపవిభవాతిశయంబులు దృష్టి సోకినన్
సోమునినైన వేఱయొక సోముడు నామనినైన వేఱయొ
క్కామని కమ్మదెమ్మెరనైనను వేరొక కమ్మతెమ్మెరల్
కామునినైనవేఱయొక కాముఁడు నేచుదురేమిసెప్పుదున్.

*మంచన—కేయూరబాహు చరిత్ర*

చాపముగా నహార్యమును జక్రిని బాణముగాఁగ నారిగాఁ
బాపదొరం బొనర్చి తలపం ద్రిపురంబులఁ గాల్చనే మహో
ద్దీపిత తీవ్రకోపమున దేవత లెల్ల నుతింప నాఁటివి
ల్పాపపు డిల్లిమీఁదఁ దెగఁబాపఁగదే శరభాంకలింగమా.

*—శరభాంకుని చాటువు*

కలలకుఁ జింత యేల తన కడ్డమువచ్చిన పిల్లికోసమై
యలమట యేల తుమ్మెనని యాపద యేల యనేక కీడులే
దొలఁగక కంటిమంచు మది దోఁచక నిల్చి కృశింప నేల పో
తెలియఁగలేరు మానవుల తిక్కకు వేఱొకమందు గల్గునా.
మెలఁగక వ్రాయు బ్రహ్మలిపిమిథ్యయె యో శరభాంక
లింగమా.

వగచెడి దేహికైన పరవాసికినైనను సర్థికైననుం
దగిన ధనంబునైన నది దప్పిన నించుక నన్నమైననుం
దెగువను దక్రమైన మఱి దీనతఁ గల్గిన నంబలైన నొ
మ్మగు దయ నివ్వలేని నరమాత్రులు చచ్చిన నున్ననొక్కచే
తగనిహతాంగజాత భవదండన యోశర భాంకలింగమా.

కోరినరావు సంపదలు కోరకయుండిన మాన వాపదల్
కోరిన కోరకున్న ననుకూలములై తన పూర్వకర్మచే
సారెకు వచ్చుఁ బోవు ననిశంబును మీ పదభక్తి యుక్తినేఁ
గోరుదుగాని యన్యములు గోరనయా శరభాంక లింగమా.

వాడకు వాడగాదు త్రిదివంబున కేఁగెద మంచు కొంద ఱ
ల్లాడుదు రేమిచిత్రమొ వియచ్చరులో శివమంత్ర సిద్ధులో
కూడలి సంగమేశ్వరునిఁ గొల్చిన భక్తుని బంటుబంటులో
నేడకు నేడ సుద్దు లివి యెక్కడయా శరభాంకలింగమా.

*—శరభాంక లింగ శతకం*

భారతదేశంలో అత్యధికంగా
అమ్మకం జరుగుతున్న సిగరెట్లు
ఆంధ్రప్రదేశ్ లో ఉత్పత్తి అవుతున్నది



# తెలంగాణాలో సాహితీ సేవ

— గడియారం రామకృష్ణశర్మ

నిరంకుశ పాలనము సాగుచున్న కాలమది. భారత దేశములోని తక్కిన ప్రాంతాలలో తలయెత్తికొనసాగుచున్న ఉద్యమాల ప్రభావము తెలంగాణము మీదనూ పడినది. తమ వ్యక్తిత్వమును సంస్కృతిని విస్మరింపకుండ నిలబెట్టుకొనవలెనను తీవ్రవాంఛ ఇచటి తెలుగువారికి కల్గివేరూనినది, దాని ఫలితమే 'ఆంధ్ర జన సంఘము', 'ఆంధ్ర మహాసభ'ల ప్రారంభము. ప్రత్యక్షముగా రాజకీయములలో పాల్గొనుటకు ఏమాత్రము వీలులేని నిర్బంధాలలో గ్రంథాలయోద్యమము ఊతయైనది. రాను రాను పరస్థితులు మారుచుండుటతో 'ఆంధ్ర మహాసభ' భాషా సంస్కృతుల ప్రచారమునకంటే రాజకీయములకే ప్రాధాన్యమొసగవలసివచ్చినందున ఆంధ్రభాషా సంస్కృతుల ప్రచారమునకే ప్రత్యేకముగా ఒక వేదిక అవసరమయ్యెను. ఆ సుయోగము తెలంగాణమునకు 1943 లో ఘటించినది.

హైదరాబాదు నగరమున 1943 మే 26 తేదీనాడు, శ్రీ లోకనంది శంకర నారాయణరావు గారి అధ్యక్షతలో జరిగిన సమావేశ ఫలితముగా "నిజాం రాష్ట్ర ఆంధ్ర సారస్వత పరిషత్తు" అవతరించెను. 'ఆంధ్ర సారస్వత సంస్కృతుల అభివృద్ధి, అతురాస్యతా వ్యాప్తి' అను ముఖ్యాదర్శములతో అవతరించిన ఈ సంస్థను ఆంధ్ర పితామహ శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారి వంటి పెద్దలు అభిమానించి ఆశీర్వదించినారు.

తన ఆదర్శములను సాధించుటకు పరిషత్తు ఒక ప్రణాళికను సిద్ధము చేసికొనెను.

(1) సభలు-సమావేశములు జరుపుట, (2) దేశమందలి సారస్వతమును, తత్సంబంధమైన విశేషములను సేకరించి ప్రకటించుట, (3) పారిభాషిక-మాండలిక కోశములను సిద్ధపరచుట, (4) ఇతర సారస్వత సంస్థలతో కలసి కృషి సాగించుట, (5) తెలుగులో సారస్వత పరీక్షలు జరుపుట, (6) రచయితలను ప్రోత్సహించుట, (7) అనుబంధ శాఖలను స్థాపించుట అనునవి ప్రణాళికాంశములు.

పరిషత్తు సువ్యవస్థిత సంస్థగామారి, ఈ ప్రణాళికను కార్యరూపము నందించెను. తెలంగాణమునందలి అన్ని జిల్లాలలో పరిషత్తుశాఖ లేర్పడెను. ప్రాథమిక, మాధ్యమిక, ప్రవేశ పరీక్షలు సంవత్సరమునకు రెండుసార్లు నిర్వహింపబడి ఆంధ్ర మహాకవుల జయంతులు అన్ని శాఖలచే జయప్రదముగ జరిపించబడెను ఉన్నతస్థాయిలో వార్షికోత్సవములు జరిగెను. పోలీసుచర్యవరకు పరిషత్తు వార్షికోత్సవములు హైదరాబాదు, వరంగల్లు, నల్లగొండ, మహబూబ్ నగరములలోను తరువాత తూపురాన్, మంచిర్యాల, అలంపురములలో ఏడుసార్లు జరుపబడినవి.

వార్షికోత్సవములు :

ఈ పరిషత్తు వార్షికోత్సవాలను గూర్చి కొంత చెప్పవలసి యున్నది. ఇవి సాధారణ పద్ధతిలోగాక ఓరియంటల్ కాన్ఫరెన్సు వలెనే వివిధ సారస్వత శాఖా సమావేశములతో జరుపబడును. అందు చారిత్రకశాఖ, సాహిత్యశాఖ, బాల సాహిత్యశాఖ, సంస్కృతశాఖ. పత్రికా రచనాశాఖ, మొదలైన శాఖల సమావేశములు జరుపబడి ఆయా శాఖలలో ప్రత్యేక కృషిసల్పిన పండితులచే ఉపన్యాసము లిప్పించబడును. కవి సమ్మేళనము జరుగును. సభావరణములో ఏర్పరిచిన ప్రత్యేక స్థలములందు పుస్తక ప్రదర్శనము, పత్రికా ప్రదర్శనము, చిత్రకళా ప్రదర్శనము, పురావస్తు ప్రదర్శనము, వ్యవసాయ ప్రదర్శనము, ఆరోగ్య ప్రదర్శనము, కుటీర పరిశ్రమల ప్రదర్శనములు నిర్వహింపబడును. తోలుబొమ్మలాటలు, బుర్రకథలు ఏర్పాటు చేయబడును. ఈ విధమైన కార్యక్రమాలతో మూడు దినములు రాత్రింబవళ్ళు సంబరముగా తిరునాళ్ళవలె సాగును. నాలుగవ వార్షికోత్సవమును కనులార

తిలకించిన కళావేత్త కీ॥ శే॥ అడవి బాపిరాజుగారు సమ్మోహితులైనారు. పోలీసు చర్యకు ముందు నైజాములో సాగినరజాకారుఉద్యమకాలమున పరిషత్తు కొంతకాలము తన కార్యక్రమమును స్తంభింప జేసికొన్నను – పోలీసు చర్యతో పరిస్థితులు మారిపోయెను. అరికట్టబడి యున్న జనతా చైతన్యము ఒక్కసారిగా పొంగి పారినది. విరివిగా పరిషత్తుశాఖలు ఆంధ్ర దేశమున మూలమూలలో స్థాపించబడెను. పరీక్షా కేంద్రము లేర్పడెను. వేల సంఖ్యలో విద్యార్థులు పాల్గొనిరి.

***పరిషత్తు శాఖలు, పరీక్షలు:***

పరిషత్తు శాఖలు, పరీక్షా కేంద్రములు అఖిలాంధ్రమున నేర్పడుటేకాక బొంబాయిలో, మదరాసు రాష్ట్రమందలి హోసూరులో, కె. జి. కంద్రికలో, బెంగుళూరులో ఏర్పడినవి. ప్రస్తుతము ప్రాథమిక, ప్రవేశ, విశారద పరీక్షలు సంవత్సరమునకు రెండుసార్లు నిర్వహింపబడుచున్నవి. పరిషత్తు నిర్వహించిన పరీక్షల ఫలితముగ, పోలీసుచర్య తరువాత తెలంగాణము నందలి పాఠశాలలలో అంతవరకు ఉండిన ఉర్దూకు బదులుగా తెలుగు బోధన భాషగా మారినను తెలుగు ఉపాధ్యాయుల కొరత ఏర్పడలేదు.

ఇప్పటివరకు ఈ పరీక్షలలో సుమారు ఏబది వేలకు పైగా అభ్యర్థులు స్త్రీలు పురుషులు పాల్గొన్నారు. ప్రతిసారి 40 నుండి సుమారు 100 కేంద్రములలో పరీక్షలు జరుగుచుండును. ఇందులో అధిక సంఖ్యాకులైన అభ్యర్థులు గ్రామీణ ప్రాంతములలోని వారు. బడులలో చదువుకొను అవకాశములేని యువజనులు. తెలంగాణా జిల్లాల్లోని ప్రతి పల్లెటూరికిని ఈ పరీక్షలు సుపరిచితములై యున్నవి. వెనుకటి హైదరాబాదు ప్రభుత్వము ప్రవేశ – విశారద పరీక్షలను ఆమోదించి అందు ఉత్తీర్ణులైన వారిని ప్రాథమిక – ఉన్నత పాఠశాలలలో తెలుగు ఉపాధ్యాయులుగా స్వీకరించినది.

***అక్షరాస్యతా వ్యాప్తి:***

పరీక్షలతో బాటు పరిషత్తు అక్షరాస్యతా వ్యాప్తికి గూడ కృషి చేయుచున్నది. ఇంతవరకు తెలంగాణా జిల్లాలలోని గ్రామాలలోను, కొత్తగూడెం వంటి కార్మిక ప్రాంతములోను 114 రాత్రి పాఠశాలలను, హైదరాబాదు నగరమున 11 సాంఘిక విద్యా కేంద్రములను నిర్వహించినది. వయోజన విద్యావ్యాప్తికై ఉపాధ్యాయ శిక్షణ శిబిరమును పరిషత్తు నిర్వహించినది. భారత ప్రభుత్వము 1950 లో జబల్పూరు నందు జరిపిన వయోజన విద్యాగోష్ఠిలోను, 1953 లో అలహాబాదులో నడపిన వయోజన శిక్షణాలయములోను పరిషత్తు ప్రతినిధులు పాల్గొన్నారు.

***గ్రంథాలయోద్యమము:***

గ్రంథాలయోద్యమ వ్యాప్తికిని పరిషత్తు బలమైన చేయూత నిచ్చినది. 1952 సంవత్సరమున హైదరాబాదులో జరిగిన అఖిల భారత గ్రంథాలయ మహాసభను పరిషదధ్యక్షు కార్యదర్శులు ఆహ్వాన సంఘ కార్యదర్శులుగా ఉండి నిర్వహించినారు. మాజీ విద్యాశాఖా డైరెక్టరు శ్రీ పి. సేతుమాధవరావుగారు నిర్వహించిన గ్రంథాలయోద్యమమునకు పరిషత్తు పూర్ణ సహకారము నొసగి తెలంగాణములో విద్యాశాఖ క్రింద ఉన్న ప్రాథమిక మాధ్యమిక ఉన్నత పాఠశాలల గ్రంథాలయములకు 2 లక్షల రూపాయల వెలగల గ్రంథములను సేకరించి అందజేసినది.

***లలితకళలకు ప్రోత్సాహము:***

సాహిత్యంతో బాటు పరిషత్తు కవిత్వ, నృత్య, చిత్రకళా ప్రచారమునకు కూడ తగిన చేయూత నొసగెను. 1952 అక్టోబరులో హైదరాబాదు నగరమున శ్రీ నటరాజ రామకృష్ణగారిని ఆహ్వానించి నాట్యకళా ప్రదర్శనములను ఏర్పాటు చేసినది. 1955 సెప్టెంబరులో నగరమున తెలంగాణా చిత్రకారులు శ్రీ కొండపల్లి శేషగిరిరావుగారి చిత్రముల ప్రదర్శనము జరిపించినది. ఈ ప్రదర్శనమును హైదరాబాదు ముఖ్యమంత్రి, డా॥ బూర్గుల రామకృష్ణారావు గారు ప్రారంభించినారు.

***ఇతర సంస్థలతో సహకారము:***

రాష్ట్రమునందలి వివిధ వైజ్ఞానిక కార్యక్రమాలను నిర్వహించు సంస్థలతో పరిషత్తు సహకరించుచున్నది. 1950 సం॥ నవంబర్ నెలలో మహారాష్ట్ర, కర్నాటక సాహిత్యపరిషత్తులతో కలసి హైద్రాబాద్ నగరమున సాంస్కృతిక సంగమోత్సవమును నిర్వహించెను. నగరమునందలి సర్వః శాఖాలల అధ్వర్యములో జరుగు ఆంధ్రాభ్యుదయోత్సవములకు యథాశక్తి తోడ్పడుచున్నది. లక్ష్మణరాయ పరిశోధక మండలిని పరిషత్తు పునరుజ్జీవింపజేసినది. అంజుమనే తరక్కీ ఉర్దూ, హిందీ ప్రచారసభ, తెలంగాణా గ్రంథాలయ సంఘములతో పరిషత్తునకు సత్సంబంధములు కలవు. తెలుగు లిపి సంస్కరణ సంఘ కార్యములకు అఖిల భారత తెలుగు రచయితల సమావేశమునకు పరిషత్తు సహకరించినది. ప్రభుత్వ స్థాయిలో జరిగిన టాగోరు శతవార్షికోత్సవాలు పరిషత్తు

కార్యాలయమునుండి నిర్వహించబడినవి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, లలితకళా అకాడమీలతో పరిషత్తునకు సత్సంబంధములున్నవి.

**పండిత సన్మానము:**

పరిషత్తు అనేక సారస్వత సభలను నిర్వహించి రాష్ట్రీ మండలి కవి, పండితుల నాహ్వానించి సన్మానించినది. 1955లో తెలుగు భారత మహోత్సవాలను, 1956లో ఆంధ్ర మహాభాగవతోత్సవములను జరిపినది. 1957లో వాల్మీకి రామాయణమును గూర్చి, తెలుగు ప్రబంధాలను గూర్చి విద్వాంసులచే ఉపన్యాసము లిప్పించినది. ఈ సందర్భములలో శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ, శ్రీ మునిమాణిక్యం నరసింహారావు, శ్రీ పింగళి లక్ష్మీకాంతము, శ్రీ నేలటూరి వెంకటరమణయ్య, శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రి, శ్రీ తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ నండూరి బంగారయ్య, శ్రీ వేదాల తిరువేంగళాచార్యులు, శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు, శ్రీ కురుగంటి సీతారామయ్య, శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి, శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి మొదలైన కవి పండితులను సన్మానించినది.

**ప్రచురణలు:**

పరిషత్తు తక్కిన కార్యక్రమములతోబాటు ఉత్తమ గ్రంథములను ప్రకటించు కార్యమును పూనెను. పండిత సారస్వతము, ప్రజా సారస్వతము, బాలసారస్వతము అను విభాగములలో అనుభవజ్ఞులైన రచయితలచే ఉత్తమ గ్రంథములను వ్రాయించి ప్రకటించినది. పరిషత్తు ఇంతవరకు వివిధ భాగములలో దాదాపు ఏబది గ్రంథములను ప్రకటించెను. వానిలో శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారి "కావ్యాలంకార వివరణము" సాహిత్య పరీక్షలకు వెళ్ళు విద్యార్థులకు విశేష ప్రయోజనకరముగ నున్నది. స్వర్గీయ సురవరం ప్రతాపరెడ్డిగారిచే వ్రాయించి ప్రకటించిన "ఆంధ్రుల సాంఘిక చరిత్ర" కేంద్ర సాహిత్య అకాడమీవారిచే ఉత్తమ గ్రంథముగా పరిగణింపబడి 5 వేల రూపాయల బహుమతి నందినది. "ఆంధ్ర మహాభారతోపన్యాసములు," "ఆంధ్ర భాగవతోపన్యాసములు" అనుగ్రంథములను తిరుపతి, ఉస్మానియా విశ్వవిద్యాలయములు తమ పాఠ్య గ్రంథములుగా నిర్ణయించినవి. జానపదవాఙ్మయమున "స్త్రీల రామాయణ పాటలు" "స్త్రీల పౌరాణికపు పాటలు" "పల్లెపదాలు" అను 3 సంపుటాలు ప్రకటింపబడినవి.

భారత ప్రభుత్వము ఆంగ్లములో ప్రకటించిన "ప్రాక్పశ్చిమ తత్త్వ శాస్త్ర చరిత్రము"ల రెండు సంపుటాలను అనువదింపజేసి ప్రకటించినది.

బాల సాహిత్య శాఖలో 15 పుస్తకములు వెలువడినవి. ఈ విధముగ ప్రతి సంవత్సరము కొన్ని ఉత్తమ గ్రంథములు ప్రకటింపబడుచున్నవి.

**ఉస్మానియా విశ్వ విద్యాలయము – పరిషత్తు:**

పోలీసు చర్య తరువాత ఉస్మానియా విశ్వ విదాలయము నందలి శిక్షా ప్రణాళికలో ప్రజల మాతృభాషలను నిర్బంధ పఠనీయములుగా చేయించుటకు పరిషత్తు గట్టిగా కృషిచేసి విజయము నందినది పరిషత్తు పరీక్షలకు ప్రభుత్వము వే ఆమోదింపచేయుటకు, ప్రాచ్యభాషలలో పట్టములు పొందిన తెలుగు పండితులకు విశ్వ విద్యాలయ పట్టభద్రులతో సమానముగ వేతనము లిప్పించుటకు, ఉన్నత పాఠశాలా స్థాయిలో తెలుగును బోధనాభాషగా ప్రవేశ పెట్టించుటకు కృషి గావించి సఫలత నందినది. కేంద్ర ప్రభుత్వము ఉస్మానియా విశ్వ విద్యాలయమును హిందీ విశ్వ విద్యాలయముగా మార్చుటకై పట్టు పట్టినపుడు పరిషత్తు తక్కిన భాషాసంస్థల ప్రజా ప్రముఖులతో కలసి తీవ్ర కృషి చేసి కేంద్ర ప్రభుత్వాభిప్రాయమును మార్పించుటలో ప్రముఖ పాత్ర వహించెను.

**భవన నిర్మాణము:**

పరిషత్తునకు 1950 సంవత్సరమున హైదరాబాదు ప్రభుత్వము నగరమందలి "బొగ్గులకుంట" అను ప్రదేశములో 1815 చ. గజముల భూమిని ఉచితముగా ఇచ్చెను. ఈ భూమిలో 1954 సంవత్సరమున పరిషత్తు కార్యాలయము కొరకై కొన్ని గదులు నిర్మింపబడినవి. పరిషత్తు కార్యక్రమము పెరుగుచుండుట వలన నీగదులు చాలకపోయెను. ఇంతలో ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడెను. పరిషత్తు అవసరాలకు సరిపోవు భవనముల నిర్మాణమునకు ఈ స్థలము చాలదని ఇంజనీరు సూచించిరి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమును కోరగా వెంటనే ఈ స్థలము ప్రక్కనే పోలీసు ఠాణా వున్న 1200 చ. గ. భూమిని అప్పటి మంత్రులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డి గారును, శ్రీ మందుముల నరసింగరావు గారును, శ్రీ దామోదరం సంజీవయ్య గారును పరిషత్తు స్వాధీనము చేయుటలో చాల సహాయము చేసిరి. ఆ తరువాత 1962 లో ఆంధ్ర సారస్వత పరిషత్తు ఆడిటోరియం నిర్మింపబడినది. ఈ భవన నిర్మాణ సందర్భములో అప్పటి

ఆర్థికమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి గారును, విద్యామంత్రి శ్రీ ఎస్. బి. పి. పట్టాభిరామారావు గారును, ముఖ్యమంత్రి శ్రీ డి. సంజీవయ్య గారును, కేంద్ర ప్రభుత్వ సాంస్కృతిక వైజ్ఞానిక పరిశోధనల మంత్రి శ్రీ హుమయూన్ కబీర్ గారును సంపూర్ణ సహకారమొసగి యున్నారు.

**పరిషత్తు గ్రంథాలయము - తాళపత్ర గ్రంథములు :**

పరిషత్తునకు ఉత్తమ గ్రంథాలయము సమకూర్చుటకు ప్రయత్నము చేయబడినది. ప్రస్తుతము పరిషత్తు గ్రంథాలయములో సుమారు 3000 గ్రంథములు సేకరింపబడియున్నవి.

పరిషత్తు గ్రంథాలయమునకు శ్రీ రాజా రామేశ్వరరావు గారు తమ సంస్థానమున పూర్వమునుండి సేకరించిన అమూల్యములైన ముద్రిత తాముద్రిత గ్రంథములను ఇంగ్లీషు – ఉర్దూ – సంస్కృతము – తెలుగు భాషలలో 887 టిని ఇచ్చి వానిని భద్రపరచుటకై 6 అల్మేరాలను గూడ బహూకరించినారు. వీనితోబాటు శ్రీ రాజాగారు తమ సంస్థానమునందలి 102 తాళపత్ర గ్రంథములను గూడ అనుగ్రహించినారు.

పరిషత్తులో గ్రంథాలయముతోబాటు ఉచిత పఠనాలయము గూడ నిర్వహింపబడుచున్నది. తెలుగు ఇంగ్లీషు భాషలలో ప్రసిద్ధములైన దిన, మాస, వారపత్రికలు సుమారు 25 వరకు తెప్పించబడుచున్నవి. వానిని ప్రతిదినము 50 మందికి తక్కువ లేకుండ పాఠకులు ఉపయోగించుకొనుచున్నారు.

**పరీక్షకు ప్రభుత్వామోదము :**

పరిషత్తుకృషి ఫలితముగ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము పరిషత్తు విశారద పరీక్షను ఆమోదించి అందు ఉత్తీర్ణులైనవారిని తెలుగు ఉపాధ్యాయులుగా స్వీకరించుచున్నది. కేవలము విశారద పాసైన వారికి 70-100 రూ. లకు, విశారదతోబాటు ఉస్మానియా విశ్వవిద్యాలయము వారి డి. ఓ. యల్. పరీక్ష పూర్తిచేసిన వారికి 80-130 రూ. లను, విశారద డి. ఓ. యల్. తో బాటు 5 నెలల పండిట్ ట్రైనింగు పూర్తిచేసినచో 80-150 రూ. ఇచ్చుటకు తీర్మానించి ప్రకటించినది.

ఉస్మానియా విశ్వవిద్యాలయము విశారదను తమ ఎంట్రన్సుతో సమానముగా పరిగణించి, అట్టివారు నేరుగా డి-ఓ-యల్ పరీక్షలో రాష్ట్రమందలి అన్ని ప్రాంతాలవారు పాల్గొనుటకు అంగీకరించినది.

రాష్ట్ర పబ్లిక్ సర్వీస్ కమీషన్‌వారు తెలుగురాని ప్రభుత్వోద్యోగులకై తాను నిర్వహించు II–III గ్రేడు పరీక్షలతో సమానముగా పరిషత్తు నడుపుచున్న-ప్రవేశ ప్రాథమిక పరీక్షలను అంగీకరించినది. ఈ విధముగా పరిషత్తు పరీక్షలకు ప్రభుత్వమునుండి ఆమోదము లభించినది.

తెలుగు పండితులకు 5 నెలలు ట్రైనింగు పరీక్షనుగూడ పరిషత్తు నిర్వహించుటకు ప్రభుత్వము ఆమోదించినది. త్వరలోనే హైద్రాబాదు నగరమున పండిట్ ట్రైనింగ్ తరగతులు పరిషత్తు ప్రారంభించబోవుచున్నది.

**పరిషత్తు పాలకవర్గము :**

ప్రారంభింపబడినప్పటినుండి ఇప్పటి వరకు ఈ సంస్థకు శ్రీ లోకనంది శంకరనారాయణరావు, కీ. శే. సురవరం ప్రతాపరెడ్డి, శ్రీ బుఱ్ఱా వెంకటసుబ్బారాయుడు, శ్రీ ఇల్లిందల రామచంద్రరావు, శ్రీ పర్సా వేంకటేశ్వరరావు, శ్రీ దేవులపల్లి రామానుజరావుగారలు అధ్యక్షులుగా పనిచేసిరి. కార్యదర్శులుగా శ్రీ బూర్గుల రంగనాథరావు, శ్రీ బిదురు వెంకటశేషయ్య, శ్రీ కొండూరి నరసింహాచార్యులు, శ్రీ పులిజాల హనుమంతరావుగార్లు పనిచేసినారు.

ప్రస్తుతము ఈ సంస్థకు క్రింది పాలకవర్గమేర్పడి పనిచేయుచున్నది. శ్రీ నూకల నరోత్తమరెడ్డి (అధ్యక్షులు), శ్రీ దేవులపల్లి రామానుజరావు, శ్రీ యం. రామప్ప (ఉపాధ్యక్షులు), గడియారం రామకృష్ణశర్మ (కార్యదర్శి) శ్రీ ధవళా శ్రీనివాసరావు (స. కార్యదర్శి) (సభ్యులు) శ్రీఆదిరాజు వీరభద్రరావు, డా. దివాకర్ల వేంకటావధాని, డా. బి. రామరాజు, డా. సి. నారాయణరెడ్డి, శ్రీ బి. వి. రమణారావు, డా. పల్లా దుర్గయ్య, శ్రీ పర్సా వేంకటేశ్వరరావు, శ్రీ బి. పి. ఆర్. విఠల్, శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, శ్రీ దాశరథి, శ్రీ హరిపురం వెంకట్రామయ్య, శ్రీ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి, శ్రీ పి. ముద్దుకృష్ణ, శ్రీ పెరవలి లింగయ్యశాస్త్రి, శ్రీ కె. వేదాంతాచారి, శ్రీ సరిపల్లి విశ్వనాథశాస్త్రి, శ్రీ చౌటుపల్లి హనుమంతరెడ్డి, శ్రీమతి నాయని కృష్ణకుమారి, శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి, శ్రీమతి పి. యశోదా రెడ్డిగార్లు ఉన్నారు.

**ప్రభుత్వపు గ్రాంటు :**

ప్రతి సంవత్సరము రాష్ట్ర ప్రభుత్వము నుండి పరిషత్తుకు 18000 వేల రూపాయల గ్రాంటు లభించుచున్నది. పరిషత్తు ప్రకటించు కొన్ని ప్రచురణలకు కేంద్ర ప్రభుత్వము 50% శాతము ముద్రణ వ్యయములను గ్రాంటుగా ఇచ్చి తోడ్పడినది.

**భవిష్యత్ కార్యక్రమము :**

పరిషత్తు కార్యక్రమము విస్తరింపవలసి యున్నది. ముందు ముందు పరిశోధనా విభాగము ప్రారంభింపవలసి యున్నది. అందుకై ముద్రితాముద్రిత గ్రంథములతో పెద్ద భాండాగారము ఏర్పడవలెను. గ్రంథాలయమునకు, పరిశోధనా విభాగమునకు ఇప్పుడున్న భవనము సరిపోదు. మడిగలమీద రెండవ అంతస్తుగా కొన్ని గదులను నిర్మింపవలసి యున్నది.

ఇంతవరకు పరిషత్తునకు అన్ని విధముల సహకరించి తోడ్పడిన పెద్దలకు ప్రభుత్వమునకు, ఉదారులకు, కార్యకర్తలకు ఆంధ్ర సారస్వత పరిషత్తు చాల ఋణపడి ఉన్నది.





## అనంతపురం

*సాముదాయిక మోట బావి:*

పెనుగొండ పంచాయతీ సమితిలోని నల్గొండ రాయంపల్లిలో సాముదాయిక మోట (సేద్యం) బావి పనిని జూన్ 26వ తేదీన ప్రారంభించారు.

## తూర్పుగోదావరి

*విత్తనాలు, పనిముట్ల పంపిణీ:*

సీతానగరం పంచాయతి సమితిలోని రైతులకు 1964 జూన్ నెలలో 665 మణుగుల మేలురకం విత్తనాలను, 802 మణుగుల రసాయనిక ఎరువులను, 74 పౌనుల క్రిమిసంహారక ఔషధాలను, 5 ఆధునిక వ్యవసాయ పనిముట్లను పంపిణీ చేశారు.

ఈ నెలలో ఒక మహిళా మండలిని ప్రారంభించారు. ఒక చిన్న వంతెనను కూడా నిర్మించారు.

## గుంటూరు

*కచ్చారోడ్డు నిర్మాణం:*

సంతమాగులూరు పంచాయతీ సమితి ప్రాంతంలో జూన్ నెలలో 333 మణుగుల మేలురకం విత్తనాలనూ, 21 ఆధునిక వ్యవసాయ పనిముట్లనూ పంపణీ చేశారు. ఇదే నెలలో రెండు ఫర్లాంగుల కచ్చా రోడ్డును కూడా నిర్మించారు.

*పాఠశాల భవనం:*

కొప్పర్రులో ఒక లక్ష రూపాయల ఖర్చుతో నిర్మించదలచిన ఉన్నత పాఠశాల భవనానికి జూలై 18వ తేదీన శంకుస్థాపన జరిగింది.

## హైదరాబాద్

*ఉత్తమ పంచాయతీ సమితి:*

హైదరాబాదు జిల్లాలోని మేడ్చల్ పంచాయతీ సమితి, 1963–64 వ సంవత్సరంలో జిల్లా అంతటిలోకీ ఉత్తమ పంచాయతీ సమితిగా ఎన్నిక అయింది.

## కరీంనగర్

*మంచినీటి బావులు:*

జగిత్యాల పంచాయతీ సమితిలోని గ్రామీణ స్వచ్ఛందదళం, రక్షణ శ్రామిక బ్యాంకు సభ్యులు ఆలూరు, శింగారావుపేట, ఉప్పుమడుగు గ్రామాలలో మంచినీటి బావుల త్రవ్వకాన్ని చేపట్టారు. జూన్ నెలలో సుమారు రూ. 500 లు విలువచేసే పని జరిగింది.

*వనమహోత్సవం:*

కరీంనగర్ జిల్లాలో జూన్ 21వ తేదీ నుంచి 29వ తేదీ వరకు వనమహోత్సవం జరిగింది. ఈ సందర్భంలో వివిధ కార్యాలయాలు, విద్యా సంస్థలు ఇతర సంస్థలలో అనేక వందల మొక్కలు నాటారు.

## ఖమ్మం

*శిక్షణ శిబిరం:*

పాల్వంచలోని పంచాయతీరాజ్య శిక్షణ, సంస్థ సిబ్బంది తిరుమలాయపాలెంలో పంచాయతీల సభ్యుల కొరకు జూలై 10వ తేదీ నుంచి మూడు రోజుల పాటు శిక్షణ శిబిరం నిర్వహించారు.

## నల్గొండ

*ఈగల నిర్మూలన వారం:*

రామన్నపేట పంచాయతీ సమితిలోని గ్రామాలలో జూలై మొదటి వారంలో ఈగల నిర్మూలన వారం పాటించారు.

*వ్యవసాయ కార్యక్రమం:*

చింతలపల్లి పంచాయతీ సమితి ప్రాంతంలో జూన్ నెలలో 23 మణుగుల మేలురకం విత్తనాలు, 5 మణుగుల రసాయనిక ఎరువులు పంపిణీ చేశారు.

## నిజామాబాద్

*సహకార శిక్షణ తరగతులు:*

నీల గ్రామంలో జూలై 16వ తేదీ నుంచి అయిదు రోజులపాటు సహకార శిక్షణ తరగతులు నిర్వహించారు.

*6వ తరగతికి ప్రారంభోత్సవం*

సమీకృత విద్యాపథకం క్రింద బాన్సువాడ పంచాయతీ సమితిలోని జె. బి. ఎస్. నస్రుల్లాబాద్ లో జూలై 15వ తేదీన 6వ తరగతికి ప్రారంభోత్సవం జరిగింది.

ప్రగతి పథంలో

**అనువాదభారతి**

# వేశ్య

మరాఠీ కథ

మూలం :
శ్రీమతి స్నేహలతా దస్నూర్కర్

అనువాదం :
చంద్రమౌళి

మధ్యాహ్నం రెండుగంట లయింది.

నిద్రపోతున్న మొహల్లా మేల్కొన్నది. వళ్ళు విరవటాలూ, ఝూడింపులూ మొదలైనై. 'ఉస్మాన్‌మంజిల్'లో కూడా 'తెల్లవారింది'. ఛల్లీ లేచి రత్నను కేకవేసింది. రత్న మెలుకువగానే ఉంది. "అబ్బ ఊరికే అరవకు. 'చా' చేసి మూత పెట్టాను. పోయి ముఖం కడుక్కురా-" అన్నది.

ఛల్లీ ఒక పక్కకు వత్తిగిలి వీపు నున్న ఎముకలు చప్పుడయ్యేటట్లు విరిచి, తలమీద ఒక అరచెయ్యి, గడ్డం క్రింద రెండో అరచెయ్యి ఉంచి తలలో ఎముకలుకూడా విరిచింది.

"తల ముక్కలు చేసేట్టున్నావే;" ఛల్లీ;" అంటూ రత్న నవ్వింది; "నీ ఆకారం తగలెయ్య."

ఛల్లీకూడా నవ్వి కంటిరెప్ప లాడిస్తూ. "నీ పని బాగానే ఉందే రత్నీ—నాయకుడు దొరికాడుగా. మహావస్తే నెలకు నాలుగైదు సార్లు వస్తాడు. చీకట్లో దూరాన కూర్చునే మాట్లాడతాడా నీతో; నెలకు సరిపడా అప్పజెప్పుతాడుగా. అట్లాటివాడు నాకెక్కడ దొరుకుతాడు. రోజూ ఎవడో కొత్త సచ్చినాడు వస్తాడు. శరీరం హూనం హూనం చేసి వెళ్తాడు" అన్నది.

అని ఛల్లీ మళ్ళీ మంచంమీద విరుచుకుపడి రత్నను బుజ్జగిస్తూ అన్నది;— "రత్నా. కాస్త వీపు తొక్కుదూ—" రత్న లేచింది. ఛల్లీ వీపు తొక్కటానికి కాను. ఛల్లీ చేయిపట్టుకు లాగుతూ; "ఇక లేస్తావా నిజంగానే తొక్కనా?" అన్నది. "రోజూ లేచేటప్పటికి 'చా' తయారుగాలేదని గుణిసేదానివి. ఇవాళ చేసి తయారుగా ఉంచితే— రాజాగారి రాణీగారికి తీరటానికే లేదు—లే—లే-" అన్నది.

రత్న రెండుమూడు తడవలు చెయ్యి పట్టుకు గుంజితే ఛల్లీ లేచింది. గుప్పెళ్లు బిగించి పొయ్యిదగ్గరగా కాళ్ళు బారజాపుకు కూర్చున్నది. రత్న ఆమె ముందు 'చా' తెచ్చిపెట్టింది. పచ్చ పచ్చగా ఉన్న 'చా' తాగుతూ ఛల్లీ గంభీర మైపోవటం చూచి రత్న అన్నది; "ఛల్లీ, ఇకతాగు, ఊరికే కూచుని మనసులో విచారం ఎందు కెట్టుకుంటావ్?"

"రాజాగారి రాణీ ఎలా ఉంటుందోనని ఆలోచిస్తుండా? నువ్వుగాని చూశావా ఎప్పుడైనా రాజు గారి రాణీని—?"

"ఎందుకూ — రాజాగారి రాణీ ఐనా ఇంద్రుడిగారి ఇంద్రాణీ అయినా మొగాడికి మాత్రం పెళ్ళామేగా"— ముఖం వెగటుగా పెట్టి అన్నది రత్న.

ఛల్లీకి అది నచ్చింది. రాజుగానీ, ఇంద్రుడుగానీ ఆడవాళ్ళ విషయంలో వాళ్ళు మొగావాళ్ళు మాత్రమే. వాళ్ళల్లో ఉండే కుత్సిత బుద్ధి అందరిలోనూ ఉంటుంది. ఆడవాళ్ళ విషయంలో వాళ్ళ హృదయం రాక్షసుల హృదయంలా వుంటుంది.

*　　*　　*

అలాటి రాక్షసుల్లో రావణుల్లాంటి పురుషుల కోసమే ఛల్లీ అలంకరించుకోవటం మొదలుపెట్టింది. వాళ్ళని ఆకర్షించటమే కావాలి. మరిపించి, పైకి తీసుకురావాలి. వాళ్ళల్లో రేగుతున్న రాక్షసపు ఆకలి ఎప్పుడు తృప్తిపడుతుందో అప్పుడే వాళ్ళు ఆమె ముందు వెండినాణాలు గుమ్మరిస్తారు. అప్పుడే ఆమె పొట్టలో రేగుతున్న ఆకలి శాంతిస్తుంది.

ఛల్లీ, పురుషుల ఆ రాక్షసుల ఆకలినే అసహ్యించుకుంటే, రత్న తన పొట్టలో రేగే ఆకలినీ అసహ్యించుకునేది: 'ఈపొట్ట లేకపోతే — ఈ పొట్టలో ఆకలి లేకపోతే?' అని అనుకునేది.

ఛల్లీ మెల్ల మెల్లగా తయా రౌతున్నది. స్నానం చేసింది. నొక్కులు తిరిగిన తన జుట్టు విప్పుకుని బాగా నూనె రాసుకుని కొయ్య దువ్వెనతో దువ్వుకుని — రత్న దగ్గరకు వెళ్ళి కూర్చున్నది.

"రత్నీ — యీ రిబ్బను కాస్త కట్టవూ?— మెడదాకా వద్దు — గుర్రపు తోకలా ఉండాలి—?" "అంటే — కారులో తిరిగే 'ఆమె' కట్టుకున్నట్లుగానా?"

"ఆ — ఆ — అట్టాగే —"

"నీకు ఆమప్పూ అజాలేదేమే ఛల్లీ" అంటూ రత్న ఎర్రటి రిబ్బను ముక్కతో ఛల్లీ జడ కట్టింది. ముదురు పసుపుపచ్చచీరె కట్టుకుని, ఆకుపచ్చని రవిక తొడుక్కుని ఛల్లీ అద్దం ముందు కూర్చున్నది. పౌడరు డబ్బీ తెరిచి కుడిచేత్తో గుప్పెడు పౌడరు తీసి ఎడం చేతిలో వేసుకున్నది. ముక్కుకూ, చంపలకూ గడ్డానికీ పౌడరు పూత పూసింది. ముఖం మీద పౌడరు పూసినట్లు తెలిసిపోతున్నది. అయినా ఛల్లీకి ఆ విషయంలో గట్టి అభిప్రాయమే ఉంది

"మన మేమైనా సంసారులమా ఏమన్నానా? పౌడరు రాసుకోనూ రాసుకోవాలి — అది కనపడకుండానూ ఉంచాలంటే.

ఇట్లాంటి దొంగవేషాలేం అక్కర్లేదు. మనం మాటల్లోనూ చేతల్లోనూ — ఉంపుడుగత్తెలమే—"

పెదాలకూ చెంపలకూ రంగు రాసుకోవటం పూర్తయి ఛల్లీ తయారై పోయి మెట్లుదిగుతూ దిగుతూ — "రత్నీ, కిళ్ళీలు తేవటానికి నేను పోతున్నాను — నువ్వు తయారుకావా?" అని అడిగింది —

"నాకేం అక్కర్లేదు —"

"అది నాకూ తెలుసులే. పోనీ స్నానమైనా చేస్తావా? దేవుడు నీకు రంగూ యిచ్చాడు, రూపమూ యిచ్చాడు. ముస్తాబు కాకపోతే మానె, ఆ చీరా, రవికే అన్నా మారుస్తావా? నాయకుడు యివాళ వస్తానని మాటిచ్చాడుగా?"

రత్న నవ్వి కూర్చున్న చోటునుంచి లేవటంలో ఛల్లీకి ధక్కా తగిలినట్లయింది. ఇక చకచకా మెట్లు దిగి కిందకు వెళ్ళిపోయింది ఛల్లీ.

సందుమొగదల హోటలొకటున్నది. ఆ హోటలుముందు చిన్న కిళ్ళీ షాపున్నది. "ఓహో గులాబయ్యా — రెండు కిళ్ళీలియ్యి జల్దీ"— దుకాణపు బల్లమీద కెక్కి కూర్చుని కాళ్ళు ఆడిస్తూ రోడ్డువంక చూస్తూ అడిగింది ఛల్లీ—, "నీ 'బక్షీ'గాడింకా రాలేదల్లే ఉందే—"

"ముందు కిందకు దిగు నువ్వు. నా బల్ల పాడుచేయటమే కాకుండా — నా దుకాణం ఖాళీచేశేట్టున్నావ్. పైగా నా స్నేహితుడ్ని బక్షీగాడంటావా? నీ రొట్టెలు కాలుస్తున్నాడా? నీ గిన్నెలు తోముతున్నాడా? బక్షీ అలీ అను—" అన్నాడు.

"అసలు నీ బక్షీష్ అల్లీ నా కాళ్ళు నాకుతాడు, నాకాళ్ళు—"

"థూ, నీకాళ్లు నాకే దెవరు? నల్లకుక్క కూడా నీవంక చూడదు—" కిళ్ళీలిస్తూ నవ్వుతూ అన్నాడు గులాబ్.

బల్లమీదనుంచి దూకి ఎడంచేత్తో కిళ్ళీ పట్టుకు చెయ్యి ఊపుతూ— "నల్లకుక్క చూస్తుందని నేనెక్కడన్నాను. మనిషికన్న కుక్క కాస్త బుద్ధున్నదే-" గులాబ్ నోరు మూతపడేటట్టు నవ్వుతూ ఛల్లీ అన్నది; "చెప్పుదెబ్బలు తిన్నట్లు ముఖం పెట్టకు గులాబూ - నువ్విలా ముఖం పెడితే నా హృదయం దడదడ లాడుతుంది."

గులాబ్ నవ్వాడు. ఛల్లీ ఒకకిళ్ళీ బొడ్లో దోపుకుని ఒకటి బుగ్గన పెట్టుకున్నది. గులాబును ఒక్కమాటన్నా అడక్కుండా - వేళ్ళతో యింత పొగాకు తీసుకున్నది. తీసుకుని ఎడం గుప్పిటలో పెట్టుకుని యింత సున్నం దానిమీద పెట్టి నలుస్తూ గులాబ్ చూపు ఆకట్టుకుని, పొగాకు నోట్లో వేసుకుని తిరిగివచ్చి మెట్లెక్కింది.

రొండిలో దోపుకున్న కిళ్ళీ తీసి గూట్లో పెట్టి తను లోపలికి వెళ్ళింది.

రత్న స్నానం చేయటం పూర్తయింది. తడి బట్టలతోటే ఆమె దేవుడి విగ్రహం ముందు చేతులు జోడించి నిల్చుని ఉన్నది. దేవుడిముందు దీపారాధన వెలుగుతున్నది.

ఛల్లీకి యిదేమీ పట్టదు. కిటికీ చెక్క దగ్గరగా వ్యాపారం కోసం నిల్చోబోయే ముందు - రత్న పట్టుపడితే ఆ దేవుడి ముందు నిల్చుని చేతులు జోడించేది. వాడెందుకు యీ నరకంలోకి తొంగిచూస్తాడు. వాడికి తీరి కెక్కడిది? వాడు స్వర్గాన్ని రిపేరు చేయటంలోనే నిండి ఉన్నాడు. రత్న పిచ్చిది. అయినా ఛల్లీ హృదయమంతా ఆమె నిండిపోయింది. రత్నమాటలు జవదాటడం ఛల్లీ శక్తిని మించిన పని.

ఛల్లీ దేవుడిముందు నిల్చుని చేతులు జోడించి పెదాలు కదిలిస్తూ ఏదో గొణుగుతున్న రత్నవంక చూచి దేవుణ్ణుద్దేశించి అన్నది; "నువ్వు గుడ్డివాడివా ఏమిటి దేవా! నాకేమీ తెలీదు. రత్న మటుకు నీకన్నీ కనిపిస్తయ్యని అంటుంది. నీకు గనక ఏ కొద్దేనా కనిపిస్తే — ఎవరైనా కనకవర్షం కురిపించేవాడిని పంపించు" అంటూ, కుడి చేతి వేళ్లు విగ్రహం ముందు నాట్య భంగిమలో తిప్పటం మొదలుపెట్టింది ఛల్లీ.

రత్న తిరుగుతున్న ఆ వేళ్ళమీద ఎడంచేత్తో ఒక దెబ్బ కొట్టింది. ఛల్లీ నవ్వింది. "ఎక్కడో పిచ్చిది." అని మనసులో అనుకుంటూ గది బయట కొచ్చింది. కిటికీదగ్గర కూచోవటమే మంచిదని కిటికీచెక్క దగ్గర కొచ్చి కాళ్ళు కిందకు జారవేసి కూర్చున్నది.

మూడు గంటలైంది. ఆ దోవ మంచి రహదారి. బజారుపేట. కొంచెం కుడివైపు కెళితే సినిమాహాలు — ఎడమవైపు కొంచెం దూరంపోతే మార్కెట్టు.

సినిమాకు వెళ్ళేవాళ్ళ రద్దీ ఎక్కువగానే ఉంది. ఎంతోమంది 'జోడాలు' అటువైపుగా వెళ్తున్నారు. ఛల్లీకి నవ్వు వచ్చింది. చదువూ, సభ్యతా గల మొగవాళ్ళ నడకా, వాళ్ళ చూపులూ — కిటికీ వంకకూడా చూడకుండా ఉండేందుకు వాళ్ళు చేశే చేష్టలూ, వాళ్ళ వెంబడి ఆడవాళ్ళనూ — ఛల్లీ కుతూహలంతో చూస్తున్నది. వాళ్ళ చూపుల్లో వాళ్ళను గురించిన అభిమానం కనుపిస్తున్నది. ఛల్లీ లాటి వాళ్ళమీద తిరస్కార భావం. రత్నకి ఇది చెడుగా తోస్తుంది. కాని ఛల్లీ నవ్వివేస్తుంది. ఆ ఆడవాళ్ళ చూపుల్లో చూపులు కలిపి ఆకర్షించటానికి ప్రయత్నించేది. అప్పుడు వాళ్ళ ముఖాలు ఎలాగో అయిపోతై. అంతపెద్ద బస్తీలో, అలాటప్పుడు జాగ్రత్తగా పైకి చూచి నడవవలసింది పోయి అజాగ్రత్తగా నిర్లక్ష్యంగా

నడుస్తుంటే ఎవరైనా ఢీ ఢిక్కా కొడితే— వాళ్ళు పడే సిగ్గు చూచి ఛల్లీ హా—హా మని నవ్వేది.

ఛల్లీ చాలా సేపు కూర్చున్నది. పక్కనున్న సోసీ, ఎదురుగా ఉన్న భమియాలను కేకలేసి పలుకరిస్తూ; దారిన పోతున్న వాళ్ళ వంక చూపులతో బాణాలు విసిరి చూచింది. కాని గురి ఇవాళ కిందకే పోతున్నది. ఇవాళ దొరికివచ్చే లక్షణం ఎక్కడా కనుపించలేదు. అందుకని రత్నవంక చూచి అడిగింది.

"నాయకుడెప్పుడొస్తానన్నాడు?"

"వీలైతే పదకొండుగంటల బండికి—"

"రత్నా పద సినిమాకు వెళ్దాం—"

"ఏం కిటికీ దగ్గర కూర్చుని కూర్చుని విసుగెత్తిందా?"

"ఛా! విసుగెందుకూ, తలనొస్తుంది. నీ ధ్యేయమూ—అందువల్ల నా ధ్యేయమే యీ కొయ్యముక్క మీదే ఉన్నది. నువ్వు దేన్నైతే పూజిస్తావో, దాని మీదెక్కి కూర్చుంటాను నేను—" అని ఛల్లీ పకాలున నవ్వటం మొదలు పెట్టింది;" వంతెనపక్కనున్న హాల్లో మంచి సినిమా ఉంది, పోదాం రద్దూ—నాయకుడు రాకముందే తిరిగి వచ్చేద్దాం—"

రత్న సరే అన్నది.

ఇంటికితాళంవేసి ఇద్దరూ రోడ్డుమీదకు వచ్చారు.

ఆరుగంటలైపోయింది. దారినే పోతున్న ఒక రిక్షావాడిని చేయెత్తి ఆపింది ఛల్లీ. "వంతెనపక్కనున్న మొదటి సినిమాహాలుకు పోనీ—" రిక్షాలో కాలు పెడుతూనే ఛల్లీ ఆజ్ఞాపించింది.

"ఏమిస్తారు?"

ఓహో మేమా అడిగేది, నువ్వా? భలే వాడివే—" చూపులో చూపు కలుపుతూ కరుకుగా అన్నది ఛల్లీ: "ముప్పావలా చాలు—ఫస్ట్‌క్లాస్ సరుకు" రత్నవంక చూచినవ్వింది.

"పదవోయ్—" అన్నది రత్న.

* * *

హాలుదగ్గర దిగుతూనే రత్న గుడ్డపర్సు తీయగానే ఛల్లీ తన కుడిచేతిని అడ్డుపెడుతూ రిక్షావాడితో: "ఆట వదలంగానే మళ్ళీ తీసుకెళ్ళటానికి రా" అన్నది.

అప్పటిసంగతి అప్పుడే - ఇప్పుడుడబ్బు ఇప్పించండయ్యా—" ఏదోచూస్తూ వాడు నసనసలాడాడు.

ఓహో! ఓహోహో! బాగానే ఉందే; హాల్లోంచే ఎగిరిపోతామనుకున్నావా—పక్షుల్లాగా? ఆమాత్రం నమ్మకంలేదా ఏమిటి? వచ్చాడయ్యా 'మహా' డబ్బియ్యి—డబ్బియ్యి అంటూను." నలుగురిదృష్టినీ ఆకట్టుకోవడానికి చేతులు తిప్పుతూ అభినయం చేస్తూన్నది ఛల్లీ. జులపాలు పెంచుకుని టిక్కెట్లు బ్లాక్‌మార్కెట్‌లో అమ్మేవాళ్ళు పదిమంది చుట్టు పోగుకావటంతో ఛల్లీకిమంచి ధైర్యం వచ్చింది. రిక్షావాడు గాబరాపడ్డాడు. కాని ఛల్లీ అడ్డుపెడుతున్నా లక్ష్యం చేయకుండా రత్న వాడికి డబ్బిచ్చేసింది. వాడు వెళ్ళబోయాడు, ఇంతలో బ్లాక్‌మార్కెట్ చేసేవాళ్లల్లో ఒకడు ముందుకువచ్చి వాడిగడ్డం క్రింద చెయ్యిపెట్టి పైకెత్తి "వచ్చాడయ్యా మనగాడు" అన్నాడు. "అదే, అంతతొందరగా అర్థంకాదురా వాడికి" అన్నాడింకొకడు. అందరూ ఘొల్లున నవ్వారు. కోపంతో ఎర్రబడిపోయి రిక్షావాడు త్వరత్వరగా వెళ్ళిపోయాడు. గెలిచిన ఆనందంతో ఛల్లీ నవ్వింది. ఇంతలో రత్న ఫామిలీసర్కిల్ టిక్కెట్లు కొనుక్కొచ్చింది.

"నువ్వెప్పుడూ యిలాటి తప్పుడుపనులే చేస్తావు—" కోపాన్ని అభినయిస్తూ అన్నది ఛల్లీ. అని ధనధనలాడుతూ మెట్లెక్కినతీరు చూచి, బ్లాక్‌మార్కెట్‌గాళ్ళంతా హాయ్—హాయ్—అంటూ ఉండిపోయారు.

* * *

ఎప్పుడైతే వీళ్ళు కుర్చీల్లో కూర్చున్నారో అక్కడ అప్పటికే కూర్చుని ఉన్న కులవంతులు తమలోతాము గుసగుసలాడటం మొదలుపెట్టారు. అది వాళ్ళకి తోచింది. అలాటిసమయాల్లో రత్న ఖిన్నురాలైపోయేది. ఛల్లీ మటుకుగణగణలాడుతుండేది. ఎవరైనా ముక్కుమూసుకుంటే - "ముక్కుమూసుకుంటా రెందుకూ? మీ కేం మహారోగం తగిలిందని ముక్కుమూసుకుంటారు..." అని తిట్టిపోసి ముందున్న గోడమీద రెండుకాళ్ళుపెట్టి విశ్రాంతిగా కూర్చుని పబ్లిక్‌వంకచూస్తూ వ్యాపారానికి ప్లానువేయడం మొదలుపెట్టింది.

లేకపోతే దానికి సినిమాకు రావల్సిన అవసరమెక్కడిది? కిటికీ దగ్గర నిల్చుంటే గిరాకీ తగల్లేదని వచ్చి యీ కుర్చీ మీద కూర్చున్నదంతే—కొద్ది సేపట్లోనే, కలిసి వచ్చేది కాని—అప్పుడే హాల్లో చీకటి నిండిపోయింది. గత్యంతరం లేక తెరవంక చూడాల్సొచ్చింది.

ఇంటర్‌వల్‌లో ఛల్లీ లేచి రత్నను బైటికి పోదాం రమ్మన్నది. రత్న రానన్నది. ఛల్లీ ఒక్కతే బయటకు పోయింది. రెండు కిళ్లీలు తీసుకుని నవ్వుతూ తిరిగి వచ్చింది. కూర్చునీ కూర్చోక మునుపే ఒక కుర్రాడు రెండు గ్లాసుల జింజరు ట్రేలో తీసుకొచ్చి ఛల్లీ లాగే చమక్కుమంటున్న ఇద్దరు కాలేజీ పిల్లల వైపుకు పోతుంటే అందులో ఒకామె విరుచుకు పడింది.; "ఎవరు తెమ్మన్నారు చెప్పు నిన్ను—పద మేనేజరు దగ్గర కెల్దాం—" అని గలభా మొదలుపెట్టింది.

ఆ కుర్రాడు భయపడి తెరిచున్న తలుపు

వైపుకు చూచాడు. అక్కడున్న ఒక మనిషి గుర్తు చూపించటంతో వాడు ఛల్లీ దగ్గర కొచ్చాడు. ఛల్లీ వరండావైపు చూచింది. సంకేతాలు జరిగినై. ఛల్లీ నవ్వుతూ జింజరు తాగేసింది. తాగి రత్నను తొందర పెట్టింది. ఆ కుర్రాడివెనకాలే బయటకు వచ్చింది. హాలులో చీకటి పడింది.

రత్న సినిమా చూస్తున్నది– అందంగా ఉన్న ఒక యువతి నదిలోంచి నీళ్ళు తీసుకొస్తున్నది. ధాన్యం దంచుతున్నది. అయినా ఆమె మొగుడు చావగొడుతుండేవాడు– రత్న ఏకాగ్రతతో చూస్తున్నది. సయ్యి సయ్యిమని దెబ్బలు ఆమె శరీరం మీద పడుతున్నప్పుడల్లా రత్న కళ్ళల్లో నీళ్ళు ఊరుతున్నై. రత్న విహ్వలురాలైంది.

తాగుబోతు కొడుక్కూ, కోడలుకూ మధ్యకు అత్తవచ్చి, కోడల్ని విడిపించింది. ప్రతిరోజూ ఏడుపుతోనే తెల్లవారేది, ఏడుపుతోనే అంతమొందేది. ఆ అందమైన తరుణికి ఒక కొడుకు కలిగాడు. ఆమె తల్లి అయింది. పిల్లవాడు ఆమె శ్రద్ధకు ఆలవాలమైనాడు. అయినా దెబ్బలు తప్పలేదు. ఒక రోజు గట్టిగా దెబ్బలు తగలటం వల్ల ఆమె స్పృహ తప్పిపోయింది; మళ్ళీ పిల్లవాడి ఏడుపుతో తెలివి వచ్చింది. ఆమె పిల్లవాడి చేతికి రొట్టెముక్క యిచ్చి నీళ్ళు తీసుకురావటానికి నదికి వెళ్ళింది. వెళ్ళక తప్పదు. నీళ్ళు తేవలసిన పని అలాగే ఉండిపోయింది. నాలుగుసార్లు పోయి రావలసిఉన్నది.

ఆమె బయలుదేరింది, కుంటుతూ మూలుగుతూ. నదివడ్డున కారు చీకటి. ఒక తాగుబోతు ఆమె వెనక వెనక వస్తున్నాడు. ఈ మధ్య వాడు ఊళ్ళో వేళా పాళా లేకుండా తిరుగుతున్నాడు. ఆమె భయపడి త్వర త్వరగా నడవటం మొదలుపెట్టింది. నీళ్ళు– నాలుగు చేతుల దూరంలో ఉన్నయి. నాలుగుచేతులు ఆమెమీద పడినై. ఆమెమీద దెబ్బలు పడినై. ఆమె అరచేదే–అరిచే లోపలే, ఆమె నోట్లో గుడ్డలు కుక్కివేయబడినై. ఆమె ఆ చీకటిలో– ఆమె పిల్లవాడు ఆమెకోసం ఎదురు చూస్తూ ఉన్నాడు.

* * *

–ఛీ– ఎదురుగా సినిమా జరుగుతున్నదా–లేదా. ఇది రత్న జీవితం తాలూకు తమాషా. రత్న రెండు చేతులా కళ్ళు మూసేసినై.

ఇక–సైదాబేగమ్, వేశ్యాగృహం సీను మొదలైంది. ఇక ఆమె, ముసలి అత్తగారి సుగుణాల కోడలు 'లక్ష్మి' కాదు. త్రాగుబోతు భర్తను సహించిన పతివ్రతకాదు. తన పసిపాపడి తల్లికూడాకాదు. ఇప్పుడు ఆమె సైదా కొన్న 'సరుకు' మాత్రమే. ఆ ఖైదులో గులామ్ తను. సైదా మాటల్లో "అందమైన పిట్ట" రత్న–

రోజులు గడిచిపోతున్నై. ఆ నరకంలోనే ఐదు సంవత్సరాలు గడిచిపోయినై. ఒక రోజు ఆ వేశ్యాగృహం గోడలు విరిగి పడిపోయినై. పోలీసుల ఒక పటాలం తీసుకు ముగ్గురు నలుగురు పోలీసు అధికారులు లోపల ప్రవేశించారు.

అద్దాలు ముక్కలు ముక్కలైనై. సారా సీసాలో, గ్లాసులు చెల్లా చెదురు చేయబడినై, అప్పుడు సైదాబేగమ్ జుబేదాబీ, యముడులాగా క్రూరుడైన యాకుబ్‌ఖాన్ పట్టుబడ్డారు. ఆ వేశ్యాగృహంలో బంధించబడిన వాళ్ళు పోలీసు వాన్‌లోనో, పోలీసు కస్టడిలోనో, 'బెయిల్' లోనో కోర్టుకు తిరగాల్సొచ్చింది. రత్న ఐదు సంవత్సరాల తరువాత రోడ్డు చూచింది–ఆకాశాన్ని చూచింది.

ముందేమిటి? ఇక ముందేమిటి, కేసు విచారణ జరుగుతున్నది. ఆడవాళ్ళ సాక్ష్యం పూర్తయింది. సైదా, జుబేదా, యాకుబ్‌లకు ఎనిమిది సంవత్సరాల ఖైదు పడింది. కాని ఇక వాళ్ళు నిర్మించిన ప్రపంచం సంగతేమిటి? వీళ్ళ గతేమిటి? వీళ్ళంతా ఎక్కడికి వెళ్ళేట్టు?

వేశ్యాగృహం మీద దాడి జరిగేది కాదు. పోలీసులు యుద్ధంచేసి ఆ ముగ్గురు సైతానులనూ చీకటి కొట్లో పడేశారు. మంచి పని జరిగింది. పోలీసులకు ధన్యవాదాలు.

ఇక రత్న సంగతేమిటి? ఛల్లీ సంగతేమిటి? సోనీ సంగతేమిటి? ఛమియా సంగతేమిటి? వాళ్లలాంటి అనేక మంది ఇతరుల సంగతేమిటి? ఎవరు వాళ్ళని ఇంటికి రానిస్తారు? తండ్రి– అలాటి కూతురునీ, సోదరుడు అలాటి సోదరినీ ఇంట్లోకి రానివ్వరు. అలాటి స్త్రీని, భర్త చడబాది బయటకు వెళ్ళగొడతాడు. వీళ్ళంతా ఎక్కడికి వెళ్లేట్టు?

పూర్వం - ఒక ఖైదులోంచి పదహారు వేల మంది స్త్రీల ఉద్ధరణ జరిగింది. కాని ఇది కలియుగం.

రత్నని ఎత్తుకొచ్చినప్పుడు ఆమె వయస్సు ఇరవై సంవత్సరాలు. ఆమె కన్న మూడు సంవత్సరాల ముందు ఎత్తుకొచ్చిన ఛల్లీ వయస్సు అప్పటికి గొన్లు తొడుక్కునే యీడే - పన్నెండేళ్ళే. అడుకొనే వయసులోనే భగవంతుడు ఆమె ఆట నిర్ణయించాడు.

మిగతావాళ్ళు ఎక్కడికెళ్ళారో ఎవరికి తెలుసు? రత్న కెలా తెలుసు? ఛమియా అన్నది; "మనల్ని ఇంటి కెవరు రానిస్తారు? కష్టపడి పొట్టపోసుకోవటం మన వల్ల అయే పనికాదు. మనం గిన్నెలూ బొన్నెలూ కూడా తోమలేము. ఇళ్ళకు వెళ్ళి వాళ్ళ పరువు

ప్రతిష్ఠలకు విఘాతంచేకంటే, వచ్చినదోవనే వెళ్ళటం మంచిది."

ఛల్లీ వప్పుకున్నది. ఆమెకు తండ్రీ లేడు, తల్లీ లేదు. చుట్టాల ఇంట్లో ఉంటూ, ప్రాణాలు కడబట్టేటట్లు పనిచేయటం దొరికిన ఏ ముక్కో, దెబ్బలతోబాటు మింగటం. ఇక అదికూడా దొరకక పోవచ్చు.

కాని రత్న ఉండే ఛల్లీ ఉండేది. రత్న ఎక్కడికి వెళితే ఛల్లీ అక్కడికే వెళ్ళేది.

రత్న అన్నది — "నేను నీ గిన్నెలు తోముతాను నీ జడ వేస్తాను, వళ్ళు తోముతాను, కాని వృత్తి మటుకు చెయ్యను—" అన్నది. ఛల్లీ దానికి వప్పుకున్నది. కాని కేసప్పుడు నాయకుడు రత్నని చూచాడు, రత్నమీద అతని మనసు నిలిచింది. నాయకుడు తేపతేపకూ ఊరికే వచ్చి వెళ్ళసాగాడు. ఒక్కొకప్పుడు ఆకులు తిని వెళ్ళేవాడు. ఒక్కొకప్పుడు రత్న పాట విని వెళుతుండేవాడు.

ఇవాళ నాయకుడు రావలసి ఉన్నది. రత్న వాళ్ళ ఊళ్ళో జాతరకు వెళ్ళిరావల్సి ఉన్నది. అతనిచేత వట్టు వేయించింది— "జాతరకు వెళ్ళి మా అబ్బాయి క్షేమ సమాచారం కనుక్కురా—"

నాయకుడు వప్పుకున్నాడు.

వెలుగు వచ్చింది. తెరమీద ఆట అయిపోయింది. రత్న లేచి బయలుదేరింది. ఆమె ఇంటికి వచ్చేటప్పటికి; వచ్చినవాణ్ణి పంపించి ఛల్లీ ఊరికే ఉన్నది.

రాత్రి పదకొండింటికి నాయకుడు వచ్చాడు రత్న కొడుకుసంగతి చెప్పాడు —

"పిల్లవాడి తండ్రి సారా తాగితాగి చచ్చాడు. కాని ముసలిది పిల్లవాడ్ని సంరక్షిస్తున్నది. వాడు స్కూలుక్కూడా వెళుతున్నాడు. స్నేహితులతో జాతర కొచ్చాడు. నేను ముద్దు చేశాను. జిలేబీ, బజ్జీలు కొనిచ్చాను. జాతరంతా వాడితోనే తిరిగాను. క్షణంలో ఫొటోతీసేవాడి దగ్గర ఫొటో కూడా తీయించుకొచ్చాను — ఇదుగో — తనివితీరా చూడు నీ బాబును—"

రెండు సంవత్సరాల వాడప్పుడు చూచింది తల్లి, ఫొటోలో పిల్లాడు పది సంవత్సరాలవాడు. ఐనా తల్లి, పిల్లవాడ్ని మరిచిపోతుందా? వేలు చూపిస్తూ—"ఇదుగో నా బాబు" అని ఫొటో హృదయానికి హత్తుకుని నవ్వటం, ఏడవటం మొదలు పెట్టింది.

మధ్యలో ఛల్లీ అడిగింది— "పిల్లవాడిని తల్లి గుర్తుందేమో అడిగారా?"

"లేకపోతే—!" నే నన్నాను; అమ్మను గుర్తుపడతావుట్రా—?" — వా డన్నాడూ; "ఊహు! కాని, మాబామ్మ అంటుంది— మీఅమ్మ చాలా మంచిదిరా బాబూ—"

"ఎలా చనిపోయిందిరా?" అన్నానేను.

"నదిలో మునిగి చచ్చిపోయింది. కొట్టుకుపోయింది."

* * *

ప్రొద్దున్నే నదఒడ్డున జనం గుమిగూడారు. పోలీసులు జనాన్ని చెదర గొడుతున్నారు. జనం తప్పుకోగానే నాయకుడు శవం వంక చూచాడు. అతనికి అంతా తెలిసింది. ఆమె రత్న. కిందటిసారి వచ్చినప్పుడు రత్న నాయకుడితో ఉండటానికి వప్పుకున్నది. జాతరనుంచి అతను తిరిగి రాగానే అతనితో కలిసి అతనింటికి వెళ్ళాల్సింది. రత్న మొగుడుకూడా చనిపోయాడు.

నాయకుడు ఆనందంతో ఉన్నాడు. కాని జరిగిం దేమిటి?

నాయకుడికి తన మాటలే గుర్తుకొచ్చినై. 'నేనన్నాను, అమ్మ ఏలా చచ్చిపోయింది రా — అని. వాడన్నాడు నదిలో మునిగి చచ్చిపోయింది — కొట్టుకు పోయింది—'

ఛల్లీ వచ్చింది. కళ్ళల్లో నిండిన నీళ్ళన్నీ తుడుచుకోకుండా. రత్న కర్మ చేయటానికి నాయకుడుకి సహాయం చేసింది.

చితి భగ భగ మంటుండగా నది ఒడ్డున చాలాసేపు నడుస్తూ వెళ్ళింది.

సూర్యుడు పశ్చిమవైపుకు తిరిగాడు. సూర్యుడివంక చూస్తూ రెండు చేతులూ జోడించి ఛల్లీ అన్నది; "నువ్వు గుడ్డివాడివౌనో కాదో నాకు తెలియదు దేవా, రత్న చెప్పిందని చేతులు జోడిస్తున్నాను. వచ్చే జన్మ గాడిదజన్మో పందిజన్మో కలిగించు — కాని ఆడజన్మమటుకు వొద్దు—"

మరుక్షణం ప్రవహిస్తున్న నీళ్ళలో ఛల్లీ కలిసిపోయింది. ★

# సంగ్రహ ప్రకటనలు

### మల్లిగిరిపేట వాగు ప్రాజెక్టు

మెదక్ జిల్లా సంగారెడ్డి తాలూకా మల్లిగిరిపేట గ్రామ సమీపంలో మల్లిగిరిపేటవాగుపై ప్రాజెక్టు నిర్మించడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రత్యక్ష పరోక్ష ఖర్చులతో సహా రు. 11,33,000 లు మంజూరుచేసింది.

### మనుబోతులు, అడవిదున్నలకు రక్షణ

తూర్పుగోదావరిజిల్లా పాపికొండల ప్రాంతంలో వన్యమృగాల సంరక్షణకు అభయారణ్యాన్ని నెలకొల్పే విషయాన్ని, ప్రభుత్వం కొంతకాలంగా పరిశీలిస్తున్నది. ఈ పథకం బహుశా నాల్గవ ప్రణాళికలో నిధులు లభ్యమైనప్పుడు చేపట్టవచ్చును. ఈ లోగా ఆంధ్రప్రాంత మంతటిలోనూ మనుబోతులు, అడవిదున్నలు రక్షితమృగాలుగా ప్రకటించబడినాయి. తెలంగాణా ప్రాంతలో వీటిని రక్షిత జంతువులుగా ఇదివరకే ప్రకటించడం జరిగింది. వీటిని, నశించకుండా పరిరక్షించే నిమిత్తం యీ విధంగా ప్రకటించడమైనది. అందుచేత ఇప్పుడు యీ జంతువులను వేటాడటం, కాల్చడం, వధించడం, వాటి మాంసం, చర్మం, కొమ్ములు మొదలైనవాటిని విక్రయించడం నేరంగా పరిగణించబడుతుంది. నేరస్థులు చట్టంప్రకారం శిక్షింపబడతారు.

### ఆంధ్రప్రదేశ్
### బియ్యం సేకరణ ఉత్తర్వు రద్దు

1964 వ సం. ఆంధ్రప్రదేశ్ బియ్యం సేకరణ (లెవీ) ఉత్తర్వును ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం రద్దుచేసింది. అయితే యీ ఉత్తర్వుక్రింద లోగడ అమలుజరిగిన తీరుకు లేక, యీ ఉత్తర్వుక్రింద చేసిన పనులు, పొందిననష్టం; లేక సంక్రమించిన అధికారాలు, హక్కులు; ఒప్పందం, పైతెల్పిన ఉత్తర్వుకు వ్యతిరేకంగా చేసిన నేరాల సందర్భంలో విధించిన పెనాల్టీలు, జప్తులు; లేక ఏదేని పరిశోధన, న్యాయసంబంధమైన చర్యలు లేక పైనతెల్పిన హక్కు అధికారం, ఒప్పందం, బాధ్యత, పెనాల్టీ, జప్తు, న్యాయ సంబంధమైన చర్యలు; పరిశోధనల సందర్భంలో జరిగిన పరిష్కారం; లేక అటువంటి న్యాయవిచారణ, పరిశోధన లేక యీ ఉత్తర్వును రద్దుపర్చబడని పక్షంలో విధించే పెనాల్టీ జప్తులు, శిక్షలు, పరిష్కారం అమలు వాటికి యీ రద్దుఉత్తర్వు వర్తించదు.

### చేతిపరిశ్రమల విక్రయశాల

హైదరాబాదులోని ప్రభుత్వ చేతిపరిశ్రమలు, కుటీరపరిశ్రమల విక్రయశాల ప్రస్తుతం పనిచేస్తున్న విధానాన్ని పరిశీలించి ఇది సమర్థవంతంగా పనిచేయగలగడానికి వీలుగా తగుసూచనలు చేసే నిమిత్తం ప్రభుత్వం, రాణి కుముదినీదేవి అధ్యక్షతన ఒక సంఘాన్ని నియమించింది. ఈ సంఘంలోని ఇతరసభ్యులు వీరు:— శ్రీమతి భగవాన్‌దాస్, శ్రీమతి లిన్‌టన్, శ్రీ శంకర్జీ, (అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనసంఘం ఉపాధ్యక్షుడు), శ్రీ పతాప్ జె. మొర్ఫారియా (మేనేజర్, బొంబాయి స్వదేశీస్టోర్స్) సికింద్రాబాదు.

ఈ విక్రయశాల నిర్వహణను అభివృద్ధి పరచడానికీ, ఇది ప్రజలకు మరింతచక్కగా ఉపయోగపడడానికీ తాము చేయదలచిన సూచనలను యీ సంఘం అధ్యక్షురాలు (శివానందగృహం, 77, బేగంపేట, హైదరాబాదు. టెలిఫోను నెం. 72453)కు కానీ, లేక హైదరాబాదు -1 లోని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పరిశ్రమలు, వాణిజ్య శాఖ డైరెక్టరుకు కానీ అందజేయవలసిందిగా లేదా వీరిని సంప్రదించ వలసిందిగా ప్రజలకు విజ్ఞప్తి జేయబడుతున్నది. విక్రయశాలలో ఉంచిన సూచనల పుస్తకంలోకూడా తమ సూచనలను, అభిప్రాయాలను వ్రాయవచ్చు.

### వ్యవసాయ విశ్వవిద్యాలయ కళాశాలలు

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రి మొత్తానికివర్తించే 1963 వ సం. ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం చట్టంక్రింద ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జారీచేసిన ప్రకటనను అనుసరించి బాపట్లలోని వ్యవసాయ కళాశాల, తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర వ్యవసాయ కళాశాల, తిరుపతిలోని ఆంధ్ర పశువైద్య కళాశాల, హైదరాబాదులోని గృహవిజ్ఞానశాస్త్ర కళాశాలలు ఆంధ్ర విశ్వవిద్యాలయం, శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయం, ఉస్మానియా విశ్వవిద్యాలయాల ఆధీనంనుండి విడదీయబడి 1964 జులై 10 వ తేదీనుండి వాటిని క్రొత్తవ్యవసాయ విశ్వవిద్యాలయం

నిర్వహణలో ఉంచడం జరిగింది. అదే తేదీనుండి రాజేంద్ర నగర్‌లోని వ్యవసాయ కళాశాల, హైదరాబాదులోని పశువైద్య, పశుపోషణ విశ్వవిద్యాలయ కళాశాలలు ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆధీనంనుండి వేరుచేయబడి క్రొత్త వ్యవసాయ విశ్వ విద్యాలయ నిర్వహణలో ఉంటాయి. యీ వ్యవసాయ విశ్వవిద్యాలయం క్యాంపు ఆఫీసును హైదరాబాదు, సోమాజీగూడలోని 'దిల్‌ఖుష్' భవనంలో ఏర్పాటుచేశారు.

పరిపాలనాసంస్కరణల సంఘం

పరిపాలనా సంస్కరణల సంఘానికి నివేదనలు, సూచనలను స్వయంగా గానీ వ్రాతపూర్వకంగా గానీ, అందజేసేవ్యక్తులు తమ పేర్లను బహిర్గతం చేయరాదనే అభీష్టాన్ని వ్యక్తంచేసినప్పుడు వారిపేర్లను బహిర్గతం చేయరాదనే అభిప్రాయాన్ని పత్రికలలో వ్యక్తం చేశారు. నివేదిత అంశాలకు సంబంధించి నిర్మాణాత్మకమైన సూచనలు చేసేవారు తమ పేరునుగానీ ఇతర వివరాలనుగానీ వెల్లడించాల్సిన అవసరం లేదు.

శిస్తురెమిషన్ మంజూరి

కర్నూలు జిల్లా మార్కాపురం తాలుకాలోని 75 గ్రామాలలో 1373 ఫసలీకి సంబంధించిన మెట్టభూములపై శిస్తురెమిషన్ను దిగువ విధంగా ప్రభుత్వం మంజూరు చేసింది. 4 అణాలు అంతకుతక్కువ పంట దిగుబడి ఉన్న భూములపై పూర్తిరెమిషన్ 4అణాలకు మించి 6 అణాలు అంతకు తక్కువ పంట దిగుబడి ఉన్న భూములపై సగం రెమిషన్.

సహకార సంఘాలద్వారా

బియ్యం మిల్లుల ఏర్పాటు

బియ్యం మిల్లులను నెలకొల్పదలచిన దిగువ తెల్పిన సహకార మార్కెటింగ్ సంఘాలను (వాటి కెదురుగా ఇచ్చిన ప్రదేశాలలో) 1964 జులై 25వ తేదీనుంచి 1967 మార్చి 31వ తేదీవరకు అమలులో ఉండే 1958వ సం॥ బియ్యం మిల్లింగ్ పరిశ్రమల చట్టంలో 8వ సెక్షన్ నుండి ప్రభుత్వం మినహాయించింది.

శ్రీదేవి పెద్దతరహా సహకార సంఘం గుడకల్ (గుడకల్, కర్నూలుజిల్లా); కైకలూరు, సహకార మార్కెటింగ్ సంఘం (కైలూరు, కృష్ణాజిల్లా); కృష్ణాజిల్లా సహకార మార్కెటింగ్ సంఘం (విజయవాడ, కృష్ణాజిల్లా); కృష్ణాజిల్లా మార్కెటింగ్ సంఘం (గుడివాడ, కృష్ణాజిల్లా) బోధన్ సహకార మార్కెటింగ్ సంఘం (బోధన్, నిజామాబాదు జిల్లా); నాగర కర్నూల్ సహకార మార్కెటింగ్ సంఘం (నాగర్ కర్నూలు, మహబూబ్ నగర్ జిల్లా); పర్గి సహకారమార్కెటింగ్ సంఘం (పర్గి, హైద్రాబాదు జిల్లా); వరంగల్లు సహకార మార్కెటింగ్ సంఘం (వరంగల్లు, వరంగల్లు జిల్లా); నల్లగొండ సహకార మార్కెటింగ్ సంఘం (తిప్పర్తి, నల్లగొండజిల్లా) మల్కనూరు సహకార మార్కెటింగ్ సంఘం (మల్కనూరు, కరీంనగర్ జిల్లా).

1964వ సం॥ ఆంధ్రప్రదేశ్ వరి, బియ్యం (స్టాకుల ప్రకటన, రిక్విజిషన్) ఉత్తర్వు.

భారత రక్షణ చట్టంక్రింద ఆంధ్రప్రదేశ్ గవర్నరు, 1964వ సం॥ ఆంధ్రప్రదేశ్ వరి, బియ్యం (స్టాకుల ప్రకటన, రిక్విజిషన్) ఉత్తర్వును జారీ చేశారు. యీ ఉత్తర్వు తక్షణమే అమలులోకి వచ్చి ఆంధ్రప్రదేశ్ మొత్తం రాష్ట్రానికి వర్తిస్తుంది. యీ ఉత్తర్వు వివరాలను దిగువ యివ్వడం జరిగింది.

యీ ఉత్తర్వులోని 1, 2 క్లాజులు ఉత్తర్వు నిర్వచనం, శీర్షికలకు సంబంధించినవి.

వరిధాన్యం, బియ్యం నిల్వల ప్రకటన

ఈ ఉత్తర్వును ఆంధ్రప్రదేశ్ గజెటులో ప్రచురించిన 5 రోజులలోపుగా ప్రతి నిల్వదారు తమవద్ద ఉన్న లేక ఆధీనంలోవున్న వరిధాన్యం, బియ్యం నిల్వలను దిగువతెల్పిన అధికారికి క్రింద యివ్వబడిన షెడ్యూలులో ప్రకటించాలి. అనగా —

(1) (అ) హైద్రాబాదు, సికింద్రాబాదు నగరాలలోని వరిధాన్యం, బియ్యం నిల్వలకు సంబంధించి హైద్రాబాదు కలెక్టరుకుగానీ ఈ విషయంలో ఆయన అధికారం పొందిన అధికారికిగానీ.

(ఆ) ఇతర ప్రాంతాలలోని వరిధాన్యం బియ్యం నిల్వలకుసంబంధించి ఆయాతాలూకా సప్లై అధికారికి లేక అసిస్టెంటు తాలుకాసప్లై అధికారికి, అటువంటి అధికారుల్లేనిచోట్ల తహసీల్‌దారుకు లేక ఆ సబ్‌తాలుకా అధికార పరిధిలోని డిప్యూటీ తహసీల్‌దారుకు గానీ.

(2) ప్రతి నిల్వదారు ప్రతి 15 రోజులకు తమవద్దఉన్న లేక స్వాధీనంలో ఉన్న వరిధాన్యం, బియ్యం నిల్వలను తిరిగి ప్రకటించాలి. (1వ తేదీనుంచి 15వ తేదీవరకు; 16వ తేదీనుంచి నెలాఖరువరకు) యీ ప్రకటనలను పక్షం ఆఖరు అయిన మూడు రోజులలోగా సబ్‌క్లాజు (1)లో నిర్దేశించిన ప్రకారం దానిలో తెల్పిన అధికారికి అందే విధంగా పంపాలి.

(3) ఈ క్లాజు క్రింద తెల్పే ప్రతి ప్రకటన రెండు ప్రతులలో ఉండి అందులో అధికారి ధృవీకరణ ఉన్న ప్రతిని నిల్వదారుకు తిరిగి పంపాలి. ఆయన యీ ప్రతిని

ప్రకటన పంపినదానికి దృష్టాంతరంగా దీనిని ఉంచాలి.

వరిధాన్యం, బియ్యం

నిల్వల రిక్విజిషన్

(1) సందర్భాన్ని బట్టి కమీషనర్, జిల్లాకలెక్టరు, రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు జిల్లా సప్లై ఆఫీసర్, తహసీల్దారు, సబ్ తాలూకా ఇన్‌చార్జి డిప్యూటీ తహసీల్దారు, తాలుకా సప్లై ఆఫీసరు, లేక అసిస్టెంటు తాలుకా సప్లై ఆఫీసరు వ్రాతపూర్వకంగా ఇచ్చిన ఉత్తర్వు ననుసరించి ఆయన ఆదేశించిన ప్రమాణంలో నిల్వదార్లు తమవద్ద ఉన్న లేక స్వాధీనంలో వున్న వరిధాన్యం లేక బియ్యాన్ని కంట్రోలు ధరలకు ప్రభుత్వానికి విక్రయించాలి.

(2) ఈ క్లాజు క్రింద నిల్వదార్లకు జారీ చేసే ఏ ఉత్తర్వులయినా క్రింది విధంగా జరగాలి.

(i) ఆతనికి అంద జేయడం.

(ii) ఆతనికి అందజేయడం సాధ్యం కానప్పుడు అటువంటి నిల్వదారు ఏజంటుకు గాని, ఆయన కిందఉన్న ఉద్యోగికి గానీ, నిల్వదారుని కుటుంబంలోని వయోజన సభ్యునికి గానీ, ఆయన ఇంటి వెలుపలి ద్వారానికి లేక నిల్వదారు నివసిస్తున్నాడని తెలిసిన ఇంటి ఆవరణలో లేక ఆయన వ్యాపారంచేసే లేక లాభానికై స్వయంగా పనిచేసే ఆవరణలో ఉత్తర్వు ప్రతిని అంటించాలి.

(iii) రిజిస్టర్డు పోస్టుద్వారా.

వరిధాన్యాన్ని బియ్యంగా మార్చడం

ఈ ఉత్తర్వులోని అంశాలను అమలు చేయడానికి వీలుగా అవసరమని అభిప్రాయ పడినప్పుడు కమీషనరు, జిల్లాకలెక్టరు, లేక జిల్లా సప్లై ఆఫీసరు, వ్రాతపూర్వకమైన ఉత్తర్వుద్వారా ఆ ఉత్తర్వులో ఆదేశించిన ప్రకారం నిల్వదారువద్ద ఉన్న వరిధాన్యంలో నిర్ణీత ప్రమాణంలో నిర్ణీతరీతిగా బియ్యంగా మార్చడానికి నిల్వదారును ఆదేశించవచ్చు.

వరిధాన్యం లేక బియ్యం జప్తు

ఏ వ్యక్తి అయినా యీ ఉత్తర్వులోని అంశాలను ఉల్లంఘించిన తీరున ఆ నేరాన్ని విచారణచేసే న్యాయస్థానం, నిందితునికి చట్టంప్రకారం విధించబడే ఇతర శిక్షలతో ప్రమేయం లేకుండా, యీ విషయంలో నేరం చేశాడని ధ్రువపడినప్పుడు, వరిధాన్యం, బియ్యం నిల్వలను భద్రపర్చిన ప్యాకేజి, కవరింగ్‌లతోసహా ప్రభుత్వం జప్తుచేసు కోవడానికి ఆ కోర్టు ఉత్తర్వు చేయవచ్చు.

వరిధాన్యం, బియ్యంనిల్వల తనిఖీ, జప్తులు

ఈ ఉత్తర్వులోని అంశాలను సక్రమంగా అమలుజరిపే విషయాన్ని పరిశీలించడానికీ, నిర్ధారణ చేసుకోవడానికి కమీషనర్, జిల్లా కలెక్టరు, రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్, జిల్లా సప్లై ఆఫీసర్, తహసీల్దార్, సబ్ తాలూకా ఇన్చార్జిడిప్యూటీ తహసీల్దార్, తాలూకాసప్లై ఆఫీసర్, అసిస్టెంటు తాలూకా సప్లై ఆఫీసర్, సబ్ ఇన్స్పెక్టర్ హోదాకు తక్కువ కాని పోలీసు ఆఫీసరు యీ విషయంలో కమీషనర్, జిల్లాకలెక్టరునుండి అధికారం పొందిన యితర అధికారి దిగువ విధంగా తనిఖీచేయవచ్చు.

(అ) ఏదైనా పుస్తకాన్ని, లెక్కను, ఇతర పత్రాలు, ఏవైన నిల్వదారువద్ద, ఉన్న లేక స్వాధీనంలో ఉన్న వరిధాన్యం, బియ్యం నిల్వలను తనిఖీ చేయవచ్చు; లేక తనిఖీ చేయించవచ్చు.

(ఆ) అటువంటి లెక్కలను, ఇతర పత్రాలను జప్తు చేయవచ్చు.

(ఇ) వరిధాన్యం లేక బియ్యంరవాణాకై వినియోగించిన లేక వినియోగించదలచిన వ్యక్తిని, మోటారును, ఇతర వాహనాలను ఆపుచేయడం, తనిఖీ చేయడం లేక ఆపు చేయడానికీ, తనిఖీచేయడానికి ఏ వ్యక్తికైనా అధికారం ఇవ్వడం.

(ఈ) ఏదేని ప్రదేశాన్ని, స్థలాన్ని తనిఖీ చేయడం, ప్రవేశించడం, లేక ప్రవేశించ డానికీ, తనిఖీచేయడానికీ ఏ వ్యక్తికిఅయినా అధికారం ఇవ్వడం.

(ఉ) వరిధాన్యం, బియ్యం నిల్వల రవాణావిషయంలో యీ ఉత్తర్వును ఉల్లం ఘిస్తున్నట్టుగానీ, ఉల్లఘించ బోతున్నట్టు గానీ పైనతెల్పిన అధికార్లు అనుమానించి నప్పుడు అటువంటి వరిధాన్యం, బియ్యం నిల్వలను వాటిని పాకేజి కవరింగులతోసహా రవాణాకు ఉపయోగించబడిన జంతువులు, వాహనాలు, పాత్రలు, పడవలు, లేక రవా ణాకు ఉపయోగించే ఇతరాలను జప్తు చేయడం, ఏ వ్యక్తికయినా జప్తుచేయడానికి అధికారం ఇవ్వడం, ఆ తర్వాత జప్తు చేయబడిన ప్యాకేజీలను, కవరింగ్‌లను, జంతువులు, వాహనాలు, పాత్రలు, పడవలు, వగైరాలను కోర్టులో హాజరుపర్చడానికి చర్యలు తీసుకోవడం లేక చర్యలు తీసుకోవ డానికి అధికారం ఇవ్వడం, హాజరుపర్చ డానికి లోబడి వాటిని భద్రపర్చడం.

తప్పుడునిల్వలు ప్రకటించడం

3 వ క్లాజుక్రింద ప్రకటన చేయాల్సిన నిల్వదారు. తనవద్ద ఉన్న లేక అధీనంలో ఉన్న వరిధాన్యం, బియ్యం నిల్వలనుగూర్చి ఇచ్చిన ప్రకటన తప్పుడుగా ఉన్నయడల అతను యీ ఉత్తర్వును ఉల్లంఘించినట్టు భావించబడును.

కొన్ని సందర్భాలలో యీ ఉత్తర్వు వర్తించదు

దిగువ తెల్పిన వారివద్ద ఉన్న వరి ధాన్యం బియ్యం నిల్వలకు యీ ఉత్తర్వు లోని ఏ అంశాలు కూడా వర్తించవు.

(i) రాష్ట్ర ప్రభుత్వం, కేంద్రప్రభుత్వం

(ii) ఏదేని ఆసుపత్రి, విద్యాసంస్థలు, అనాధశరణాలయం.

(iii) ఈ సందర్భంలో రాష్ట్ర ప్రభుత్వం గానీ, కమీషనర్‌గానీ, జిల్లా కలెక్టరు గానీ ఉదహరించిన ఇతర వ్యక్తులు.

షెడ్యూలు (పై తెల్పిన 2వ క్లాజులో ఉదహరించిన)

(1) నిల్వదారు పూర్తి పేరు, చిరునామా.

(2) వృత్తి, వ్యాపారం.

(3) నిల్వచేసే స్థలం, స్థలాలు.

(4) (1) నిల్వపరిమాణం.

వరిధాన్యం. బియ్యం

(అ) స్వంతలెక్కపై

(ఆ) ఇతరవ్యక్తుల లెక్కపై

(ఇ) ఇతర వ్యక్తులతో భాగస్థులు.

(2) ఇతరవ్యక్తుల లెక్కలో నిల్వఉన్నవారి పూర్తిపేర్లు, చిరునామాలు.

ప్రతివ్యక్తి లెక్కలో ఉన్ననిల్వవివరాలు

ప్రతి భాగస్తునితో ఉన్న నిల్వవివరాలు.

పైన ఇచ్చిన వివరాలు నాకుతెలిసినంత వరకు నమ్మకంగా వాస్తవమైనవని ఇందు మూలంగా తెలియజేస్తున్నాను.

స్థలం :

సంతకం :

తేదీ :

---

# ప్రభుత్వ నిర్ణయాలు

✲ పారిశ్రామిక అవసరాలకు ఉపయోగించే ఆల్కాహాల్ పై డ్యూటీ విధింపును ఒక గ్యాలన్‌కు ఒక రూపాయినుంచి 9 పైసలు లేక ఒక లీటరుకు 2 పైసలకు తగ్గించడానికి ప్రభుత్వం నిశ్చయించింది. రాష్ట్రంలో పరిశ్రమలను ప్రోత్సహించే నిమిత్తం ఈ నిర్ణయం తీసుకున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో ఏటా సుమారు 141 లక్షల లీటర్ల ఆల్కాహాల్ ఉత్పత్తి జరుగుతున్నది.

✲ ఆర్థిక గణాంకములశాఖ ఉపయోగార్థం ఒక చిన్న ముద్రణశాలను నెలకొల్పుతారు. దీనికి అనావృత్తవ్యయం క్రింద రు. 1.92 లక్షలు ఆవృత్తవ్యయం క్రింద రు. 0.52 లక్షలు ఖర్చవుతుంది.

✲ భారతపోలీసు అధికార్ల శిక్షణ కళాశాలను నెలకొల్పేందుకు హైదరాబాదుకు సుమారు 5 మైళ్ళదూరంలో ఖపెడన్‌వద్ద 200 ఎకరాల స్థలాన్ని సమకూర్చడానికి ప్రభుత్వం నిర్ణయించింది. ఈ కళాశాల ప్రస్తుతం మౌంట్ ఆబూలో పనిచేస్తున్నది.

✲ భారత సైనికుల వ్యాజ్యాలచట్టం సవరణకు ఉద్దేశించిన ఒక ముసాయిదా బిల్లును ఆమోదించారు. దీనిమేరకు సాయుధ దళాలలో పనిచేసే సైనికులందరికీ వ్యాజ్యాలనుంచి రక్షణ కల్పించబడుతుంది. ఈ చట్టం ప్రస్తుతం సివిల్, రెవిన్యూకోర్టులలో మాత్రమే వ్యాజ్యాలకు వర్తిస్తున్నది.

✲ ఆంధ్రప్రదేశ్ సహకార మార్కెటింగ్ సమాఖ్య, స్టేట్‌బ్యాంక్ ఆఫ్ హైదరాబాదునుంచి రు. 60 లక్షల ఋణం పొందడానికి హామీగా వుండడానికై ప్రభుత్వం నిశ్చయించింది. వినియోగదార్ల సహకార సంఘాలకు వినిమయవస్తువులను సరఫరా చేయడానికి ఈ మొత్తాన్ని నిర్వహణధనంగా వినియోగిస్తారు.

✲ హైదరాబాదు మునిసిపల్ కార్పొరేషన్ కౌన్సిలర్లకు ప్రయాణభత్యంక్రింద రు. 75 లను, సిటింగ్ ఫీజు క్రింద రూ 50 లను ఇవ్వడానికి కూడా ప్రభుత్వం నిశ్చయించింది.

✲ వర్తమాన సంవత్సరంలో మరో 300 గీత పనివారల సహకార సంఘాలను నెలకొల్పుతారు.



# మహిళలు, మాతృదేశము

ఊటుకూరు శకుంతలాదేవి

తల్లి ఋణాన్ని నిశ్శేషంగా తీర్చడం ఎవరికీ సాధ్యమవదు. ఏ మాతృ గర్భము నుండి మనం జన్మించామో, ఏ తల్లి స్తన్యాన్ని గ్రోలి మనం యింత వారలమైనామో, ఏ పవిత్ర మూర్తి శల్యాల నుండి మన యెముకలు వారసత్వము నొందినవో, ఏ నిష్కళంకమూర్తి రక్తం మనలో నిరంతరం జవసత్వాల నిస్తుందో, ఆమె నిష్కళంకమైన, అవ్యాజమైన అనురాగం ముందు, ఎంత ఉన్నతుడైనా, నతమస్తకుడు కావలిసినదే. జీవితాంతం వరకు ఆమెను సేవిస్తూవున్నా ఆ ఋణశేషం ఇంకా పెరిగిపోతూనే వుంటుంది.

మన మంతా భారతమాతకు ప్రియమైన వీర పుత్రికలము. ఆమె పవిత్రమైన భూభాగంమీదనే మనం జన్మించాము. ఆమె ఒడిలోనే బాల్య యౌవన కౌమారదశలను గడుపుతున్నాము. ఆమె పచ్చటి పంటచేల నుండి మనకు అన్నోత్పత్తి జరుగుచున్నది. ఆడుతూ పాడుతూ ప్రవహించే ఆమె పవిత్ర నదీజలాలతో మనం దప్పిక తీర్చుకుంటున్నాం. కల్పాంతాలనుండి కృతజ్ఞత, విశ్వాసం మూర్తీభవించినట్లు నిలబడి, ఆమె హిమాలయం మనలను రక్షిస్తుంది, కాని ఆ మాతృమూర్తి ఈ నాడు అకస్మాత్తుగా కష్టాల పాలైపోయింది. భాయి భాయి అంటూనే మన శత్రువు మనపైన యుద్ధాన్ని ప్రకటించాడు. హిమాలయం గుండెలను చీల్చుకుంటూ వచ్చి వీరులైన మన సిపాయీల రక్తంతో హోళీ ఆడడానికి సంసిద్ధుడైనాడు. తన ముద్దుబిడ్డల, పవిత్రమైన శరీరాలు రక్తసిక్త మవడం చూచిన మాతృమూర్తి ఒక్కసారిగా కాతర స్వరంతో పిలిచింది. నాడు నాడులా స్తరస్తరాన ఆమె స్వరం ప్రతిధ్వనించింది. ఈనాడు యువతీ యువకులు తల్లికోసం ధన మాన ప్రాణ శక్తులను దానంచేయడానికి ముందుకు వస్తున్నారు.

మాతృదేశ గౌరవ ప్రతిష్ఠలను కాపాడడానికి ఆబాల వృద్ధులు మేలుకొని ముందుకు సాగుతున్నారు. త్యాగమూ, బలి, దానాల్లో అమూల్యమైన అమేయమైన భావన మేల్కొన్నది.

ఇటువంటి అత్యవసర సమయంలో మనం కూడా, భారతమాతకు పుత్రికలమైన మనంకూడా, మాతృభూమికోసం అన్ని విధాలా త్యాగాలను చేయడానికి మహాశపథం చేయవలసిన అవసరం నేడు ఆసన్నమైంది.

భారతమాతా! నీవు మా తల్లివి. నీ మనుగడకు ముప్పు సంభవించిననాడు మా ఉనికికూడా అసంభవమే.

ఇటువంటి సమయంలో కూడా స్త్రీలను వాళ్ళ బాధ్యతలనుండి విడదీయటానికి ప్రయత్నించడం దేశద్రోహమౌతుంది. ఈనాటి స్త్రీ శతాబ్దాలక్రిందటి మహిళవలె కేవలం గృహాలంకరణకు ఉపయోగపడిన సాధనం మాత్రమే...కాదు.

ఆమె ఈనాడు అన్ని పరిస్థితులలోనూ అన్ని రంగాలలోనూ పురుషులతో చేయి కలుపుతూంది. ఈనాడు అబలగా భావించబడే బలహీనతగా వ్యక్తమౌతుందా?

మనం మహిళలం. ఈనాడు మనమీది దురభిప్రాయాలను తుడిచివేసుకోవడానికి తగిన సమయం. దేశంయొక్క స్థితిగతులను క్షుణ్ణంగా ఆవగాహన చేసుకొని మన భూభాగాన్ని దిగమింగడానికి పొంచి కూర్చున్న శత్రువులను నిర్జించే కార్యక్రమంలో ముందడుగు వేయవలసిన అవసరం వుంది.

ఈనాడు ప్రగతిపథంలో పురోగమిస్తున్న అన్ని దేశాలలో స్త్రీలు మేల్కొని ఆర్థిక, సాంఘిక, రాజకీయ రంగాలలో పురుషులతోపాటు కలిసి నడుస్తున్నారు.

భారతదేశంలో మట్టుకు ధనవంతులు చదువు సంధ్యలు గలిగిన మూర్ఖులు స్త్రీలను కీలు బొమ్మలుగా భావించి తమ అహంభావాన్ని ప్రకటించుకోవాలనుకుంటున్నారు. తమ దర్పాన్ని నిలుపుకొనడానికిగాను స్త్రీలను అణగద్రొక్కివుంచి వాళ్ళను బలహీనులుగా చేస్తున్నారు. ఇది స్త్రీలపట్ల శతాబ్దాలుగా కొనసాగుతున్న దౌర్జన్యం. కాని పూర్వకాలంలో స్త్రీలకుకూడ సమాన ప్రతిపత్తిని కలిగించిన కాలం ఒకటి ఉండేది. అది క్రమేపీ క్షీణించిపోయి ఈ దురవస్థ సంప్రాప్తించింది.

స్వాతంత్ర్యానంతరం మహాత్మాగాంధీగారి బోధనలవల్ల ఒక విధమైన విప్లవం చెలరేగింది. ఆ కుమువుతో స్త్రీలు మేలుకొని మళ్ళీ తమకు ఉచితమైన స్థానాన్ని పొందటానికి ప్రయత్నం చేస్తున్నారు. కాని పురుషులలో ఒకతెగ ఈ లహరిని అణచివేసి స్త్రీలను యింకా బానిసలుగానే వుంచాలని ఆరాటపడుతూంది. అయితే ఈనాటి స్త్రీలను వంటయింటికి అంకితం గావించి మన భూభాగంనుండి శత్రువులను వెళ్ళగొట్టటమనేది సాధ్యమవదు. స్త్రీలు పురుషులు భుజం భుజం కలిపి నడిస్తేనేగాని శత్రువులను పూర్తిగా నిర్జించి మన స్వేచ్ఛా శాంతులను కాపాడుకోవడంపడదు.

ప్రతిస్త్రీ తన శక్త్యానుసారం తమ మాతృదేశం కొరకు పాటుపడగలదు. కళాభినివేశం ఉన్న మహిళలు తమతమ కథలద్వారా, ఉద్యోగాలద్వారా దేశ అవసరాలను గట్టెక్కించగలరు. అత్యవసర పరిస్థితిలో పురుషులు నిర్వహించగల ప్రతి కార్యక్రమాన్ని స్త్రీకూడా సమర్థవంతంగా నిర్వహించి తమ ఉపజ్ఞతను ప్రకటించుకోగలదు.

ఈనాడు మనం వ్యర్థ ప్రలాపాలతో సమయాన్ని నాశనం చేసుకోవడం మానుకొని స్వెట్టర్లు అల్లి అయినా మన మాతృభూమికి ఉడుతాభక్తిని సాయం చేయగలం. పొదుపులో మదుపులో మనం దేశాభివృద్ధిలో మన భాగాన్ని పంచుకోగలం. చాలామంది చెల్లాయిలు సంతసంతో మన దేశరక్షణ కోసం పోరాడే సైనికులకొరకు రక్తదానం చేయగలరు. మన గళాలకు నిగళాలుగా చేసుకుంటున్న ఈ బంగారపు నగలనుదానం చేయడం ద్వారా, తమ త్యాగాన్ని నిరూపించుకోగలరు.

స్త్రీ తుపాకి బరువును మోయలేని అబల అని ఆమె నాలుగు గోడలమధ్యనే తప్ప బాహ్య రంగాలలో ఎందుకూ కొరగాదని ఎవరైనా భావిస్తే అది వారి బుద్ధిహీనత తప్ప మరొకటి గాదు. గృహకృత్యాల్లో తమ బాధ్యతలను సక్రమంగా నిర్వహించే యువతులు దేశానికి చేస్తున్న సహాయాన్ని త్యాగాన్ని చేయలేరనడం మన దృష్టి మాంద్యాన్ని వ్యక్తం చేస్తుంది.

ఇప్పటికీ మనలో చాలామంది అలంకారం కోసమై సమయాన్ని వెచ్చించేవాళ్ళు ఉన్నారు. వాళ్ళంతా - మనం సింగారించుకొని కూర్చోవడానికే జన్మించలేదు. బాహ్య ప్రపంచంనుండి మనలను విడదీయడానికి ఇది మనలో పురుషులు కలిగించిన దురభిప్రాయమని తెలుసుకోవాలి.

దేశానికి అమూల్యాభరణమైన స్వేచ్ఛ ముందు మన తొడవులు మూల్య రహితములు. దేశభక్తిని మనసా వాచా కర్మణా నిరూపించే అవకాశం కలిగిన ఈ సమయంలో సోదరీమణులందరూ తమతమ ధర్మాన్ని నిర్వర్తించుకోవాలనీ, స్వేచ్ఛను, జీవితాన్ని కేవలం రూపాయి మాత్రంగానే భావించి తమ తమ జీవితాలను కూడా రూపాయి వంటి జడపదార్థంగా రూపొందించుకో వలదనీ నేను హెచ్చరిస్తున్నాను.

మనకింకా మానసిక స్వేచ్ఛ లభించలేదు. కొన్ని రంగాలలో మనదేశం ఎంతో వెనుకబడి వుంది. కారణం ? స్త్రీలలో వున్న బలహీనతే.

అన్ని రంగాలలోనూ స్త్రీలు పురుషులు కలిసి ముందడుగు వేసిననాడే మనం మన కాళ్ళమీద నిలబడి ఇతరుల నుండి సహాయాన్ని అపేక్షించే బదులు ఇతరులకే సహాయాన్ని చేయగలం. ఈనాడు దిన దిన ప్రవర్ధమానమౌతున్న శాస్త్రీయ విజ్ఞానాన్ని చూచి ఆశ్చర్యం కలుగుతుంది. ఈ విజ్ఞానం జాతీయ అంతర్జాతీయ సమస్యలను ఒక నూతన దృక్పథంతో అవలోకించే అవకాశాన్ని కలిగిస్తుంది.

పూర్వం తెగలు తెగలుగా విడివడిపోయి ఎదురు బొదురుగా యుద్ధాలు కొనసాగేతరి, పూర్వపు యుద్ధాలలో సైనికులు పోట్లాడటం, కొందరు చావడం, కొందరికి జయం లభించడమే నని ఒక అభిప్రాయం వుండేది, కాని శాస్త్రీయ విజ్ఞానం విస్తరించి క్రొత్త క్రొత్త పద్ధతులను ఆవిష్కరించిన ఈ రోజులలో ఆ అభిప్రాయం తలక్రిందులైపోయింది.

**ఈ రోజుల్లో యుద్ధమంటే ఒకదేశం మరొకదేశంతో పోరాడుతుంది. చివరకు రెండూ నాశన మవుతవి. ఇటువంటి సంగ్రామాల ఫలితంగా ఈ విజ్ఞానం, నాగరీకత కలిమిడి, ఈలోకం ధూమధామం అవుతుంది. మానవజాలం యావత్తూ సమూలంగా చెరిగిపోయే ప్రమాదంకూడా యిందువల్ల లేకపోలేదు.**

**వంద మెగాటన్నుల బాంబులు** గంటకు పదిపదిహేనువేలమైళ్ళ వేగంతో, భూగోళం చుట్టూ పరిభ్రమించేరాకెట్లు, చంద్రమండలాన్ని దాటబోయే కృతిమ గ్రహాలూ ఇవన్నీ యుద్ధంలో ఉపయోగింప బడిననాడు, ఈ ప్రపంచ స్థితిగతులు ఎలా వుంటవో, ఆలోచనాశక్తి వున్న ప్రతిఒక్కరూ చెప్పగలరు.

ఇటు విపత్కర పరిస్థితులలో స్త్రీలను బంధనాలలో బిగించి ఉంచడం పిచ్చిని, తెలివిహీనతను వ్యక్తం చేస్తుంది. సమత, స్వేచ్ఛ, న్యాయచట్టం స్త్రీ పురుషులను, సమానదృష్టితో చూచే ఆలోచనలను కొందరు అంధులు స్త్రీలను, మానవులుగా పరిగణించరు.

స్త్రీ బాల్యంలో తండ్రికి, యౌవనంలో భర్తకు, వృద్ధాప్యంలో కుమారునికి బానిసగా జీవించాలి. నేరాలలోకే రూఢి అయిపోయినట్లు భావిస్తారు. ఈ రోజులలో పెంపుడు జంతువులలా ఉపయోగించుకోవాలని చూస్తే ఆడవాళ్ళ అభివృద్ధికే గొడ్డలిపెట్టు అవుతుంది. కాని ఇటువంటివాళ్ళు అంగీకరించరు. మనముకూడా క్రొత్త క్రొత్త ఫేషనులను కనిపెట్టి అచరించడమే స్వేచ్ఛ అని భావించకూడదు.

సీత, సావిత్రి, ఝూన్సీవంటి పవిత్రమూర్తులు జన్మించిన ఈ దేశపు స్త్రీలు ఆటవస్తువులుగా బానిసలుగా ఉపయోగింపబడటం నేర్చుకొనగూడదు

మన సరిహద్దులమీద శత్రువులు చేరి వున్న ఈ సమయంలో స్త్రీలపై నియంతృత్వాన్ని చెలాయించేవాళ్లే హంతకులు శత్రువులకన్నా యిటువంటి పురుషుల వల్లనే దేశానికి ప్రమాద మెక్కువ.

ప్రపంచం అంటే బొమ్మల దుకాణం కాదు. ఒక ప్రయోగశాలవంటి దని మహిళలు నిరూపించాలి.

దేశరక్షణకోసం నాడు నాడులా స్త్రీ చాలా జాగృతమై దీక్ష వహించాలి. స్త్రీ హృదయం ప్రణయాలయమే అయినా, పరిస్థితులు మారినప్పుడు మహిళ ప్రళయ కాళికగా మారగలదు. మహిషాసుర మర్దని అయి అబలులను మరిపించగలరు. అనురాగశాలియైన సత్య ధనస్సు చేత ధరించినపుడు నరకాసురుడు విగతజీవు డవటం తథ్యమని నిరూపించుకోవాలి. జీవితమంటే కదలిక. శ్రమా చైతన్యం, బానిసత్వం, భయం, పరాధీనత, మృత్యువుకు మారుపేర్లు—



# వీ ర గ ళ ము

శ్రీరంగవరపు కేశవాచార్య

జై హిం దటంచును జయపెట్టరా ! దశ
దిశ లా ననంగ ప్రతిధ్వనింప
శపథమ్ము సేయరా ! స్వాతంత్ర్య రక్షణా
ర్థమ్ము నీ దేశ ఋణమ్ము దీర
ఆలింపరా ! భారతాంబ పిల్పును శీత
గిరినుండి వైరులఁ దరిమివేయ
వ్రాయరా ! వీరకావ్యము నేడు నీ జాతి
పౌరుష రుధిరస్రవంతి పొంగ

తలఁపరా ! నేడు రాణాప్రతాపసింహు
ఛత్రపతి బాలచంద్రుని ఝూంసిరాణి
నిలుపరా ! నేడు నీ జాతి నిండు గౌర
వంబు నీ ప్రాణ ధనముల బలి యొనర్చి !

రాజ భక్తి యన్న రామాయణము నాడె
ఉగ్గుపాల విద్య ఉడుతకైన,
గండిపడ్డ దదిగో వెండికోటను నేడు
గుండె లడ్డువెట్ట లెండి రండి !
కదన రంగమందు కోదమసింగం బయి
పోరి పోరి అమరవీరు డైన
భారతమ్మునాటి వీరాభిమన్యుని
*తమ్మి పిలుపు వచ్చె తరలిరమ్మ !

సింగము వంటివాడ నరి సేనలు నిన్ దొడగొట్టి బిల్వగా
సంగరభూమిలో దుమికి శాత్రవు గుండెల జీల్చిగాని నీ
కుంగల పౌరుషానలము కొంత శమింపదు; నేడు భారత
ప్రాంగణమందు నీచులు "సవాలుగ" నిల్వ నుపేక్ష సేతువే?

*తమ్మి=పద్మవ్యూహ మను ఒకర్థము, తమ్ముడా అను రెండవ అర్థము.

# ఘనకార్యం

గేయం :

కల్యాణసింగ్

తాత తండ్రులనాటి ఆస్తి
తాను గడించిన ఆస్తి
వెండి బంగారాలు
విలువైన వస్తువులు
సరిసమానంగా పంచిపెట్టాడు
సంపన్నుడొక వృద్ధుడు
తన ముగ్గురు కొడుకులకూ
తగవు లేకుండా.
వజ్రాలు చెక్కిన ఒక్క
పసందైన ఉంగరం
అమూల్యమైనదాన్ని మాత్రం
అట్టే పెట్టుకున్నాడు.

కొడుకుల్ని పిలిపించి
కొంతకాలం గడువిచ్చి
దేశమంతా చూచి
తిరిగిరమ్మన్నాడు.
ఎక్కువగా ఔదార్యం
ఎవరు చూపిస్తారో
వాళ్ళకే ఆ ఉంగరం
బహుమతి ఇస్తానన్నాడు.

పల్లెటూళ్లు పట్టణాలు
పలురకాల మనుష్యులు
అరణ్యాలు ఆశ్రమాలు
అందమైన నదీనదాలు
వాగులూ వంకలూ
వంకరటింకర బ్రతుకులు
కోటలూ బురుజులూ
గుళ్లు గోపురాలు
కొండలూ కోనలూ
గుట్టలు పల్లాలు
వింతలూ వినోదాలు
వివిధ కష్టసుఖాలు
చూచివచ్చిన తన కొడుకుల్ని
చూచి ఆనందించాడు తండ్రి.

పెద్దకొడుకు తన అనుభవాలు
వినిపించాడు మొట్టమొదట :
"ఒక ఊళ్ళో ఒకనాడు
ఒక పెద్దమనిషి వచ్చాడు.
నా ముక్కూ ముఖం తెలియకుండా
నమ్మకంగా నా దగ్గర
ఎంతో డబ్బు దాచిపెట్టి
ఎక్కడికో పోయాడు.
అతను మళ్ళీ వచ్చేదాకా
అతనిడబ్బు దాచాను.
డబ్బూ లేదు గిబ్బూ లేదని
దబాయిస్తే ఏం చేస్తాడు ?
అయినా తిరిగివచ్చి నన్ను
అడిగిన ఆ క్షణమే
దమ్మిడీలతోసహా అతని
సొమ్ము ఇచ్చివేశాను."
"ఎవరైనా అలాగే చెయ్యాలి;
ఇందులో గొప్ప ఏముంది ?
నీ ధర్మం నువ్వు చక్కగా
నిర్వహించావు అంతేకదా."
అని చప్పగా ఊరుకున్నాడు
న్యాయం తెలిసినతండ్రి.

తరవాత రెండవవాడు
తన సాహసం వర్ణించాడు:
"వరద పొంగి పొరలివచ్చి
వడివడిగా ఒక బిడ్డను
లాగుకొని పోతుంటే చూచి
వాగులో ఉరికేశాను.
నా ప్రాణం లెక్కచేయక
ఆ ప్రమాదంలోనుండి
అన్నెం పున్నెం ఎరగని
ఆ పాపను రక్షించాను."
"సెబాసు నీ సాహసం
చెప్పుకోదగిందే కాని
ఈ ఉంగరం పుచ్చుకోడాని
కింకా ఎంతో ఔదార్యం కావాలి."
అని ఊరుకున్నాడు
ఆ ముసలి మహనీయుడు.
ఇక మూడవవాడు చెప్పాడు ఈ
రీతిగా తన కథ :
"అది ఒక ఎత్తయిన కొండ
ఆ పక్క లోతయిన లోయ.
ఆ కొండమీద బండమీద
అలిసి నిద్రపోతున్నాడు
నా మీద పగపట్టిన
నా పరమ శత్రువు.
పాపం ! ఒక నిమిషంలో
పాతాళానికి పోవలసిందే
అయినా నా కెందుకులే
నాశనం కానియ్యి
అని ఊరుకోలేదు నేను
అతన్ని వెంటనే లేపాను."
"అదీ ఔదార్యం! అదీ మానవత్వం!"
ఉత్సాహంతో గర్వంతో
ఉప్పొంగిపోయాడు తండ్రి.
సంతోషంతో అతని ఒళ్ళు
సముద్రమయిపోయింది.
కౌతూహలంతో కొడుకుని
కౌగిలించుకున్నాడు.
ఔదార్యానికి బహుమానమైన
అమూల్యమయిన ఉంగరం
ముద్దుకొడుకు వేలికి
ముచ్చటగా పెట్టాడు. ★

# అధ్యాపకుడు : అతని కర్తవ్య ప్రతిపత్తులు

అనుపూరు నాగభూషణరావు

చిత్రం వట తరోర్మూలే
వృద్ధోశిష్యాః గురోర్యువా
గురోస్తు మేనం వ్యాఖ్యానం
శిష్యోస్తు, ఛిన్నసంశయః

గురువులకు గురువైన భగవానుడు దక్షిణామూర్తిని గురించిన ప్రశంసావాక్యములివి. గురుని మహత్వపూర్ణమైన ప్రభావమును భారతీయు లేనాడో గుర్తించినారనుటకీ దర్శనీయమైన ప్రశంసయే తార్కాణము. మాతాపితరుల తరువాత వంద్యుడైనవాడు గురువు. 'ఆచార్య దేవోభవ' అని నమస్కరించు మన ఆచారము ఈనాటిది కాదుగదా. దేవగురుడు బృహస్పతి, ఉపనిషదృషులు, ఆదికవి వాల్మీకి, ఆచార్య సాందీపని, ధనుర్విద్యా గురువైన ద్రోణాచార్యుడు మొదలైనవారితోడి పరంపర ఒక్కసారిగ మనస్మృతి పథంలో మెదిలి గురువును గూర్చిన స్పృహ మనలో రూపుకట్టి మనకు తెలియకనే ఒక నమ్రత, ఒక స్నిగ్ధమైన వాత్సల్యభావము పులకరించుననుట సత్యము. అట్టి గురుపరంపరయే భారతీయ విజ్ఞాన స్రవంతిని అనాదిగ, నిత్యనూతనముగ విస్తరింపజేసి సర్వమానవ జీవములను పరిపుష్టము జేయుటలో తన పాత్రను నిర్వర్తించుచున్నది.

నేటి అధ్యాపకుడును అనాదియైన ఆ ప్రాప్తన సంప్రదాయమునే దేశ కాల పాత్రములకనుకూలములగు పరిణామ పరివర్తనములతో ననుసరించుచున్నాడు. ఒకనాడు గురుముఖ నిష్యందియై మాత్రమే జ్ఞానము శిష్యకోటికి లభ్యమగుచుండెడిది. ఆ గురుడైనను సామాన్యుడు కాడు. సర్వవిద్యాప్రపూర్ణుడు. విజ్ఞాననిధి. నియమానువర్తనమున కతని జీవిత మొక మేలుబంతి. ఇక ఛాత్రులట్టి గురువుకడ వినయ వినమితులై శుశ్రూషలు జేయుచు జ్ఞాన సముపార్జనముతో బాటు జీవన నియమపాలనము ననుష్ఠించుటను గూడ నేర్చుకొనెడివారు. జ్ఞానము శీలము నను నీరెండును రెండు కనులుగా వారు జీవన ఘంటాపథమున పయనించుటకు వలసిన స్తోమత నలవరచుకొనెడివారు. బ్రహ్మచర్యానుష్ఠానము వారికీ స్తోమతను కల్గించెడిది.

అధ్యాపనముగూడ వైయ్యక్తికముగా సాగెడిది. బోధకు తోడు స్వాధ్యయనము కూడ అత్యవసరముగా నుండెడిది. నలందా, తక్షశిల, నాగార్జునకొండ మొదలగు విశ్వవిద్యాలయములలో కులపతియేగాక వందల కొలది ఆచార్యులును, వేలసంఖ్యలో విద్యార్థులును కలిసి మెలిసి విజ్ఞాన సత్రమును సాగించి రనుట కెన్నియేని ఆధారములు ఉన్నవిగదా. ఆ గురుకుల జీవన వైభవమును తలపోసికొనుట మనకు నూతనాలేశోత్సాహములను కూడగట్టుకొనుటయే యగును. కాని ఒక్క విషయము మరువరాదు. సామాన్య ప్రజానీకముతో పోల్చినచో నాడు విజ్ఞానార్జన పిపాసగలవారిసంఖ్య పరిమితమే ననవలె లౌకిక జీవనానుకూలములగు శిల్పము, ఆయుర్వేదము మొదలగు విద్యలు చతుష్షష్టి సంఖ్యలో నుండినను బ్రహ్మవిద్యయే పరమావధిగా నుండినదన్నను సత్యదూరము కాదు.

కాలము మారినది. పాశ్చాత్య దేశములలో నొక నూతన శకోదయమై విద్య దాని ధ్యేయములు, అనుష్ఠేయములైన పద్ధతులను గురించి యొక విప్లవమే ఆరంభమైనది. రూసో, పెస్టలాజీ, ఫ్రోబెల్ మొదలగు తాత్త్వికులు విద్యాబోధను గురించి, విద్యావిధానమును గురించి క్రొత్త క్రొత్త సిద్ధాంతములను ప్రతిపాదించి పాఠశాల యను సంస్థ కొక విశిష్ట స్వరూపమును కల్గించినారు. ''శిశు స్వాతంత్ర్యోద్యమమున''కు నాందియైనది. ప్రకృతియే పాఠశాలయని, ప్రకృతి దేశికత్వము తన యభిమతమని శిశువునకు విశృంఖల స్వేచ్ఛను ప్రతిపాదించిన రూసో అతివాదియై కన్పింపగా ఆనాటి ఇతర తాత్త్వికులీ వాదమునే అనేక రూపముల క్రీడయని, ఇంద్రియ శిక్షణమని అనేక ప్రతిపాదనలు చేసి శిశు శిక్షణమునకు చక్కని ధ్యేయములను ప్రయోగ పథకములను సమకూర్చినారు. మధ్య శతాబ్దములలోని కరుడు గట్టిన స్థితిని తొలగించి, పూర్వంపు స్వేచ్ఛాయుత వాతావరణము కొరకై చేసిన మహత్తర ప్రయత్నమే యిది. మునుపటి ధార్మిక విద్య ఈ ఆధునిక యుగమున సరిపోవుట లేదు. ప్రాకృతిక శక్తుల పరిశీలనము, వానినధఃక

రించుటకు వలయు శక్తి యుక్తుల నలవరచుకొనుట, ప్రతి శిశువు తనలోని సహజ గర్భితశక్తిని విస్ఫారితము చేసికొని పరిసర సహకారముతో అభ్యుదయము పొందుట ననునవే ఈ ఉద్యమములోని మూల సూత్రములు. విద్య యనగా విద్యార్థియొక్క సర్వాంగీణ వికాసమని మరల నొకసారి ప్రవచించుట జరిగినది. ప్రాచీన భారత ధ్యేయము దీనికి భిన్నము కాదని మనము గమనించు టవసరము.

ఈ ఉద్యమమున విద్యార్థి కేంద్ర మైనా దన్నంత మాత్రమున అధ్యాపకుని స్థానము, అతనివలన ప్రయోజనము తక్కువైనవని కాదు. అవి మరింత యుదాత్తములైనవి. విద్యార్థి పొందు స్వయంవికాసమున కతడు మార్గదర్శి. దోహదకారి. చేదోడు వాదోడు. అధ్యాపకుడు నిరంతర జాగృతితో అనుక్షణము ఆలంబము కల్పించుచుండిననే విద్యార్థిలోని విజ్ఞానలతిక ననలు కొనలుగా సాగి సహజగతి కనుకూలముగా విస్తరించును. అది లేకున్న నది కుంటు వడును. పూర్వ యుగములలో వలె విజ్ఞానము గురుముఖగతమై యుండుటకు బదులుగ అచ్చుయంత్రములు అసంఖ్యాక గ్రంథములను సిద్ధముచేసినప్పటికిని అధ్యాపకుని వ్యక్తిత్వమున కేమాత్రము న్యూనత కల్గలేదు. అది మరింత గురుతర మైనది. యంత్రములు మానవ నిర్మితములు. మానవ ప్రయోజనము నాశించునవి. వానిచే మన శ్రమ తొలగించుకొని పని సులువు చేసికొనగలమంతే. అందుకే యంత్ర యుగమునగూడ అధ్యాపకుని నిరంతర జాగృతి, సంచాలకత్వము విద్యార్థికి చుక్కానియై నిలిచినవి. ప్రతి విద్యార్థిలోని సహజాతముల నుదాత్తపరచి, ఉత్తమ గమ్యములను ప్రాపింప జేసి అటు వ్యక్తి జీవనము, ఇటు సామాజిక జీవనము సుఖమయముగా సాగుటలో అధ్యాపకుని బాధ్యత, అతని ప్రయోజనము, మునుపటి కంటె నధికము వైనవన్నను సత్య దూరముకాదు.

ఆధునిక శాస్త్ర యుగమున జీవనము సంకీర్ణము బహుముఖమునైనది. జనతయంతయు విద్యా ప్రయోజనము ననుభవింపవలెనను లక్ష్యము క్రొత్త క్రొత్త సమస్యలను తెచ్చిపెట్టినది. పూర్వ సంప్రదాయములోని మంచి జారిపోకుండ నిలబెట్టి ఆధునిక సంకీర్ణ జీవితమున కనుకూలములైన సరికొత్త ధ్యేయములను సంతరించి వానిని సాధింపగల విధానములను సమకూర్చుటకై నేటి యధ్యాపకుడు నిరంతర చింతనను సాగింపవలసి యున్నది. కోట్ల సంఖ్యకు విస్తరించుచున్న విద్యార్థితండములకు వలయు లక్షల పాఠశాలలలో అధ్యాపకు లవసరమై యున్నారు. ఒకప్పుడు కేవల జ్ఞాన ప్రధానమే ఆశయముగా నుండి ఐచ్ఛికముగ సంపదను గాక ఒక సాత్త్వక, జ్ఞానమయ జీవితమును వరించిన కొలదిమంది కాక జీవనోపాధి సాధించుట కొరకై శక్తి యుక్తులు చాలినను చాలకున్నను అధ్యాపక వృత్తి కెగబ్రాకు యువజను లొక క్రొత్త సమస్యను తెచ్చిపెట్టుచున్నారనుటలో సందేహము లేదు.

అసంఖ్యాకులుగ పెరుగుచున్న నీ యధ్యాపకులు మన ప్రాచీన గౌరవస్థానము నుండి అధ్యాపక వృత్తి దిగజారకుండ చూడవలసిన బాధ్యతను నేడు గుర్తింపవలసి యున్నది. రాష్ట్రిస్థాయిలోను, అఖిలభారత స్థాయిలోను జరుగుచున్న అధ్యాపకగోష్ఠులు, సదస్సులు కొంతవరకు వృత్తి సంబంధమైన సమస్యల పరిశీలనము చేసి వానికి తగు పరిష్కారములను సూచించుచునే యున్ననూ ప్రతి విద్యాలయము నొక ప్రయోగ పరిశీలన కేంద్రముగనై, ప్రతి అధ్యాపకుడును అంతరవలోకనమున నిమగ్నుడై ఆధునిక అవసరములను, వానికనుగుణమగు పద్ధతులను గురించి తెలుసుకొనుటయే గాక తనను తా నుద్ధరించుకొనుటకు సంసిద్ధత నలవరచుకొనవలెను. ప్రభుత్వము తగు ప్రోత్సాహ మిచ్చుచునే యుండును. అధ్యాపక సంఘములు, అధ్యాపక వ్యక్తులు వానిని సమన్వయ పూర్వకముగ నుపయోగించుకొనుచు వృత్తి కౌశలమును సాధింపవలసియున్నది.

ప్రపంచములోని దేశములలో నగ్రగణ్యమైన ప్రజాతంత్ర దేశము మనది. ప్రజాతంత్రపద్ధతి ప్రతిపౌరునిపై నొక గురుతర బాధ్యతను మోపును. భిన్నభిన్న దృక్పథములకు, అభిప్రాయములకు సామరస్యముతోటి సమన్వయ దృక్పథము ప్రతివ్యక్తిలో సమకూడిననే గాని ప్రజాతంత్రమునకు మనుగడ స్థిరముగా నుండదు. వ్యక్తి గౌరవము ప్రాతిపదికగా గల ఈ విధానము ఒక అపూర్వమైనరీతిగా మన దేశము లోనిప్పుడు ప్రయోగము నందుచున్నది. ప్రపంచములోని ప్రజలందరి దృష్టియు నేడు మనపైననే. శతాబ్దములుగ విచ్ఛిన్నశక్తుల వీరవిహారము వలన నీరసించిపోయిన ఈ నలుబదియైదు కోట్ల ప్రజానీకము, భిన్న మతములు, విభిన్నభాషలు, నను విభాజిక శక్తుల యొత్తిడిని తట్టుకొని, వాని నధిగమించి అభ్యుదయ పథంలో పురోగమించిననాడు గాని ఈ ప్రజాతంత్ర ప్రయోగము విజయవంతముకాదు. విజయవంతము కాగలదనుటకు సందేహము లేదు; కాని కేవలము వినాదములతో ఆ పని నెరవేరదు. ప్రతి పౌరుడును నడుము గట్టి కృతనిశ్చయుడై తనకు గల సాధక బాధకములను గుర్తెరిగి సవ్య

మైన మార్గమున నందరితో సహకరించుచు ముందడుగు వేయవలెను. కోటానుకోట్లుగ పెరిగిపోవుచున్న జనతకు ప్రాథమికావసరములను తీర్చుటకు కృషిచేయుటకు తోడు అందరిలో నొక మానవతా దృష్టి, ఒక విశాల సార్వజనిక భావము, ఒక ప్రగతిశీలమగు చిత్తవృత్తి, శాస్త్రీయ వైజ్ఞానిక ధ్యేయము అనునవి పాదుకొనునట్లు చూడవలసియున్నది.

ఈ గురుతర కార్యభారమును నిర్వహించుటలో నేటి అధ్యాపకుని స్థాన మేది? అతని పాలెంత? ఈ యుగలక్షణములలో నొక తెగ వ్యవస్థితములైన వాటి నన్నిటిని ప్రతిఘటించు చిత్తవృత్తి యువకులలో పెచ్చుపెరిగిపోవుచున్నవి. ఎక్కడ జూచినను అలజడి, ఆందోళన. పారిశ్రామిక యుగమున, వస్తు సమృద్ధిని సమకూర్చుటయే గాక వాని వినియోగ పద్ధతులను గూర్చిన భిన్న విభిన్న దృక్పథముల వలన నీ యలజడి ఆందోళనలు తప్పనిసరి యగుచున్నవి. ఈ యలజడి ఆందోళనలు విద్యాలయములకును ప్రాకినవి. పాతవిలువలు మారి క్రొత్తవి రానున్న సంధియుగమిది. ఇక్కడనే అధ్యాపకునకు ప్రాధాన్యము. ప్రాత క్రొత్తల మేలు కలయికను సాధించుటలో యువకులకు మార్గదర్శి కావలసినవాడు అధ్యాపకుడు. నాగరకత స్వరూపము, సంఘ స్వరూపము, అభ్యుదయ స్వరూపములను గురించి యువజనులకు తెలియజేసి వారి మస్తిష్కమున కొక యుదాత్తమైన పటుత్వమును చేకూర్చి కష్ట సహిష్ణుతను, సేవాభావమును, జీవ కారుణ్య దృష్టిని వారిలో నెలకొల్ప వలసినవాడు అధ్యాపకుడే. ప్రాత ఆచారములలో నేవి అనర్థకములో వానిని వదలుటకు వానిలో నేవి సార్వకాలికములై యుండదగినవో వానిని నిష్ఠాపూర్వకముగ నిలబెట్టుటయే గాక వానికి క్రొత్త రూపురేఖలను సంతరించుటకు గూడ యువజనులను సంసిద్ధులను చేయవలెను.

దేశము వసుంధరగా రత్నగర్భగా నున్నను, దారిద్ర్యము తాండవించుచున్నను. ఉత్తుంగ శృంగములు వ్రేళ్ళపై లెక్క పెట్ట జాలినవే కాని అగాధమైన లోయలు భయానకముగ నున్నవి అసంఖ్యాకములు. ఇదినేటి మన సమాజస్వరూపము. వీని నొక ఉదాత్త సమతలముగా నుద్ధరించు కార్యమిప్పుడు మనము చేపట్టియున్నాము. భూగర్భములోని ఖనిజసంపదను నదీ ప్రవాహములలోని జలసంపదను, అంతరిక్షములోని అవ్యక్త శక్తి సంపదను అన్నిటిని సన్నిద్ధము చేసి మానవాళి శ్రేయో సౌభాగ్యములకై వానిని ప్రభు చక్రవర్తులమై పితుక ప్రయత్నించు చున్నాము. ఈ పని నెవరు చేయగలరు? రానున్న తరముల వారు. నేటి యువజనులు. విద్యాలయములో నధ్యయనము చేయుచున్న నేటి బాల బాలికలు. వారికీ యత్నమున కవసరములైన మానసిక వ్యగ్రత హృదయ పటుత్వము. ధీశక్తి, క్షమ, నిర్విరామ కృషిపట్ల ఆసక్తి వీటిని కల్గించుటయే నేటి అధ్యాపకుని గురుతర బాధ్యత. ప్రజాతంత్ర మనుటతోడనే వ్యక్తికి పరిగణనము, వ్యక్తిలోని ఉదాత్త దివ్యత్వము నంగీకరించుటలు జరుగుచున్నవి. జనతలో ఒకఆస్తికభావము, దృశ్యమైన జగత్తున కతీతమై ఒక అదృశ్య నియమన శక్తి యున్నదన్న భావమును ప్రోత్సహింప వలసి యున్నది. దీనికి ప్రత్యక్ష ఫలితములుగ మాతాపితరుల యెడ పూజ్య భావము, పెద్దలైన యితరులపట్ల వినయము, దరిద్రులు, అగతికులునైన పరతంత్రులపట్ల ఆదరము కలుగగలవు. అందులకే ఆస్తికత ప్రజాతంత్రమునకు మూలకందమైన తత్వముగా నగుచున్నది.

ఈ భావములన్నియు వాని పాట కవియూడి పాడవు. గ్రంథములలో వీనిని గురించి యుండవచ్చును కాని వానికి సలలిత వ్యాఖ్యానము కూర్చి విద్యార్థులస్థాయికి వయస్సునకు తగినట్లుగ వాటిని పరివర్తనము చేసి హృదయంగమముగ నందించవలసిన వాడు అధ్యాపకుడు. నయనము లున్నను ఉపనయనములను సిద్ధముచేసిన ఆచార్య దేవునకు అనాదిగ మనము నమస్కారము చేయుచునే యున్నాముగదా. ఆ ప్రాచీనమైన ఆచార్యుల స్థానమును వారి కర్తవ్య దక్షతను సంస్మరించుకొని తమ కర్తవ్యమును నిర్వహించుటలో కృతకృత్యులు కావలసిన బాధ్యత నేటి అధ్యాపకులపై నున్నది.

పూజ్య నెహ్రూజీ మన భారతీయ జనతలో నొక వైజ్ఞానిక దృష్టి సమకూడవలెనని తుదివరకు కృషిచేయుచు తన జీవితములో వానిని నెలకొల్పి చూపినాడు. పారిశ్రామిక కర్మాగారములు, ఆనకట్టలు మన ఆధునిక దేవాలయము లనినాడు. వాని నిర్మాణములో, వాని నిరంతర జాగృతితోను సువ్యవస్థితములుగా కాపాడుటలో నియుక్తులైన మనమందరము దైవసేవా కార్యమున నిమగ్నులమైనట్లుగా భావనచేయుచు మానవసేవను చేయవలెనన్నాడు ఆ మహనీయుని యాశలు ఫలింపచేయునట్లు యువకులను తీర్చిదిద్దుటలో అధ్యాపకుని కృషి యెంత ప్రాముఖ్యము వహించుచున్నదో వేరుగా చెప్ప నవసరములేదు. వస్తు పరిశీలనములో నొక తాదాత్మ్యము, ప్రాత, క్రొత్త భావములపట్ల నొక తులనాత్మక దృష్టి, అభ్యుదయముపట్ల మమత, అపారమైన మానవతా దృక్పథము ఇవి వైజ్ఞానిక శీలమునకు

కొన్ని పట్టుకొమ్మలు. వీనిని నేటి బాలబాలికల లేత మనస్సులలో మొలకలెత్తించి పంటలు పండించవలసిన గురుతర బాధ్యత నేటి అధ్యాపకునిది.

బాధ్యతలన్నియు అధ్యాపకుని తలపైనే లేవు. జనతకూడా అధ్యాపకుని బాధ్యతలలో పాలు పంచుకొనవలయు నవసరమెంతైన కలదు అధ్యాపకుని గౌరవభాజన మగు ప్రతిపత్తిని సమకూర్చుట అన్నిటికన్న ముఖ్యమైన సమాజబాధ్యత. గౌరవభాజన మగు ప్రతిపత్తి ఆర్థికస్తోమత పైన ఆధార పడి యుండుట వాస్తవమే కాని అదియే పరమాధారము మాత్రము కాదు. అంత కంటె పరమాధారము మన దృక్పథములో నున్నది. అధ్యాపక వృత్తికి మనమిచ్చు గౌరవ పురస్సరమైన ఆదరము ముఖ్యము. ఇంజనీరువలె అతడు ఆనకట్టలు కర్మాగారములు నిర్మించి చూపలేడు; డాక్టరువలె శారీరక రుగ్మతను నివారించి ప్రదర్శింపలేడు. కాని ఇంజనీయరు, డాక్టరు నను సామాజిక సేవా పరాయణుల కా సేవా పరాయణత్వ సామర్థ్యమును కల్గించినవాడు అధ్యాపకుడు అతని తొలి సేవ వలననే ఆయా ప్రవీణుల సేవాభాగ్యము సమాజమునకు లభ్యమగుచున్నది. అధ్యాపకుడు ఆద్యుడన్నమాట. ఈ సత్యమును సమాజము గుర్తింప వలెను. గుర్తించుట మాత్రమే కాదు ఆద్యుడైన అధ్యాపకునకు, అతని వృత్తికి సమధికమైన పూజా గౌరవమును సమకూర్పవలెను. వస్తురూప మగు ప్రతిఫలము తరువాతది. అయినను అది తక్కువది మాత్రము కాదు.

ప్రాచీనమగు భారతీయ వైరాగ్యదృష్టి వస్తుప్రపంచము సాధించుచున్న ప్రగతికి తట్టుకొనలేకపోవుచున్నది. జీవితము దిన దినము వస్తు సంపన్నమగుచున్నది, యాంత్రిక సౌలభ్యము నభిలషించి నేటి నాగరక జీవనములో అధ్యాపకుడు కూడ పాలు పంచుకొనవలసినవాడే. అతని ఆర్థిక స్తోమత తగినంతగా వృద్ధియైనగాని అతని కీనాటి నాగరిక జీవనమును చూరగొనగల యోగ్యత కల్గదు. దీనిని సమాజము గుర్తింప వలెను. ఒక ప్రమత్తుడైన కార్మికు డొక నాటి వస్తూత్పత్తిని స్తంభింపజేసి తారుమారు చేయునేమో కాని ప్రమత్తుడైన అధ్యాపకుడు ఒక తరమునే అస్తవ్యస్తము చేయ జాలియుండును. దానివలన కలుగగల నష్టము వెంటనే లెక్కకట్టుటకు వీలుండదు. ఆ నష్టము ఊహించరానంత దీర్ఘ కాలిక మైనది. తనభౌతికావసరములు తీరని అసంతృప్తుడైన అధ్యాపకు డీ ప్రమత్త స్థితికి దిగజారు నవకాశమున్నది. ఈ ప్రమాదమును జనత అంగీకరించుటయే గాక దానిని నివారించుటకు తగిన సామనస్యమును కూడ ప్రదర్శింపవలెను. ప్రజాతంత్రములో అధ్యాపకుడు కూడ నొక వ్యక్తి. ప్రజా సౌభాగ్యము నంతటిని పాలు పంచుకొను నధికారము ప్రజా సేవలో పాల్గొను సాధనతోపాటు అతనికివి సంక్రమించుచున్నవి. కార్మికునివలె నతడు ప్రదర్శనలు చేయలేడు, చేయరాదుకూడ. కార్మికుని స్థాయికి దిగజారనీయక అతని సమస్యలను ముమ్ముందుగానే లెక్కలోనికి తీసికొని వాటికి తగు పరిష్కారములు కూడ అతడడుగకయే సమకూర్పవలసిన బాధ్యత సమాజముపైనున్నది. సమాజమునకు అధికారికమైన అంగము ప్రభుత్వము కాబట్టి ప్రభుత్వము అధ్యాపకుడు, అతని ప్రతిపత్తి అతనిని పీడించు సమస్యలు – వీనిని కూలంకషముగ ఎప్పటికప్పుడు పరిశీలించుచు పరిష్కరించుచు నుండు టవసరమై యున్నది.

మనది శ్రేయోరాజ్యము. సామ్యవాద దృక్పథముతోనభ్యుదయగామి యగు లౌకిక రాజ్యము. జనతా శ్రేయస్సును దృష్టిలో నుంచుకొని జనపదములనుండి మహా నగరములదాక విస్తరించు రీతిగా పంచవర్ష ప్రణాళికలను రూపొందించుటయే గాక వానిలో నిర్ణీతములైన లక్ష్యములను సాధించుటకై అపూర్వ కృషిని చేయుచున్నాము. ప్రణాళికలను రూపొందించవలసినవారు నిర్వహించి విజయము సాధింపవలసినవారు వ్యక్తులు, సమాజము, ప్రభుత్వము. ఈ త్రివిధ శక్తులకు కావలసిన శిక్షణము, మనోవికాసము, ఆర్జవనిష్ఠలు కల్గించుచున్న అధ్యాపకునిని కూడ విస్మరింపలేదు. నేటి మన అధ్యక్ష ఉపాధ్యక్షులు ఒకనాటి అధ్యాపకులు. అసలు ప్రపంచములోని అసంఖ్యాక తాత్త్విక వేత్తలు, వైజ్ఞానిక పరిశోధకులు, రాజకీయ నాయకులు ఆ అందరిలో నధిక భాగము అధ్యాపకులే. అది సమంజసము కూడ. సామాజిక జీవనమున నన్నిరంగములలోను అగ్రగాములై నాయకత్వము వహింపవలసిన బాధ్యత ఉపదేష్టలైన అధ్యాపకులదే ననుటకు సందేహ మేమున్నది! అట్టి అధ్యాపకుని శ్రేయస్సునుగురించి జాతియంతయు సంస్మరించుటకై అధ్యాపక దినోత్సవము నొక దానిని ప్రతి సంవత్సరము సెప్టెంబరు 5న నిర్వహించుట సముచితముగా నున్నది. ఆ నాడు అధ్యాపకు లాత్మ పరిశోధన చేసుకొనవలసిన అవసరమున్నది. తమ పైగల భారము, తాము చేయుచున్న కృషి, తమ సామర్థ్యము వీటిని తులనాత్మకముగ పరిశీలించి తమ కర్తవ్యమును గురించి నిర్ణయించుకొన వలసిన దినమది. ఇక సమాజము ప్రభుత్వము కూడ కంఠోక్తిగ అధ్యాపకావృత్తికి, అధ్యాపక వ్యక్తికి తమ కృతజ్ఞతను ప్రకటించి అతని సమస్యలను సాదరముగా పరిశీలించి పరిష్కరించుటకు తమ సర్వశక్తులను పునరంకితము చేయవలసిన దినము. అన్ని పక్షములకును అన్ని విధముల ఆనంద దాయకమైన దినమది. సామాజిక శ్రేయస్సు నాశించి కార్యవ్యగ్రులైన ఈ అందరును వినమితులై పరస్పర ప్రయోజనము నాశించి ఆత్మ పరిశోధనము చేసుకొని ఉత్తమ ధ్యేయములను పునః స్మరణము చేసుకొని ధ్యేయ సాధనమునకు పునరంకితు లౌటకన్న నానంద మేది యుండగలదు!



ఓం తత్ సత్.

# ప్రశ్నలు - సమాధానాలు

శ్రీ సత్యనారాయణ, మరి కొందరు; పార్వతీపురం, శ్రీకాకుళం జిల్లా.

ప్ర: దయచేసి ఆంధ్రప్రదేశ్ వాణిజ్య పంటల మార్కెట్ల చట్టం ఉద్దేశాలను, అందులోని ముఖ్యాంశాలను తెలియజేయండి?

సమా: రాష్ట్రంలోని ఆంధ్ర ప్రాంతంలో అమలులో వున్న 1963 సం. పు ఆంధ్రప్రదేశ్ వాణిజ్య పంటల మార్కెట్ల చట్టం, రాష్ట్రంలోని వాణిజ్య పంటల మార్కెటు విధానాలను మెరుగు పరచడానికీ, అందులకై మార్కెట్లను నెలకొల్పడానికీ అవకాశం కల్పిస్తున్నది. తెలంగాణా, ప్రాంతంలో అమలులో వున్న 1939 సం. పు ఫసలీ ఆంధ్ర ప్రదేశ్ (తెలంగాణా ప్రాంతం) వ్యవసాయ మార్కెటు చట్టం, రాష్ట్రంలో వ్యవసాయ పంటకు సంబంధించిన అన్ని ముఖ్యవస్తువులను, పశువులను అమ్మకానికి, కొనుగోలుకు మార్కెట్లను ఏర్పాటు చేసేందుకూ, అట్టి మార్కెట్ల సక్రమ నిర్వహణకూ అవకాశం కల్పిస్తున్నది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన తరువాత ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో అమలులోవున్న యీ రెండు చట్టాలనూ ఏకం చేయవలసిన అవసరం ఏర్పడింది. 1957 నవంబర్‌లో రాష్ట్రంలోని మార్కెటు సంఘాలన్నీ సమావేశమై యీ రెండు చట్టాల సమీకరణను గురించి చర్చించాయి. మార్కెటింగ్ శాఖ పనిచేసే తీరును సమీక్షించే నిమిత్తం 1954 లో హైద్రాబాద్ ప్రభుత్వం నియమించిన అడ్-హాక్ కమిటీ చేసిన సిఫారసులనూ, మద్రాసు రాష్ట్రంలో అమలులోవున్న మార్కెటింగ్ చట్టం తీరుతెన్నులను పరిశీలించి, వాటి అభివృద్ధికి సలహాలను తెలియజేయమని 1957 లో మద్రాసు ప్రభుత్వం నియమించిన నిపుణుల సంఘం చేసిన సిఫారసులనూ యీ సమావేశం పరిశీలించింది.

ఈ సమావేశంలోచేసిన నిర్ణయాన్ని ప్రభుత్వం పరిశీలించింది. 1933 సం. పు ఆంధ్ర ప్రదేశ్ (ఆంధ్ర ప్రాంతం) వాణిజ్య పంటల మార్కెట్ల చట్టాన్ని, 1939 సం. పు ఫసలీ ఆంధ్ర ప్రదేశ్ (తెలంగాణా ప్రాంతం) వ్యవసాయ మార్కెటు చట్టాన్నీ రద్దుచేస్తూ, ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయ పంటకు, పశువుల పశువులకు సంబంధించిన పదార్థాల అమ్మకం, కొనుగోలులను క్రమబద్ధం చేస్తూ ఒక కొత్త చట్టాన్ని చేయాలని ప్రభుత్వం నిశ్చయించింది. ఈ బిల్లులోని ముఖ్యాంశాలు:

(I) వ్యవసాయ పదార్థాలకు సంబంధించిన చట్టానికి పశువులు, ఆ పశువుల నుండి లభించే పదార్థాలకు-శుద్ధిచేసినవీ, చేయని వాటికి కూడా-వర్తింపజేయడం.

(II) ప్రస్తుతం లైసెన్సులు యిస్తున్న కలెక్టరు బదులు, ప్రకటించబడిన ఆయా ప్రాంతాలలోని ఆయా వర్తకులకు లైసెన్సులను మంజూరు చేసే అధికారాన్ని ఆయా మార్కెటు కమిటీలకు యివ్వడం.

(III) వివిధ సంస్థల అభిరుచుల మేరకు ఆయావ్యక్తులకు స్థానం కల్పించడానికి వీలుగా మార్కెటు సంఘం సభ్యుల కనిష్ఠ సంఖ్యను 12 గాను. గరిష్ఠ సంఖ్యను 16 గాను స్థిరీకరించడం.

(IV) పంటను పండించే వారికీ, పశువుల యజమానులకూ, వాటికి సంబంధించిన పదార్థాల అమ్మకందార్లకూ తగిన ప్రాతినిధ్యం కల్పించే నిమిత్తం సంఖ్యలో 50 శాతం వారి ప్రతినిధులకు ప్రాతినిధ్యం ఇవ్వడం.

శ్రీ బి. శేషగిరిరావు, మధిర, ఖమ్మం జిల్లా.

ప్ర: ఆంధ్ర ప్రదేశ్‌లో ట్రాక్టరు క్రింద సాగయ్యే పంటనేల ఎంత వుంది?

సమా: వ్యవసాయ శాఖకు సంబంధించిన ట్రాక్టర్లూ, బుల్‌డోజర్లూ ఏటా సుమారు 20,000 ఎకరాలను దున్నుతున్నాయి. ప్రయివేటు వ్యక్తుల ఆధ్వర్యం క్రింద ట్రాక్టర్లతో దున్నబడే భూమి వివరాలు తెలియవు.

శ్రీ పి. వెంకటఉప్పన్నరాజు, నరసన్నపేట, శ్రీకాకుళం జిల్లా.

ప్ర: శ్రీకాకుళం జిల్లాలో, ముఖ్యంగా నరసన్నపేట, సోంపేటలలో వరి బీజం, బోదకాలు తరచుగా వస్తూవుంటాయి. వీటి నివారణోపాయాలు, రక్షణ చర్యలు దయచేసి తెలియపరచండి.

సమా: తీసుకోవలసిన చర్యలు:

బోదకాలు మొదలయిన వ్యాధులకు కారణమైన దోమలు బురదనీటిలో వృద్ధి

చెందుతుంటాయి గనుక బురద నీటి గుంటల్ని గ్రామంలో లేకుండా చేయాలి. కాలువల్ని శుభ్రంగా వుంచాలి. మురికి నీటి గుంటల్ని సోకేజి గుంటలుగా మార్చాలి. అది సాధ్యం కానప్పుడు కనీసం ఆయిదారు రోజులకు ఒక సారి నీటిని తీసివేస్తూ వుండాలి. క్రిమిసంహారక మందుల్ని యిళ్ళల్లో చల్లుకొంటూ వుండాలి. పై జబ్బులు తగిలిన చిహ్నాలు ఏమన్నా కనిపిస్తే సాధ్యమైనంతత్వరగా తమ రక్తాన్ని పరీక్ష చేయించుకోవాలి.

ఈ జబ్బులకు ప్రత్యేకమైన చికిత్సలు అంటూ లేవు. జబ్బు తగిలిన తొలి రోజుల్లోనయితే హెట్రా జన్ కొంత వరకు నిరోధిస్తుంది.

రాష్ట్ర ఆరోగ్యశాఖ జాతీయ బోద వ్యాధుల నివారణ కార్యక్రమాన్ని నిర్వహిస్తూ వున్నది. అంటు వ్యాధులు ప్రబలే అవకాశమున్న ప్రాంతాలకు వెళ్ళి వాటిని నిరోధించే కృషిని వీరు చేస్తున్నారు. బోదవ్యాధి అంటువ్యాధిగా, ప్రబలిన ప్రాంతాల్లో ప్రజల రక్తాన్ని తరచుగా పరీక్షిస్తున్నారు. ఆరోగ్యాధికారి అధ్వర్యంలో యీ విషయాల్లో బాగా శిక్షితులయినవారు కొంతమంది పరిశీలనలు చేస్తున్నారు వీరికి తోడు భారత ప్రభుత్వం రాజమండ్రిలో ఒక బోదవ్యాధుల పరిశోధన కేంద్రాన్ని నెలకొల్పింది. ఆరోగ్యశాఖ అసిస్టెంట్ డైరెక్టరు అధీనంలోవున్న యీ సంస్థ, ఢిల్లీలోని అంటువ్యాధుల జాతీయ సంస్థ అధ్వర్యంలో పనిచేస్తుంది.



# రచయితలు

డా. బూర్గుల రామకృష్ణరావు, బర్కత్‌పూర, హైద్రాబాదు.

డా. బెజవాడ గోపాలరెడ్డి, కొత్తఢిల్లీ.

శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి, ఆంధ్రోపన్యాసకులు, మద్రాసువిశ్వవిద్యాలయం, మద్రాసు.

డా॥ సి. నారాయణరెడ్డి, ఆంధ్రోపన్యాసకులు, ఉస్మానియావిశ్వవిద్యాలయం, హైద్రాబాదు.

శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి, నెల్లూరు.

శ్రీ వేటూరి ఆనందమూర్తి, ఆంధ్రోపన్యాసకులు, సాయంకళాశాల, హైద్రాబాదు.

శ్రీ చెఱుకుపల్లి జమదగ్నిశర్మ, ఆంధ్రోపన్యాసకులు, ప్రభుత్వ కళాశాల, రాజమహేంద్రవరం.

శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, నాగార్జునసాగర్, మద్రాసు.

శ్రీ జి. కళ్యాణసింగ్, జర్నలిస్టు, హైద్రాబాద్.

శ్రీ చంద్రమౌళి, ఆజమాబాదు, హైద్రాబాదు.

శ్రీ మోచెర్ల రామకృష్ణకవి, అత్తితోట అగ్రహారం, నెల్లూరు.

శ్రీ పి. వి. మనోహరరావు, వంగర, కరీంనగర్ జిల్లా.

శ్రీ శ్రీరంగపురం కేశవాచార్య, గోషామహల్, హైద్రాబాదు.

శ్రీ యామిజాల పద్మనాభస్వామి, మద్రాసు.

శ్రీమతి ఊటుకూరు శకుంతలాదేవి, ఖమ్మం.

శ్రీ గడియారం రామకృష్ణకవి, అలంపురం.

శ్రీ ఏ. నాగభూషణరావు, హైద్రాబాదు.

శ్రీ కొలకలూరి ఇనాక్, అనంతపురం.

శ్రీ సింగరాజు లింగమూర్తి, హైద్రాబాదు.

శ్రీ పి. యస్. ఆర్. హైద్రాబాద్.

శ్రీ ఏ. రాజేశ్వరశర్మ, హైద్రాబాదు.

# గ్రంథ సమీక్ష

## సూర్యముఖి

[కర్త: శ్రీ స్ఫూర్తిశ్రీ. వెల: రూపాయి పావులా. ప్రాప్తిస్థానం: శ్రీ టి. భాస్కరరావు, ఎ. సి. కాలేజి, గుంటూరు. ప్రక్రియ: గేయ నాటికా సంపుటి. పేజీలు: 58.]

ఈ సంపుటిలో నాలుగు గేయ నాటిక లున్నాయి. అందులో 'సూర్యముఖి' 'రస సూత్రము', 'దీపశిఖ'—స్వతంత్ర రచనలు. ఇవి 'యువ', 'సాహితి' పత్రికలలో ప్రచురితాలు. 'సువర్ణద్వారం'-శ్రీమతి సరోజినీ నాయుడు వ్రాసిన 'Golden Threshold' ఆధారంగా రచితమయి, ఆకాశవాణిలో ప్రసార మయిన సంగీతరూపకం.

భాస్కరుని ప్రియురాలయిన సూర్యముఖి గుట్టుచప్పుడుకాకుండా జీవిస్తూవుంటే, వాళ్ల శృంగార జీవితం తెలిసీ తెలియని తోటి పూల చెలికత్తెలు వలపింప చేయబోయి వంచింపబడటం, అక్కడ పరామర్శలు, పరాచికాలు, పరాజయాలు, సూర్యముఖిలో చూపింపబడ్డాయి. స్త్రీ హృదయంవంటి పూలలో మార్దవం, పరిమళం కనిపించే రచన.

సృష్టి ప్రయత్నంలో ఉన్న బ్రహ్మ, సరస్వతి గానామృతంలో తలమున్కలయి, సృష్టిసూత్రం తెగిపోతుందేమోనని శంకించి ఆమెను వారించగా, జవాబు చెపితే ఏర్పడ్డ వాదోపవాదాలు నువ్వులేకుండా నేను, నేను లేకుండా నువ్వూ లేమనుకోవటంతో ముగిసే నాటిక రససూత్రం. స్త్రీ పురుషుల్లో అవినా భావసంబంధం చూపి, అద్వైతం ప్రబోధించే రచన. నాటకీయత ఉన్న నాటిక.

చీకటిని తిరస్కరించి, వెలుగును ఆహ్వానించే మానవుడులో మార్పు తెచ్చి, వెలుగునకు తల్లి చీకటి అని తెలిపే ప్రయత్నమే దీపశిఖలో కథ. ఉన్నత భావస్ఫూర్తి వున్న రచన.

భారతజాతి జీవన విధానం—దాని రూపురేఖలు రేఖామాత్రంగా చూపే రచన సువర్ణద్వారం. చరిత్ర స్వర్ణాక్షరాలుగా సువర్ణద్వారం రచించిన శ్రీమతి సరోజినీనాయుడు ప్రసక్తికూడా నాటికలో కనబడటంతో రచనలో స్వతంత్రత కనబడుతుంది.

శ్రీ స్ఫూర్తిశ్రీ రచనలో ఉన్నత భావా లున్నాయి.

'తాత్కాలిక సంతోషము
తాత్పర్య విహీనవాంఛ'

రచనలో అందమయిన పదాల పొందిక, సుందరంగా రసతుందిలంగా అనుప్రాస బంధురంగా వుంది.

'ఎవరే ఆ పుణ్యశాలి
వైవాహిక పుష్పమాలి
విస్ఫారిత నేత్ర కేళి
విజయోత్సవ కళాహేళి'

సువర్ణద్వారంలో తప్ప, తక్కిన నాటికలలో వ్యావహారిక భాష కాక గ్రాంధికమే ముద్రః ప్రయత్నిస్తే ఈ సంపుటిలోని అన్ని నాటికలు కొద్దిశ్రమతో నృత్య నాటికలుగా ప్రయోగించవచ్చు; ప్రదర్శనరక్తికట్టవచ్చు. గ్రంథాలయాలకేకాక, చదువుకోటానికి, పాడుకోటానికి, ఇది మంచి రచన.

కవిగా, నవలాకారుడుగా, వ్యాస రచయితగా పలువురికి పరిచయమయిన శ్రీ స్ఫూర్తిశ్రీ ఇతర రచనలలాగా ఈ సంపుటి పాఠకుల ఆదరణ పొందుతుందని భావించవచ్చు.

## మాట తప్పకు

[రచయిత. శ్రీ రావి వెంకటచలం, వెల: రెండు రూపాయలు. ప్రాప్తిస్థానం: ప్రవాసి ప్రచురణలు, ఆంధ్ర విజ్ఞాన సమితి, నిర్ది నివాస్, 'ఎమ్' రోడ్, బిష్టుపూర్, జమ్‌షెడ్‌పూర్, ప్రక్రియ: నాటకం, పేజీలు 104.]

విజయనగరం, రాఘవ నాటకం పోటీల్లో (1960), నర్సాపూర్ నాటక కళా పరిషత్తులో (1961), రాజమండ్రి లలిత కలానికేతన్ పోటీలో (1964), అనంతపురం, 23వ ఆంధ్ర నాటక కళాపరిషన్మహాసభలో (1964) ప్రదర్శింపబడిన ఈ నాటకం, రచనకు ప్రథమ బహుమతో, ద్వితీయ బహుమతో పొందుతూ వచ్చింది.

సత్యహరిశ్చంద్ర కథకీ, 'మాట తప్పకు' కథకీ భావంలో తప్ప కథలో సంబంధం లేదు. ఆడిన మాట తప్పకూడదనే భావం పైన అల్లుకుపోయిన రచనలో ధ్వనిగా అనాధలను రక్షించాలి అని వినిపిస్తుంది. ఒక అనాధకు అభయమిచ్చిన శంకరశాస్త్రి ఆ మాట ఏ పరిస్థితుల్లోను తప్పకుండా వుండటమే 'మాట తప్పకు'.

నాటకంలో ధర్మానికీ అనురాగానికీ సంఘర్షణా, మనస్సుకీ హృదయానికీ ప్రేరణా కలగగా, ధర్మమూ, మనసూ జయిస్తాయి అని చూపే రచన. చదివి చూడాలి. మాట తప్పకుండా అనాధను ఇంటిలో వుంచాలో, పుత్రప్రేమతో కొడుకును ఇంటిలో వుంచాలో అనే భావసంఘర్షణకు సంబంధించిన ఆలోచనలో ఆవేశం పాలు హెచ్చు.

ఈ నాటకంలో కొన్నిపాత్రలు జీవితం నుంచి దూరంగా పోతాయి. కొన్ని ఒకవైపు పోతే, తద్భిన్నంగా మరికొన్ని. మంచితనం తప్ప మరో గుణంలేని పాత్ర శంకరశాస్త్రి. దుర్గుణం తప్ప అన్యం ఎరుగని పాత్ర కామరాజు. మగాడి దుర్మార్గతకు బలికొనటం తెలియని స్త్రీ పాత్రలు తెరమరుగున విశాలాక్షి, తెరపైన శారద.

విశాలాక్షి తెర మరుగు జీవితానికికానీ, కామరాజు చివరికి మరణించటానికి గానీ, రామశర్మ ఇంటినుంచి పారిపోవటానికిగానీ, 'ఒక వ్యభిచారిణికి జన్మించి మాలదాని చేతుల మీదుగా పెరిగిన అనాధ'గా శారద పాత్ర సృష్టిలోగానీ కారణం అంతుచిక్కకపోతే శంకరశాస్త్రి పాత్రలో ఔన్నత్యం పోషించటానికే అనుకోకతప్పదు.

ఇంక శంకరశాస్త్రి "అగ్ని హోత్రం వంటి వాడు" "వేద పండితు డని పేరు పడ్డ విశిష్ట బ్రాహ్మణుడు" అయితే "వేద పాండిత్యానికి పరిణామం జాత్యహంకారం కాదు. జాతి ఐక్యత. వేదవిద్య గుర్తించేది కులగౌరవం కాదు. గుణ గౌరవం! తను అగ్రకులస్తుడ నని అన్యకులాలకు అతీతుడ నని గర్వించే బ్రాహ్మడు ఛండాలుడు కాని బ్రాహ్మడు కాడు" అంటాడు.

ఉత్తమ నటుడుగా నలుగురికీ తెలసిన శ్రీరావి వెంకటచలంరచయితగా ఈరచనలో నటనకు పుష్కలంగా అవకాశం ఇచ్చినట్లే! ంభాషణలు ఉపన్యాసాల్లాగా దీర్ఘంగా వున్నా చతురత చూపి, మెలుకువలు సాధించినట్లే!

ఒక్క స్త్రీ పాత్రతో ప్రదర్శనానుకూలతతో, పరిమిత సమయంలో ప్రయోగానికిది మంచినాటకం. పలుచోట్లు ప్రదర్శింపదగింది, పలువురు చదవదగిందీ ఈ నాటకం.

## ఆశాజ్యోతి

[రచయిత: శ్రీ చంద్రమౌళి. వెల: రూపాయిన్నర, ప్రతులకు: ఆంధ్రవిశ్వసాహితి 208, బోయిగూడా హైద్రాబాద్. ప్రక్రియ: కధానికలు పేజీలు-72

ఈ కధానికా సంపుటిలో, 'స్పర్ధ' 'ఆశాజ్యోతి' 'నాకువచ్చిన కథ' 'కొత్తగడ్డ' 'అసలురహస్యం' 'తామరాకూ-నీటిబొట్టూ' 'చుట్టరికం'- కథలున్నాయి. ఇవి వివిధ పత్రికలలో ప్రకటించ బడ్డాయి. ఒక కథ ఆకాశవాణిలో ప్రసారమయింది.

'స్పర్ధయా వర్ధతే విదా' అనేట్టుగా కార్ఖానా చిన్నదిగా వున్నప్పుడు పనివాడు, పెద్దదయింతర్వాత పనికి రాకపోతే పనికి వచ్చేవాళ్ళను కుదుర్చు కోవడంతో, స్పర్ధ కలిగి టెక్నీషియన్‌గా అగమయ్య అభివృద్ధి చెందిన కథ స్పర్ధ.

కాలక్షేపంకోసం రైల్వేస్టేషన్‌లో ఒక పాఠకుడు ఒక పత్రికలో ఒక కథ చదివి. ఆ కథలో ఆ స్త్రీ పాత్ర ఆ పరిస్థితుల్లో చనిపోతుందా?లేదా? ఐతే ఎందుకుచనిపోతుంది? అని ప్రశ్నించుకొని, అభినందించడం కోసం, అనుకోకుండా రచయితను చూడబోయి, రచయిత్రి అనితెలిసికొని, ఆమెచనిపోవటం చూచి, జవాబు గ్రహించి తిరిగి వస్తాడు. ఇది 'నాకు వచ్చిన కథ'

గుమస్తాగా బ్రతుకుతూ, ఆశలేక, ఆశయాలు త్రెంచుకొని, మత్తుడయిన శంకరం, రజని స్టెనోగాచేరి, ఆతని జీవితంతో పరిచయం ఏర్పరచుకోగా, ఆమె ప్రవేశంతో జీవితంలో ఆశాలేశం కనిపించి జ్యోతి వెలిగించుకొన్న యువకుడిలో చైతన్యం చెప్పే కథ- ఆశాజ్యోతి.

బెజవాడ, గుంటూరు ప్రాంతాలనుంచి, బోధన్ ప్రాంతాలకు పోయి, పొలాలు కొని, స్థిరపడి, కొత్త పద్ధతుల్లో వ్యవసాయంచేసి, వరి, చెరకు, పండించిన కొందరు స్థానికమైన చిక్కులు - రజాకార్ల దుండగాలు - ఎదుర్కొన్న కష్టనష్టాలు చూపించే రచన 'కొత్తగడ్డ'

ఉద్యోగంకోసం రెకమెండ్ చేయించాలని ఇద్దరు పెద్దమనుష్యులకు చెప్పిన విశ్వనాథం-తనకు ఉద్యోగం వాళ్ళవల్లనే వచ్చిందనుకొంటుండగా వాళ్ళ కొడుకులే తన తరగతివాళ్ళు కావటం- 'అసలు రహస్యం'

సుచిత్ర చిత్రమయిన యువతి. ఆమె విచిత్రత అర్థం చేసుకోలేదుసత్యం వీరిద్దరితో పరిచయమయి, అర్థంచేసుకో ప్రయత్నించి విఫలుడై పోతాడో యువకుడు-ఇది 'తామరాకూ-నీటిబొట్టూ.'

ముసలిదయిన సీతారత్నం పనిచేసే కార్ఖానాలో ఆమెబదులు ఎవరినయినా ఏర్పాటు చేయవచ్చునని తెలిసి పిల్లలులేని ఆమె ఆకాశీ ఏం చేసుకొంటుందని-వాళ్ళూవీళ్ళూ అడిగి రెండువేలదాకా ఖరీదు కట్టారు. కాని భర్తకు ఇష్టుడయిన బుచ్చిగాడికే ఇచ్చేందుకామె ఇష్టపడుతుంది-ఇది 'చుట్టరికం'

ఈ కథల్లో మామూలు అమ్మాయి - అబ్బాయి - ప్రేమ పద్ధతికథలు తక్కువ. అన్నికథలు సామాన్య కథలస్థాయి దాటి వున్నాయి. ప్రతికథకు పెట్టినపేరు చక్కగా

కుదిరింది. కథల్లోకథకంటే రచనలో మెరుగులున్నాయి. చెప్పే పద్ధతిలో నేర్పు కనబడుతున్నది.

ప్లాట్‌ఫారం మీద పాఠకుడి పాట్లు పెంచకుండా వుంటే 'నాకు నచ్చిన కథ' మన మంచికథల్లో ఒకటి అయివుండేది. 'కొత్తగడ్డ' లో జీవితంలోని పరిణామదశ, చైతన్యలక్షణం కనిపించాయి. ఇటువంటి కథలు అవసరం! 'తామరాకూ-నీటిబొట్టూ' యువకులలో అవ్యవస్థకు, అసంకల్పితాలకు నిదర్శనం - చక్కనికథ

ప్రతికథలోనూ ఒక సూక్ష్మ దృక్పథం వుంది. ప్రతి కథచివర కొసమెరుపు వంటి 'ట్విస్టు' వుంది. ఉత్సాహంతో సాగి, ఉత్సాహంతోనే కథలల్ని ముగిసి, రచయితను 'ఆప్టిమిస్టు' గా ఆశావాదిగా చూపిస్తాయి అనటానికి పుస్తకం నామం ఆశాజ్యోతి చక్కగా వుంది. ఒకటి రెండు కథల్లో తెలంగాణా భాష వుంది. రెండు మూడు కథల్లో తెనుగుదనం కనబడుతుంది, చదవదగిన కాథానిక సంపుటి.

## గాడితప్పిన జీవితాలు

[రచన: శ్రీ పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు, ఎం. ఎ; బి.ఇడి; వెల: రూపాయిన్నర. ప్రతులకు: శ్రీ పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు,ఎం. ఎ; బి. ఇడి; ఖమ్మం ప్రక్రియ: కథల సంపుటి పేజీలు: 98.

ఈ సంపుటిలో 'విధి బలీయం' గాడి తప్పిన జీవితాలు' 'గురు దంపతులు' అనే మూడు కథలున్నాయి.

ఉమామహేశ్వరరావు ఆఫీసరు దగ్గర శలవు తీసుకొన్నాడు. తోవలో వాన కురిసింది. వానలో తోలుబొమ్మలఆటగాళ్ళ' స్త్రీ కనబడింది. ఆమెను నది దాటించాడు. వూరూ పేరూ తెలియని తాత గుర్తుకు వచ్చాడు. చివరికి తాతే తన తండ్రి అని తెలుస్తుంది – 'విధి బలీయం'

విశ్వం హైద్రాబాద్, కోర్టుపనిమీద వెళ్ళాడు. చీకట్లో ఒకామె పిలిచింది. వేశ్య కావచ్చు అనుకొంటూ వెళ్ళాడు. వెళ్ళి చీకట్లో డబ్బుయిచ్చాడు. ఆమె దయనీయ చరిత్ర చెప్పింది. మిత్రుడిభార్య అని తెలిసింది. మరొక మిత్రుడి పరిచయంతో పుట్టిన బిడ్డ హాస్పటల్లో వున్నాడు. డబ్బు పుచ్చుకొని పిల్లాడిని రక్షించుకోడానికి వెళ్ళుతుంది పిల్లాడు చనిపోయాడు - 'గాడి తప్పిన జీవితాలు.'

చలమయ్య తహసీల్‌దారు. రోడ్డుమీద వృద్ధగురు దంపతులు కనిపించారు. ఇంటికి తీసుకువచ్చి గురుపూజ చేశాడు. భార్యకు ఇష్టంలేదు. అనరానిమాట లంటుంది. గురు దంపతులు ఇల్లు విడచిపెట్టారు. చలమయ్య బాధపడ్డాడు. గురు దంపతులు, ఇంట్లో వుండటానికి చివరికి భార్య అంగీకరిస్తుంది – 'గురుదంపతులు'

మూడోకథలో తప్ప. మొదటి రెండు కథల్లోనూ వస్త్వైక్యం లేదు. 'విధిబలీయం'లో మూడు కథాభాగాలున్నాయి. అవి గుమాస్తా – ఆఫీసరు కథ, గుమాస్తా – బిక్షగత్తెకథ, ఉమా మహేశ్వరరావు – తండ్రికథ ఇక 'గాడితప్పిన జీవితాలులో' విశ్వం – కోర్టు వ్యవహారం, ముఖ్యకథకు సంబంధించదు. వాక్యాలు క్లుప్తంగా వ్రాయటానికి వీలుండగా, అధికంగా సాగదీసినట్టు కనబడుతుంది.

గురు దంపతులు ఒక ఆదర్శం బోధించటానికి ఉద్దేశించిందిగా కనిపిస్తుంది. గురువును శిష్యుడు గౌరవించాలి, పూజించాలి అనే నీతిబోధ విలువలు దిగజారుతున్న సమయంలో అవసరమే! 'గాడితప్పిన జీవితాలు'లో చిట్టచివరకు పిల్లాడు మరణించటం బాధ కలిగిస్తుంది. 'విధిబలీయం'లో భిక్షగత్తె తేపతేపకు 'సాటిపిల్ల గుడిసెలో ఎట్టా అలమటించి పోతా వుండాదో' అని గుర్తుకు తెచ్చుకొనే కథాభాగం మెచ్చుతునక! మాతృమూర్తి హృదయవేదన కళ్ళకు కట్టినట్లు కనబడేభాగం!

కథా శీర్షికలు తగినట్లుగా వున్నాయి. రచయితకు ఏదో చెప్పాలనే ఉత్కంఠ వుంది. ఇతివృత్తం ఎన్నుకొనటంలో, ఏర్పరుచుకోవటంలో, వ్యక్తీకరించడంలో పొదుపువుంటే మంచికథలు వెలువడుతాయి.

## కల్పవల్లి (2వ భాగము)

(రచయిత: కృత్తివెంటి వెంకటేశ్వరరావు వెల: రూపాయిన్నర. ప్రతులకు: వెంకటేశ్వర గ్రంథమాల, గుడివాడ. ప్రక్రియ: పద్యకావ్యం పేజీలు: 62)

ఈ కావ్యంలో ఇరవైరెండు ఖండికలున్నాయి, ఇందులో 'మా బందరు' నుంచి 'భరతమాత' దాకా భక్తి భావాలూ; శ్రీ అక్కినేని నాగేశ్వరరావు, శ్రీ నీలం సంజీవరెడ్డి మున్నగు వారికి ఆహ్వానంగా వెల్లడించిన భక్తి భావాలూ; 'అవతార్ మెహర్' 'బాలాజీ' మొదలయిన శీర్షికల్లో వెలువరించిన భక్తిభావాలూ, 'కర్ణుడు' 'సుయోధనుడు' వంటివీ. 'గోదావరి' 'తెలుగుబిడ్డ' 'ఆంధ్రభీష్ముడు' వంటివీ, 'కవి' 'పెండ్లి' పద్యాలు వున్నాయి.

ఏ పద్యాలు ఏ పత్రికలో ప్రచురింపబడిందీ, లేదా ఏ విధంగా ప్రసారమయిందీ, ఎక్కడి కక్కడే వ్రాయటం – ఒక ప్రత్యేకతగా కనిపిస్తుం దీ కావ్యంలో. పద్యాలలో ఛందస్సుంది. యతిప్రాసలు తప్పలేదు. అక్కడక్కడా యదాగమాలలో, సమాసా

లలో, సంధులలో తప్పులు దొర్లాయి. ఒకటి రెండు చోట్ల ఊహించిన దానికి వ్యతిరేకాభి ప్రాయం స్ఫురించవచ్చు.

పద్యరచనలో ధారాశుద్ధి వుంది. 'సముద్రుడు' 'శ్రీ కృష్ణదేవరాయలు' వంటి చక్కని రచనలున్నాయి ఈ కావ్యంలో. ప్రసిద్ధాంధ్రకవులపద్యాలనడకలో, పద్ధతిలో, ఎత్తుగడలో పద్యాలు వ్యాయాలనుకోవటం ఒక విధంగా మంచిదే:- ఆ ప్రయత్నం కనిపిస్తుం దీ కల్పవల్లిలో. శ్రీకృత్తివెంటి వెంకటేశ్వరరావుకు భవిష్యత్తు ఆశించవచ్చు.

## ప్రియాన్వేషణము

[మూలం: ద్రావిడ కవి తిరుమంగై ఆళ్వార్లు, అనువాదం: శ్రీమాన్ మాడభూషి గోపాలాచార్యులు. ప్రకాశకులు: శ్రీ గోదా గ్రంథమాల శ్రీ మన్నారాయణపురము, ఉల్లిపాలెం పోష్టు, దివి తాలూకా, కృష్ణా జిల్లా వెల: రూపాయి పావులా. ప్రక్రియ: పద్య కావ్యం పేజీలు 50]

ఇందులో ప్రియాన్వేషణము, మహాన్వేషణము అనే రెండు కావ్యాలున్నాయి. అవి శిరియ తిరుమడల్ పెరియ తిరుమడల్ ప్రబంధాలకు అనువాదాలు.

ప్రియాన్వేషణము శృంగార భావాలతో వుండి, మానవ జీవనంలోని తొలిదశను చూపిస్తుంది.

మహాన్వేషణము భగవద్భక్తి భావాలతో వుండి మనుష్య జీవనంలోని మలిదశను చూపిస్తుంది.

ఈ రెండు ప్రబంధాలు పూర్ణ మానవుడి జీవితదశలు ప్రస్ఫుటంగా చూపుతున్నాయి.

అనేక వృత్తాలతో, సులభశైలిలో, కొంత రసవత్తరంగా కొంత సుందరంగా సాగింది రచన. అక్కడక్కడా వ్యర్థ పదాలు, గణయతి భంగాలు, తప్పు పద రూపాలు ఉన్నా, ముముక్షువులకీ ప్రబంధాలు ప్రీతిపాత్రాలే!

## శ్రీరామానుజ శతకము

[రచన: శ్రీమాన్ తి॥ న॥ చ॥ సం॥ జ॥ తి॥ వెంకటాచలం. వెల: అర్ధ రూపాయి ప్రతులకు: శ్రీ గోదా గ్రంథమాల శ్రీ మన్నారాయణ పురము. ఉల్లిపాలెం పోష్టు, దివి తాలూక కృష్ణా జిలా. పేజీలు: 20.]

శ్రీ వైష్ణవ సంప్రదాయ బద్ధులకు శ్రీ రామానుజులు దైవ స్వరూపులు. యావత్ భారతావనికి విష్ణురూపం తెలిపి, తాను తరించి, దేశాన్ని తరింపచేసిన పుణ్యులు శ్రీ రామానుజులు.

ఇది 'శ్రీరామానుజా!' మకుటంతో వ్రాసిన శతకం. రచనలో ధారాశుద్ధి వుంది. పాండితీ ప్రకర్షస్పష్టం. భాష మృదువుగా హృదయంకొలదిగా పులకించే భావయుతంగా వుంది.

ముద్రారాక్షసాలు ఉన్నా, ఏ పద్యం ఎక్కడ పూర్తయి ఏ పద్యం ఎక్కడ ప్రారంభం అవుతుందో తెలుసుకొనేందుకు ప్రాస మకుటం తప్ప మార్గాంతరం లేక పోయినా భక్తి భావ ప్రేరితు లీ శతకం చదవవచ్చు.

'కొలకలూరి'

## జలజ

[గేయకవితలు, రచయిత: శ్రీ కాట్రగడ్డ లక్ష్మీనరసింహారావు. స్నేహపీఠం, అమీనా పేట, పలూరు వారి ప్రథమ కుసుమం. 16 పేజీలు 35 పైసలు.]

ఈ లఘు సంకలనంలో మొత్తం 13 ప్రగతిశీల దేశభక్తి గేయాలున్నాయి. అన్వర్థంగా ఇందులోని రచనలన్నీ పాడుకోడానికి వీలుగా లయబద్ధంగా నడిచాయి. రచయితలో గల భావుకతాశక్తిని మించిన ప్రోత్సాహం ప్రతి గేయంలోను తొంగి చూస్తుంది.

"విప్లవగీతం" అనే గేయంలో కార్మికుల్ని ఉద్దేశిస్తూ రచయిత "మూర్ఖులపంతం మరలే తరుణం, దూర్తుల దౌష్ట్యాల్ తరలే సమయం, అభ్యుదయం చవిచూడగ సఖ్యతనే సరిచేయగ, వస్తున్నది, వస్తున్నది. త్వరలోనే" అని ఆశావాదాన్ని పూరిస్తారు. అందులోనే "శోకంలేని లోకం చూడగ, స్వేచ్ఛగలట్టి వృద్ధిని ఏలగ, కుండలనిండా అన్నం వండే కడుపులు నిండే యుగానికి హలాలు పట్టుకు కలాలు పట్టుకు సుత్తులు శానం సర్వం పట్టుకు రైతుల్లారా రచయితలారా కార్మికులారా పదండి ముందుకు పదండి ముందుకు" అని ప్రబోధిస్తారు. 'గుండెల మోత' అనే ఖండిక ప్రారంభంలో "ఉన్నవాడు నీ వాడా, కాదెప్పుడు నీకు తోడు; లేనివాడు నీ బంధువు వాడెప్పుడు వినడు గోడు" అంటూ విశ్వజనీనతను ప్రస్ఫుటించబోయిన పాదాల్లోని భావస్ఫురణ చివరి రెండు పాదాల్లో సంక్లిష్టంగా ఉంది. 'స్వాతంత్ర్యదినం' అనే ఇంకొక గేయంలో "మానవ లోకం చిగురించాలోయ్, మానుష ధర్మం ప్రవచించాలోయ్, మానవ శక్తిని దీవించాలోయ్, మానవులం మనం మహాతేజలం" అని రచయిత ఉద్యమిస్తారు.

ఛందో బంధాల్ని త్రెంచుకొని వ్యాకరణ మహోదధి మీదుగా స్వేచ్ఛా ప్రయోగాల వారధి కట్టి, లంకా దుర్గం వంటి సంప్రదాయాలనూ భాషా మర్యాదలనూ కలగుండు పరచి పాండిత్యాల అశోక వనంలో బంధింపబడిన కవితా సీతను నూత్న సమాజంలోకి కొనిరావడానికి అధునాతన సాంకేతిక ప్రభావ భావనాయుధాలతో సమరంచేస్తూ అనేకులు కావ్య రామాయణాలు సాగిస్తున్న ఈ రోజుల్లో "మహాతేజులం" అనిగానీ "రక్షదీక్షాసక్తి" (రక్షణపట్ల గల దీక్షకై ఆసక్తి అని విగ్రహ వాక్యం కావచ్చు) అనిగానీ ఈ గేయాల్లో ప్రయోగాలు కనిపించడం అనుచితం కాదేమో! ఉపమించి చెప్పాలంటే ఈ గేయాలు చెట్టునపండిన (పరిణత) మధుర ఫలాల కోవలోవి కావు, మాగు

ర్యాన్ని చవిచూపే ఆకాంక్షతో మ్రగ్గపెట్టి మ్రుగ్గించిన ఫలాలు.

'పి. ఎస్. ఆర్.'

## స్వీయచరిత్ర

[రచన డా॥ గిడుగు వేంకటసీతాపతి B. A., L. T., D. Lit. వెల: 75 పైసలు. ప్రచురణ: సన్మాన సంఘము.]

డా॥ సీతాపతిగారు ఆంధ్ర ప్రదేశములో సుప్రసిద్ధులు. మొదట వారి పితృపాదులయిన రావుసాహెబు గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారితోఁ గూడియు, తరువాత స్వయముగను డా॥ సీతాపతిగారు తెనుఁగు భాషకు, తెనుఁగు దేశమునకు సేవ చేసి కీర్తిగడించినారు.

పర్లాకిమిడి రాజావారి కాలేజిలో ఆధ్యాపకత్వము దగ్గరి నుండి ప్రారంభించి ఇటు వ్యావహారికాంధ్రభాషోద్యమము దాక అన్నింటను డా॥ సీతాపతిగారు తమ తండ్రిగారు ప్రారంభించిన కృషిని కొనసాగించి వారికి తగిన కుమారు లనిపించుకొన్నారు.

1885 సంవత్సరంలో విశాఖపట్టణము జిల్లా భీమునిపట్నమున మాతామహుల ఇంటిలో జన్మించిన సీతాపతిగారి బాల్యము పర్లాకిమిడిలో గడచినది. 1900 సం॥రములో మెట్రిక్యులేషనులో నుత్తీర్ణులయి మదరాసు క్రిస్టియను కాలేజి యందు చదివి సీతాపతిగారు 1905 సంవత్సరములో బి.ఏ. పట్టము తీసికొన్నారు. తరువాత కొంతకాలము పర్లాకిమిడి హైస్కూలులో ఉపాధ్యాయులుగా పనిచేసి 1907 లో రాజమహేంద్రవరము ట్రైనింగు కళాశాలలో చదివి యల్. టి. డిగ్రీని సంపాదించినారు. అటుతరువాత ముప్పది మూఁడేండ్లకు 1940 సంవత్సరములో సీతాపతిగారికి వారు సవరలను గూర్చి వ్రాసిన పరిశోధన వ్యాసములకును, సవరపాటలను ఆంగ్లములోనికి భాషాంతరీకరించినందునకును అమెరికాలోని ఇంటర్నేషనల్ అకాడమీవారు డి. లిట్. అను గౌరవ పట్టము నొసంగిరి.

డా॥ సీతాపతిగారు పర్లాకిమిడి హైస్కూలులో ఉపాధ్యాయులుగా ఉద్యోగము నారంభించి రెండు సంవత్సరముల తరువాత జయపురములోని హైస్కూలుకు ప్రధానోపాధ్యాయులుగ నియక్తులయిరి. కాని అది కూడ నొక్కయేడే సాగినది. తరువాత 1911 లో పర్లాకిమిడి రాజావారి కాలేజీలో వారి నాయనగారి స్థానమున చరిత్రోపన్యాసకులుగా నియమింపబడిరి. ఈ ఉద్యోగము 1931 దనుక సక్రమముగా సాగినది. తరువాత ఈ రాజాగారికిని సీతాపతిగారికిని అభిప్రాయభేదములు వచ్చి ఆ ఉద్యోగము మానుకొనిరి. ఇది సీతాపతిగారి ఔద్యోగిక జీవితము.

కాలేజీ ఉద్యోగము పోయిన తరువాత శ్రీ సీతాపతిగారు రాజకీయములలో ప్రవేశించి పర్లాకిమిడి తాలూకాబోర్డు ప్రెసిడెంటుగా ఎన్నుకొనబడిరి. పర్లాకిమిడిని ఒరిస్సాలో చేర్చరాదని తమ తండ్రిగారితో పాటుగా ఉద్యమము నడిపి ఆ సందర్భముగనే శ్రీ సీతాపతిగారు లండను దనుక వెళ్ళివచ్చిరి. తరువాత పర్లాకిమిడి ఒరిస్సాలో చేరుటయు సీతాపతిగారి కిబ్బందులు ఎక్కువగుటయు కారణముగా వారు రాజకీయ జీవితమునుండి విరమించుకొనిరి.

శ్రీ సీతాపతిగారు కొంతకాలము కొండల మీఁద సవరలతో నివసించి బైబిలు భాగములను సవర భాషలోని కనువదించిరి. మఱికొంత కాలము గూడవల్లి రామబ్రహ్మంగారి ప్రోత్సాహమువలన సినిమా రంగమున ప్రవేశించి అయిదారు సినిమాలలో నటించిరి. 1948 లో డా॥ సీతాపతిగారు తెలుఁగు బాషాసమితిలో చేరి 1957 వఱకు ప్రధాన సంగ్రాహకులుగాను, మొదటి సంపుటమునకు సంపాదకులుగాను పనిచేసిరి. సూర్యరాయాంధ్ర నిఘంటువు అయిదు, ఆఱు సంపుటములు డా॥ సీతాపతిగారి పర్యవేక్షణమున వెలువడినవి.

వ్యావహారిక భాషా వాదమున డా॥ సీతాపతిగారు వారి తండ్రిగారికి కుడి భుజముగా పనిచేసి వారి యనంతరముకూడ నా యుద్యమమును సాగించుచు వచ్చిరి. అయినను సీతాపతిగారికి గ్రాంధికమన ద్వేషములేదు. కనుకనే వారు పిఠాపురం రాజావారి కోరికపై సింగభూపాలుని రత్నపాంచాలికను గ్రాంధికాంధ్రములోనికి భాషాంతరీకరించినారు. డా॥ సీతాపతిగారికి కళాప్రపూర్ణ శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిగారు క్రిస్టియన్ కాలేజీలో గురువులు. శ్రీ బుఱ్ఱా శేషగిరిరావుగారు శ్రీ సీతాపతిగారికి బాల్యమున సహాధ్యాయులు.

సంస్కృతాంధ్రాంగ్ల సవర భాషలలో పండితులయిన శ్రీ సీతాపతిగారు ఈ నాలుగు భాషలలోను గ్రంథములను రచించిరి. అంతేకాదు; అన్నింటను అందెవేసిన చేయి యనిపించుకొనిరి.

ఈ స్వీయ చరిత్ర చిన్నదయ్యును వారి జీవితమును గుఱించిన యనేక విషయములను దెలుపునదిగా నున్నది. ఇందలి భాష వ్యావహారికము. డా॥ సీతాపతిగారు విపులమయిన స్వీయ చరిత్రమును వ్రాసినప్పుడు వారి తండ్రిగారు వ్యావహారికోద్యమమును నడిపినతీరును, అందు వారెదుర్కొన్నచిక్కులను, శ్రీ సీతాపతిగారు వారికి తోడ్పడినవిధము మున్నగువానిని వివరముగా వ్రాయవీలగును. ఇది చాల చిన్నదగుటచేత దీనిలో వాని వివరము లెక్కువగ లేవు. ఇట్లే వారు తమ చరిత్రమును గూర్చియు మఱికొన్ని వివరముల నందు వ్రాయవలసియుండును. అట్టిదానిని డా॥ సీతాపతిగారు పూనుకొని పూర్తి చేయవలెనని కోరుచున్నాను.

—అవధానం రాజేశ్వర శర్మ

## రవీంద్ర కథలు

(అనువాదం:- శ్రీ పురాణపండ కామేశ్వరరావు; ప్రచురణ:- బాల భారతీ ప్రచురణలు, రాజమండ్రి. మూల్యం:- 1-50. ప్రతులకు:- పురాణపండ "చిత్ర" విక్రమహోలు, రాజమండ్రి.)

ఈ సంపుటంలో మొత్తం 19 కథలు ఉన్నాయి. ప్రతికథ ఏదియో యొక నీతిని ప్రబోధిస్తూ ఉంటుంది. దీనికి తొలిపలుకులు వ్రాసిన శ్రీ దిశిక సూర్యప్రకాశరావు అన్నట్లు ఈ కథలలో భారతీయ సంస్కృతి. తేజము, క్షాత్రము, త్యాగశీలతలు ప్రతిఫలిస్తుంటాయి.

కథారచన అనేక పరిణామాలు చెంది ఈనాడు సాహిత్యంలో ఒకవిశిష్టతను సంతరించుకుంది. బాల సాహిత్యంలో సైతం కథా చిత్రణం ఎంతో అభివృద్ధి చెందింది. కథాగమనం, పాత్రపోషణతోపాటు మనస్తత్వ చిత్రణకు ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వబడుతున్నది. ఈ దృష్టితో కాక రవీంద్రుని నాటి పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని చూస్తే ఈ 'రవీంద్ర కథలు' అన్నీ సుభాషితాలుగా కనిపిస్తాయి. "ప్రారంభము, కథావికాసము, కథాంతము ఎట్లా చేయవలెనో అతనినుండి నేర్చుకొనవలెను" అని తొలిపలుకులలో అన్నాడు. కాని అనేక సాంకేతిక విలువల్ని పరిపోషించుకుంటూ పుంఖాను పుంఖాలుగా కథలు వ్రాస్తున్న ఈ రోజులలో ఈ కథలు చదివి ప్రక్రియా విశేషం నేర్చుకోవలసిందే లేదు.

బాల బాలికలలో త్యాగం, దీక్ష, సత్యం, ధర్మం వంటపట్టడానికి అవయస్సు యెక్కువ ఉపయోగపడుతుంది కనుక వాళ్ళ మనస్సుకు హత్తుకొనేట్టుగా ఈ కథలతో పాటు చిత్రాలుకూడా ఉంటె ఇంకా యెక్కువ ప్రయోజనకరంగా ఉండేదేమో!

ఈ సంపుటిలో 'చరణధూళి', 'సత్యకాముడు', 'అభిసారం' అనే కథలు భక్తిని ప్రేమ — వాత్సల్యాలను కరుణను ప్రబోదించేవిగా ఉన్నాయి.

'తీరిన పగ', 'తగినశాస్తి' కథలు త్యాగము, సౌశీల్యము ప్రేరేపిస్తాయి.

'పురస్కారం' అనే కథలో రామభక్తుడైన కబీరుదాసులోని సహనం, సాధుస్వభావం, ఆదరణచక్కగాచిత్రించబడినాయి.

'పీరబందా'లో సిక్కులకు — ముసల్మానులకు జరిగిన యుద్ధంలో విధివశాత్తు ఓడిపోయిన సిక్కులలోని క్షాత్రధర్మం, పటుతర దీక్ష పాఠకులలో ఉద్వేగాన్ని కలిగిస్తాయి.

'అంతిమశిక్ష' అనే కథలో గురు గోవిందసింహుని పరితాపాన్ని, మనస్తత్వాన్ని సహజంగా చిత్రించారు.

ఒక ఉద్వేగంలో గోవిందసింహుడు అకారణంగా ఒక పఠాను శిరస్సును ఖండిస్తాడు. తరువాత ఎంత పరితాపం చెంది కళంకాన్ని పోగొట్టుకోడానికై ఆ పఠాను ఏకైకపుత్రుణ్ణి అస్త్రవిద్యా పారంగతుణ్ణి చేస్తాడు. అయినా గురుగోవిందసింహునికి సంతృప్తి కలుగలేదు. చివరకు నీ తండ్రిని చంపినవాడిని తానే నని చెప్పి పఠాను బాలునిలో పౌరుషం, ఉద్రేకం కలిగించి అతని ఖడ్గానికాహుతియై మనశ్శాంతి పొందుతాడు.

'న్యాయాధీశుడు' అనేకథలో రామశాస్త్రి కర్తవ్యదీక్షాదక్షత, ఆయన నిరహంకారము, న్యాయంకోసం పదవీత్యాగం, చిత్రించారు.

సహగమనాన్ని అధిక్షేపిస్తూ విషజీవితాన్ని పరిష్మరణలో, దైవచింతనలో గడుపవలసిందిగా 'ప్రభువు' 'దొరికాడు' కథ చాటుతుంది. కాని 'వీరపత్ని' కథలో సహగమనాన్ని ప్రోత్సహించడంలో ద్వైదీభావం కనిపిస్తుంది.

బూందీనగర దుర్గాన్ని ముట్టడించాలని చిత్తోడు రాణా ప్రతిజ్ఞ చేస్తాడు. తన ప్రతిజ్ఞ నెరవేరేంతవరకు ఉపవాస దీక్షలో ఉంటాడు. పరిస్థితుల్ని అర్థం చేసుకున్న ప్రధానమంత్రి బూందీనగర దుర్గం ముట్టడించడం దుర్లభమనీ, రాజపుత్రులు ప్రాణాలొడ్డి అయినా తమకోటను రక్షించుకుంటారనీ, హాడా రాజపుత్రుణ్ణి ఓడించడం కష్టమని రాణాకు బోధిస్తాడు. అంతగా అయితే తమ ప్రతిజ్ఞ నెరవేర్చుకునేందుకు నకిలీ కోట కట్టిస్తాననీ దాన్ని ముట్టడించమంటాడు. రాణా అందుకు అంగీకరిస్తాడు. కాని ఆ నకిలీ కోటను సైతం ముట్టడించలేక పోతాడు. కుంభాను ఎదిరించలేక పోతాడు. రాణా రక్తంతో బూందీగడం మరింత పవిత్ర మవుతుంది. ఈ 'నకిలీ కోట' కథ వీరధర్మాన్ని, శౌర్యసాహసాల్ని రేకెత్తిస్తాయి.

'రాజప్రతినిధి'లో శివాజీ మహారాజు వివేచనాశక్తిని గురుభక్తిని వ్యక్తంచేస్తాయి.

'మణి ప్రభాతం' 'సువర్ణ కంకణం' కథలు ధనకనక వస్తువాహనాలకంటె భక్తి ప్రధానమని ఆత్మోత్సాహత్వమే మోక్షానికి మార్గమనీ సూచిస్తాయి.

రాయగడ్ రాజుకు హీరా అనే గొల్లపడుచు ప్రతి రోజూ రెండు పూటలా కుణి అనే ఆవుపాలు దూడకు మిగల్చకుండా తీసుకువెళ్ళి ఇస్తుండేది. దూడ ఆకలితో బాధ పడేది. హీరాకు ఒక బిడ్డకూడా ఉంది. ఒక రోజు సాయంత్రం రాజుగారికి పాలు తీసుకొని వెళ్ళి యిచ్చి డబ్బు తీసుకొని రావడంతో ఆలస్యం జరుగుతుంది. కోట ద్వారం మూసివేయబడింది. తలుపులు తెరువుమని ద్వారపాలకులను ఎంతో ప్రాధేయపడుతుంది రాజాజ్ఞను ఉల్లంఘించలేరు వాళ్లు. తను బిడ్డ పాలకోసం ఆకలితో అలమటించి పోతుందని బాధపడి కోటలో ఒక చోట కూలిపడిన మార్గం కనిపిస్తే ఎలాగో తప్పించుకొని తన కుటీరం చేరుకుని బిడ్డకు పాలిస్తుంది. ఈ అనుభవం ఆ గొల్లపడుచులో మార్పు తెస్తుంది. ఆ మరునాటి నుంచి దూడకు కడుపునిండ పాలు విడుస్తుంది. రాజుగారికి పాలు పోయడం మానివేస్తుంది. రాజు ఆ విషయం తెలుసుకొని గ్రహింపిపోతాడు. ఆ గొల్లపడుచుకు ఒక గ్రామాన్ని జాగీరుగా ఇస్తాడు. ఆ గ్రామానికి 'హీరామణి' అని పేరు పెడుతారు.

మొత్తానికి ఈ సంపుటంలోని కథలన్నీ నీతిప్రబోధకమైనవి.

అనువాదం శుభశైలిలో సరళంగా సాగింది. ఈ కథలు ఎక్కడా అనువాదంలా అనిపించక మూలకథలా అనిపించేట్టుగా ఉన్నాయనడంలో అతిశయోక్తి కాదు

— సింగరాజు

# ముఖ్యవార్తలు

## రాష్ట్రంలో

జూలై 4 - రాజమండ్రిలో జిల్లా ప్రధాన కార్యస్థాన వైద్యశాలకు కేంద్ర ఆరోగ్యశాఖా మంత్రిణి శంకుస్థాపన చేశారు;

జూలై 13 - తిరుపతిలో వెంకటేశ్వర విశ్వవిద్యాలయం గ్రంథాలయ భవనానికి రాష్ట్రపతి ప్రారంభోత్సవం చేశారు.

జూలై 14 - ఆంధ్రప్రదేశ్ పంచాయితీ సమితుల, జిల్లా పరిషత్తుల చట్టాన్ని సవరిస్తూ విధానసభ బిల్లును ఆమోదించింది.

జూలై 16 - విధానసభ వర్షాకాలపు సమావేశం నిరవధికంగా వాయిదా పడింది.

జూలై 18 - నాగార్జునసాగర్ ఆనకట్ట కుడివైపు గట్టున జరిగిన ప్రేలుడు ప్రమాదం కారణంగా పదముగ్గురు చనిపోయారు.

జూలై 25 - శాసనమండలి అధ్యక్షుడిగా శ్రీ జి. బ్రహ్మయ్య ఎన్నికయ్యారు.

శాసనమండలి 1964 సం. పు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసనసభ (ఇంగ్లీషు భాష వాడకం కొనసాగింపు) బిల్లును ఆమోదించింది. శాసనమండలి నిరవధికంగా వాయిదాపడింది.

జూలై 26 - నాగార్జునసాగర్ ఆనకట్ట వద్ద ఒక ఎయిర్ కండిషన్డ్ విశ్రాంతి గృహానికి, నాగార్జున కొండవద్ద మధ్య తరగతి ఆదాయ వర్గంవారికి ఒక విశ్రాంతి గృహానికి ముఖ్యమంత్రి శంకుస్థాపనలు చేశారు

జూలై 28 - 1959 సం. పు ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల చట్టాన్ని సవరించే బిల్లును గవర్నరు అంగీకరించారు.

జూలై 29-ఆంధ్రప్రదేశ్ ధాన్యం మరియు బియ్యం (నిలువల ప్రకటన, రిక్విజిషనింగ్) ఉత్తర్వును గవర్నరు ప్రకటించారు.

## భారతదేశంలో

జూలై 1 - యూనిటు ట్రస్టు పథకానికి కేంద్ర ఆర్థికమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

జూలై 2 - కేంద్ర మంత్రిగా శ్రీమతి ఇందిరాగాంధీ పదవీస్వీకారం చేశారు.

జూలై 6 - శ్రీరామ్‌కిషన్ నాయకత్వాన ఏడుగురు సభ్యులుగల పంజాబు మంత్రి మండలి పదవీస్వీకారం చేసింది,

జూలై 18 - కేంద్ర మంత్రి మండలిలో పదవుల పునర్వ్యవస్థీకరణ ప్రకటించబడింది.

బెంగుళూరులో రెండు రోజులు పాటుజరిగే అఖిలభారత పంచాయితీ పరిషత్తుల సమావేశానికి గుజరాతు ముఖ్యమంత్రి శ్రీ బలవంతరాయ్ మెహతా ప్రారంభోత్సవం చేశారు.

జూలై 25 - భారీ ఇంజనీరింగ్ శాఖ స్టేట్ మంత్రిగా శ్రీ టి. ఎస్. సింగ్ పదవీ స్వీకారం చేశారు.

జూలై 28 - భారతదేశానికి 100 పౌండ్లు ఋణ సహాయాన్ని కల్పించే ఒక ఒప్పందంలో భారతదేశం, ఇంగ్లాండులు సంతకాలు చేశాయి.

జూలై 29 - 22 వ భారత కార్మిక సమావేశం బెంగుళూరులో ప్రారంభమయ్యింది.

## విదేశాలలో

జూలై 1 - జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్ అధ్యక్షుడిగా హైన్రిచ్ లూబెక్ తిరిగి ఎన్నికయ్యారు.

జూలై 5 - న్యాసాలాండ్ మలావిగా స్వాతంత్ర్యాన్ని పొందింది.

జూలై 8 - కామన్వెల్తు ప్రధానుల సమావేశం లండన్‌లో ప్రారంభమయ్యింది.

జూలై 15 - రష్యా అధ్యక్షుడుగా అనస్టాస్ మికోయాన్ ఎన్నికయ్యారు.

జూలై 17-కెయిరోలో ఆఫ్రికా రాజ్యాల ద్వితీయ శిఖరాగ్ర సమావేశాన్ని అధ్యక్షుడు నాసర్ ప్రారంభించారు.

# జాతీయ రక్షణ కృషికి మీ పొదుపు ధనం అవసరం

మీరు ఎంత పొదుపు చేయగలిగితే అంత చేయండి. ఆ విధంగా పొదుపుచేసిన మొత్తాలను దిగువ సెక్యూరిటీలలో దేనికైనా పెట్టుబడి పెట్టండి.

*12 సంవత్సరాల జాతీయ రక్షణ సర్టిఫికెట్లు :*

సంవత్సరానికి 6¼ శాతం సాధారణ వడ్డీ లేక 4¾ శాతం చక్రవడ్డీ. రూ. 5 మొదలు రూ. 25,000 ల వరకు వివిధ డినామినేషన్లలో లభ్యమవుతాయి. విడిగా ఒక వ్యక్తి అయితే రూ. 35,000 ల వరకూ, ఇద్దరు వ్యక్తులు కలిసి అయితే రూ. 70,000 ల వరకు పెట్టుబడి పెట్టవచ్చు. (పోస్టల్ సేవింగ్స్ సర్టిఫికెట్లకు లోగడ ఏమైనా పెట్టుబడి పెట్టివుంటే దానితో కలుపుకొని).

*10 సంవత్సరాల రక్షణ డిపాజిటు సర్టిఫికెట్లు :*

ఏటా 4¾ శాతం వడ్డీ చెల్లించబడుతుంది. రూ. 50 ల గుణిజములలో లభ్యమవుతాయి. విడిగా ఒక వ్యక్తి అయితే రూ. 35,000 ల వరకూ, ఇద్దరు వ్యక్తులు కలిసి అయితే రూ. 70,000 ల వరకూ ఎక్కువలో ఎక్కువ పెట్టుబడి పెట్టవచ్చు. (3¾ శాతం. 4 శాతం ట్రెజరీ సేవింగ్స్ డిపాజిటు సర్టిఫికెట్లకు లోగడ ఏమైనా పెట్టుబడి పెట్టివుంటే దానితో కలుపుకొని).

*క్యుమ్యులేటివ్ టైమ్ డిపాజిటు పథకం :*

5, 10 లేక 15 సంవత్సరాలవరకు ప్రతినెలా రూ. 5, 10, 20, 50, 100, 200 లేక 300 చొప్పున డిపాజిటు చేసినట్లయితే తరువాత చక్రవడ్డీతోసహా పెట్టుబడి అధిక మొత్తంగా తిరిగి చెల్లించబడుతుంది.

*పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు అకౌంట్లు :*

రూ. 25 లు మొదలు రూ. 20,000 ల వరకు నిలువవుంచే మొత్తాలకు 3 శాతం చొప్పునా, రూ. 20,000 లకు మించి నిలువవుంచే మొత్తాలకు 2½ శాతం చొప్పునా వడ్డీ చెల్లించబడుతుంది. ఒక వ్యక్తి రూ. 15,000 ల వరకూ నిలువ చేయవచ్చు.

*15 సంవత్సరాల అన్యూటీ సర్టిఫికెటు :*

జారీచేసే ధర : రూ. 1,330, రూ. 3,325, రూ. 6,650, రూ. 13,300, రూ. 26,600. సంవత్సరానికి 4.25 శాతం చక్రవడ్డీ చొప్పున, 15 సంవత్సరాలలో నెలవారీ చెల్లింపుల రూపంలో డబ్బు తిరిగి ఇవ్వబడుతుంది. ఒక వ్యక్తి రూ. 26,600 ల వరకు పెట్టుబడి పెట్టవచ్చు.

చిన్న మొత్తాల పొదుపు పత్రాలకు పెట్టిన పెట్టుబడులపై లభించే వడ్డీకి ఆదాయపు పన్ను, సూపర్ టాక్సులు వుండవు.

"మీరు చేసే పొదుపుమీదనే మీ భద్రత, మీ పిల్లల శ్రేయస్సు ఆధారపడి వుంది."

ఇతర వివరాలకొరకు, హైద్రాబాదు 10–2–2, ఏ. సి. గార్డ్స్ రోడ్డులోని ఆంధ్రప్రదేశ్ నేషనల్ సేవింగ్స్ ప్రాంతీయ డైరెక్టరు (భారత ప్రభుత్వం)ను కానీ లేక మీ కలెక్టరేటులోని జిల్లా ఆర్గనైజరునుకానీ లేదా మీ సమీపంలోని తపాలా కార్యాలయాన్నికానీ దయచేసి సంప్రదించండి.



నెలకు రూ. 100/- చొప్పున రాబోయే 12 సంవత్సరాల పాటూ మీరు 12-సంవత్సరాల దేశరక్షణ సర్టిఫికెట్లను కొనినట్లైతే ఆ 12 సంవత్సరాల తరువాత ప్రతి మాసానికీ ఒక సర్టిఫికెట్టు గడువు తీరి మీకు నెల ఒక్కింటికి రూ. 175/- చొప్పున ఆదాయాన్ని తీసుకు వస్తుంది. పన్ను లేనటువంటి ఈ నెలసరి ఆదాయము వృద్ధాప్యములో మీకు నిశ్చితమైన పెన్షనును తీసుకువస్తుంది.

# మీకు ప్రతి నెలావచ్చే పెన్షను

మీరు ఇష్టపడినట్లైతే, ఈ సర్టిఫికెట్ల గడువు తీరిన తరువాత అవచ్చాసొమ్ములో 75 రూపాయలను మీరు వుంచుకొని, మిగిలిన అసలు మూలధనం 100 రూపాయలనూ తిరిగి దేశరక్షణ సర్టిఫికెట్లలో మదుపు పెట్ట వచ్చును. ఆ విధముగా కొత్తగామదుపు పెట్టిన తేదీ నుండి మరియొక పన్నెండు సంవత్సరాల పాటు మీకు గాని, మీపై ఆధారపడివుండేవారికి గాని నిశ్చితమైన ఆదాయము లభిస్తుంది. మీకుగాని, మీపై ఆధారపడివుండే వారికి గాని దేశరక్షణ సర్టిఫికెట్లు అత్యున్నతమైన భద్రతను సమకూర్చే సాధనాలు.

---

## దేశ రక్షణా సర్టిఫికెట్లను కొనండి

---


జాతీయ పొదుపు ఉద్యమ సంస్థ

DA 64/219

సహకారయుతమైన వాతావరణమును సృష్టించుకొని, ఐకమత్యముతో మనమందరమూ భారత దేశ అభివృద్ధికి, మన దేశప్రజల సౌభాగ్యానికీ పాటు పడదాము. ఈ ఒక్క పద్ధతి ద్వారానే మనం మన భారతమాత సేవ చేయగలుగుతాము; పటిష్టమైన, మహత్తరమైన ఐక్యభారత నిర్మాణానికి ఇది ఒక్కటే మార్గం.

—జవహర్‌లాల్ నెహ్రూ

# ఒకే జాతి, ఒకే దేశం

దేశములోని వివిధ ప్రాంతాలకు చెందిన ప్రజలు—ఒక ప్రత్యేక సమస్యపైన తమ తమ అభిప్రాయాలు ఎంత తీవ్రమైనవి అయినా—తాము ప్రధానముగా భారతీయులమనీ; ఒకే జాతి, ఒకే దేశము అనే పరివర్తింపరాని ఒకే సూత్రానికి కట్టుబడి మాత్రమే తమ వివేదాలను పరిష్కరించుకొనవలెననీ విస్మరించరాదు.

—లాల్ బహాదుర్ శాస్త్రి
ప్రధాన మంత్రి

దేశప్రజలందరికీ స్వాతంత్ర్య, సౌభాగ్యాలతో పటిష్ఠమైన భారతావనిని నిర్మించాలన్న మన మార్గం తిన్ననైనదీ, స్పష్టమైనదీను.

ధైర్యముతో, స్థిర నిశ్చయముతో, సహన సద్భావములతో ఒకే జాతిగా పని చేసి, కలసి మెలసి ప్రగతిమార్గములో ముందుకు సాగుదాం.

# జై హింద్

ఐకమత్యాన్ని, స్వాతంత్ర్యాన్ని పరిరక్షించండి.

DA 64/148

Edited & Published by the Director of Information and Public Relations, Andhra Pradesh, Hyderabad-1.
Printed at YUVA PRESS, Public Garden Road, Hyderabad.

మానవునికీ యంత్రానికీ మధ్య
సయోధ్య అత్యవసరం.
ఇది ఖర్చులను అయిదువిధాల తగ్గిస్తుంది.
డబ్ల్యు 5 క్రిషి

* దీర్ఘకాలం మనుతుంది.
* చాలా వేగంగా పనిచేస్తుంది.
* ఇతోధిక సామర్థ్యంతో సజావుగా పనిచేస్తుంది.
* విడిభాగాల మార్పు అవసరం తక్కువ.
* పునాది త్రవ్వనవసరం లేదు.



# డబ్ల్యు 5 క్రిషి 5 హార్సు పవరు

కిరోసిన్ ఇంజన్లు
డైకిన్ జపానువారి అనుమతితో

ధర రూ. 1450
ఎక్సైజు డ్యూటీ, సేల్సుటాక్సు అదనం
ఇతర పరికరాలు అదనపు వెలలకు దొరుకును.

పరిశ్రమలోనూ, వ్యవసాయంలోనూ అన్నిపనులకు పనికివచ్చు ఇంజను.

డబ్ల్యు 5 టైపు క్రిషి హార్సు కూల్డ్ కిరోసిన్ ఆయిల్ ఇంజను పూర్తిగా మూయబడినది.
4 స్ట్రోకులు, మాగ్నెటు ఇగ్నిషను, ఆటోమాటిక్ లూబ్రికేషను, ప్రత్యేకముగా
వ్యవసాయ పనులకు ఎంతో అనువైనది. ఇది జనపదాల రూపురేఖలను మార్చివేయడం తథ్యం.

ఏ – 12 స్టార్ ఫీచర్ యూనిట్ !

ఈ క్రింది యంత్రములు నడుపుటకు అత్యంతానుకూలమైన ఇంజను.

1. నీళ్ళపంపులు
2. పవరు టిల్లర్లు (మరనాగళ్ళు)
3. పవరు స్ప్రేయర్లు
4. ఎలక్ట్రిక్ జనరేటర్లు
5. చెరుకు గానుగలు
6. బియ్యము మరలు (హల్లర్లు, షెల్లర్లు)
7. కాంక్రీటు మిక్సర్లు
8. ఏర్ కంప్రెసరు (పోర్టబుల్)
9. వెల్డింగు సెట్లు
10. గడ్డి కత్తిరించు యంత్రములు
11. చిన్నపడవలు
12. బరువులు ఎత్తు యంత్రములు

ఆంధ్రప్రభుత్వపు వ్యవసాయశాఖ డైరెక్టరుచే "తకావి" క్రింద అనుమతించబడినవి.



ఇతర వివరములకు మాకు వ్రాయండి :

## క్రిషి ఇంజన్స్ ప్రైవేటు లిమిటెడ్

గ్రామ్సు : క్రిషింజన్
ఫ్యాక్టరీ : ఎ - 7 యూనిట్, ఇండస్ట్రియల్
ఎస్టేట్, సనత్‌నగర్, హైదరాబాద్ - 18
(ఆం.ప్ర.) ఫోన్ : 35806, సేల్సు ఆఫీస్ :
నెం. 2. దుర్గాభవన్, రాష్ట్రపతి రోడ్,
సికింద్రాబాద్ (ఆం.ప్ర.) ఫోన్ : 73065

మీ ఖావి అభివృద్ధికి మమ్ముల తోడ్పడ నివ్వండి.

Andhra Pradesh, September, 1964 Regd. No. H. 133

గ్రామ్స్ . 'యువ' ఫోన్ : 36336

# యువ

అక్టోబరు సంచికలో:

బంకిమ చంద్రుని 'రజని' 80 పేజీల
సంక్షిప్త నవల


| | | |
|---|---|---|
| సంధి | ... | యతీంద్ర మోహనసింహ |
| నాకు చచ్చిపోవాలనివుంది (బాపు చిత్రాలతో) | ... | ముప్పాళ రంగనాయకమ్మ |
| అందని పూలు | ... | బలివాడ కాంతారావు |
| నిష్కృతి లేదు | ... | వై. జానకి |
| భ్రమ | ... | ఏ. పంకజవల్లి |
| చక్రనేమి (సీరియల్) | ... | కోడూరి కౌసల్యాదేవి |


ఇంకా మామూలు శీర్షికలు, కార్టూన్లు, పాపయ్యగారి ముఖచిత్రంతో

ఈ నెల 25 తారీకుకు విడుదల అవుతుంది

యువ ఆఫీసు: పబ్లిక్ గార్డెన్ రోడ్, హైద్రాబాద్-1